# మధురవాణి

ఆమె ! ఎవరోకాదు
"ఎవరో కాలుజారిన సత్పురుషుని పిల్ల" కాదు
మన సంస్కృతి కడుపును శస్త్రచికిత్స చేసి తీస్తే
బయటకొచ్చిన మధుర ఫలం ! ఆమె
ఆమె అక్కలు సరిగ్గా మన తల్లులని చెబితే నమ్మరా ! ఎవరూ ?
వావి వరసల మాటకొస్తే ఆమె మన కేమవుతుందో
తెలవనివ్వరు మన "అయ్యలు" !
ఆమె "చక్రం అడ్డు వేసింది కాబట్టి సరిపోయింది" గాని
లేకపోతేనో....
మన "కుటుంబం పుట్టుక" చావు చూసి బావురుమనేవాడు ఏంగెల్స్
చచ్చే సంస్కృతిని చావనిచ్చి ఎవరింటన వారిని దించి
గురజాడ కిచ్చిన మాట నిలబెట్టింది కనకనే
ఆమె ! ఎవరోకాదు
ఎందరో సత్కవుల కలాల కందని "కళింగరాజ్య" కావ్యనాయక.
మన పురుష ప్రవృత్తిని వివస్త్రను చేసి చూస్తేనే
రూపు కట్టిన సప్తవర్ణ "పొటిగరాపు" బొమ్మ ! ఆమె
ఆమె సరసులు సరిగ్గా మన వంశ పారంపర్యతకు
ప్రతినిధులని చెబితే నమ్మరా ! ఎవరూ ?
కులగోత్రాల మాటకొస్తే ఆమె మన కేవరస నుంటుందో
అర్థం కానివ్వరు మన "అవధానులు" !
ఆమె "కంటె"తో ఘనకార్యం మెడ నలంకరించి కథ నీడ్చుకెళ్లిందిగాని
లేకపోతేనో....
మన హైందవి వైధవ్య ప్రాప్తిని తెలిసి ఉరేసుకొనేవాడు మనుష్య
మంచి "మునిగితే తేల"నిచ్చి "తప్పుదిద్దుకొంటి"ని సూచించు
మహాకవి కిచ్చిన మాట నిలబెట్టుకుంది కనకనే
ఆమె ! ఎవరోకాదు
ఎందరో విద్వత్కవుల గ్రాంధికవాదుల కందని
"తెలుగు'వాడి" భాషోద్యమ సృజన మధురవాణి.

— ఛాయరాజ్

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక

సంపుటి : 15 సంచిక : 11

ఆగస్టు 1992

రచనలు పంపవలసిన చిరునామా

**నిర్మలానంద**, వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

**మేనేజర్, ప్రజాసాహితి,**
29-28-67, దాసరివారి వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :
**కొత్తపల్లి రవిబాబు**, ప్రధానకార్యదర్శి
జనసాహితి, నగరం-522 268

వెల : రూ. 5 సం॥ చందా రూ. 50

ఈ సంచిక వెల : రు. 10-00





ముఖచిత్రం :

**బాపు**



రెండవ కవరుపేజీ :

**మధురవాణి (కవిత)**

**—ఛాయరాజ్**



నాలుగవ కవరు పేజీ :

**తునికాకుకూలి పోరాటపాట**

**—నూతన్ (జనంపాట)**

ఇందులో...


| | | |
|---|---|---|
| గురజాడ ముఖచిత్రం | | 3 |
| సంపాదకీయం | | 5 |
| కామ్రేడ్ గురజాడ | —శ్రీశ్రీ | 9 |
| స'జీవ' కన్యాశుల్కం | —కొత్తపల్లి రవిబాబు | 11 |
| మధురవాణి నవ్వు (కవిత) | —వసీరా | 18 |
| కన్యాశుల్కం - రచనా సంవిధానం - ప్రదర్శన | —కాకరాల | 20 |
| గురజాడ నిపుణవాణి మధురవాణి | —డా॥ సంజీవదేవ్ | 49 |
| బంగోరె 'మొట్టమొదటి కన్యాశుల్కం'పై సమీక్షలోని శకలాలు | | 53 |
| ఎన్ని నెరజాడలున్నా గురజాడకు సాటిరావు (రు) | —డా॥ చప్ప సూర్యనారాయణ | 55 |
| పదాలు మళ్ళీ ఊపందుకున్నాయ్ (కవిత) | —అల | 62 |
| గురజాడ నాటకాలు | —డా॥ యం. ఎ. నరసింహమూర్తి | 63 |
| కన్యాశుల్కంలో స్త్రీ పాత్ర చిత్రణ | —జి. భవాని | 69 |
| కన్యాశుల్కము - రచన: ప్రదర్శన: ప్రశంస | —తెలుగు హార్పు | 75 |
| దేశమంటే మనుషులోయ్ (కథ) | —చిత్ర | 79 |
| గురజాడ (కన్యాశుల్కం) - జాతీయోద్యమం | —వి. రామకృష్ణ | 97 |
| వేగుచుక్క గురజాడ | —దివి కుమార్ | 104 |
| కన్యాశుల్కం - చారిత్రక నేపథ్యం | —కె. వెంకట్రామయ్య | 111 |
| అవసరాల సూర్యారావు జ్ఞాపకాలు | —జయంతి రామలక్ష్మణమూర్తి | 118 |
| పిల్లల ప్రపంచం | —నిర్వహణ పి. చంద్రశేఖర్ అజాద్ | 121 |
| కథ అడ్డంగా తిరిగింది | —పామరుడు | 123 |
| నాటకేషు కన్యాశుల్కం.... | —గోపరాజు నారాయణరావు | 126 |
| గిరీశం పాత్రలోని విశిష్టత | —నవీన్ | 129 |
| ఎర్ర మెరుపు (కవిత) | —వెన్నెల | 135 |



నాది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికి వదులుకోను. — గురజాడ

# సంపాదకీయం

## కన్యాశుల్కం ప్రదర్శన శత జయంతి
## (1892 - 1992)

తెలుగు సాహిత్యంలో ప్రజా దృక్పథానికి ఆద్యుడూ, మన నడతలకు కొత్త దారులు నిర్దేశించి, వాటి జాడలలో సాగిపొమ్మని శాశ్వత ముద్రలు చిత్రించి గురు తుల్యునిగా నిలిచినవాడు గురజాడ అప్పారావుగారు. భూస్వామ్య వ్యవస్థ, దాని సంస్కృతీ నిలవ నీరులా కుళ్ళి కంపు కొడుతూంటే, మానవతా వాదపు సుగంధాల సాహిత్యాన్ని సృజించిన ప్రజాస్వామికుడు ఆయన. తన సమకాలీన భారతీయ కవులలో, రచయితలలో అత్యుత్తమ సంస్కారాన్ని, నైపుణ్యాన్ని, విశాల తాత్విక దృక్పథాన్నీ కలిగి వున్న యుగకర్త ఆయన.

"పుష్కలమైన, అనంతమైన సంఘటనలతో నిండివున్న ఎంతో గాంభీర్యమూ, వైవిధ్యమూ గల నేటి జీవితాన్ని వీక్షించాక రచయితలు, ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ప్రాచీన కాల్పనిక కథల నుంచి యితివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో నాకు అర్థం కావడంలేదు...." అని గురజాడవారే రాసుకున్నారు. అందువల్ల తాను రచించిన 'కన్యాశుల్కం' నాటకాన్ని అత్యుత్తమ సాహితీ సామాజిక విలువలు గలదిగా రూపొందించారు. ఈ నాటకం తొలి ప్రదర్శన జరిగి, 1992 ఆగస్టు 13వ తేదీకి నూరు సంవత్సరాలు పూర్తయ్యాయి.

సంస్కృత నాటకాలు తప్ప వేరు భాషా నాటకాలు ప్రదర్శించని 'జగన్నాథ విలాసినీ డ్రమెటిక్ కంపెనీ' వారు తొలిసారిగా 'కన్యాశుల్కం' నాటకాన్ని ప్రదర్శించారు. ఈ డ్రమెటిక్ కంపెనీని విజయ నగరం మహారాజా ఆనంద గజపతి స్థాపించారు. నాటకం ఆద్యంతం వ్యావహారిక తెలుగులో రాసింది. నిత్య జీవితంలోని పాత్రలు, కన్యల్ని అమ్ముకొనడం, విధవల కడగళ్ళు, నకిలీ సంఘ సంస్కర్తలు, దగాకోర్లు, కోర్టు వ్యవహారాలు-యిలా జీవితంలో వున్న ఎన్నెన్నో అంశాలు నాటకంలో చోటు చేసుకున్నాయి. నాటకంలో పద్యాలు లేవు. అయినా సమకాలీన సాంఘిక జీవితం కళ్ళకు కట్టినట్టు చిత్రించబడటంవల్ల, నాటకాన్ని చూడ్డానికి జనం తండోపతండాలుగా, బళ్ళు కట్టించుకుని మరీ చూసేవారు. ఈ నాటక ప్రదర్శనని తెలుగు నాటక సాహిత్యంలో ఒక 'సంఘటన'గా పత్రికలు ప్రశంసించాయి.

గురజాడ అప్పారావు 'జాతీయ పునరుజ్జీవనం' కోవకి చెందిన సాహితీవేత్త.

ఆంగ్ల విద్యతోపాటు, హేతువాదాన్నీ, వైజ్ఞానిక దృష్టినీ అలవరచుకొని, ఆధునిక దృక్పథాన్ని సంతరించుకున్నవాడు. సమాజం యెడల బాధ్యతగల సామాజికుడు. ఆదిలో ఆంగ్లంలో సాహిత్య వ్యవసాయం ప్రారంభించి, 'రీస్ అండ్ రయ్యత్' పత్రిక సంపాదకుడు శంబు చంద్ర ముఖర్జీగారి సలహానుసరించి తన దృష్టిని తెలుగు సాహిత్యంవేపుకి మరల్చాడు. ఆనాడు పాఠశాల పండితులే కవులుగా, రచయితలుగా చెలామణీ అవుతుండేవారు. ఏ కొత్తదనమూలేని సుప్రసిద్ధ కల్పిత గాధలు వస్తువులు. గ్రాంథిక భాషలో రచన చేస్తూండేవారు. జనులు మాట్లాడుకొనే వాడుక భాష, సమకాలీన జీవితం వారికి పట్టేవికావు.

డబ్బుకి కక్కుర్తిపడి, కన్న తలిదండ్రులే ముక్కుపచ్చలారని పసిబాలికలను, రాలిపోవడానికి సిద్ధంగావున్న పండుముసలి వారికి అమ్మివేసే దురాచారం నాడు కళింగాంధ్రంలో ఉన్నత కులాలలో వుండేది. దీనికి సంబంధించి ఆనంద గజపతి గారు సర్వే చేయించారు. ఆ వాస్తవాలు ఒళ్ళు గగుర్పొడిచేలా వున్నాయి. మద్రాసు కౌన్సిల్‌లో 1887 లో ఆయన ప్రవేశపెట్టిన 'కన్యాశుల్కం' బిల్లు బుట్టదాఖలా అయిపోవడం, బాల విధవల దుర్భర జీవితం, శిథిలమయివున్న సామాజిక వ్యవస్థ-ఇవన్నీ గురజాడ కళ్ళముందుకొచ్చాయి. "నేను రచయితను కావాలనుకోవటంలే"దనుకుంటూనే ఆనంద గజపతి ప్రోత్సాహంతో కలం చేపట్టాడు. సమాజంలో అత్యధిక శాతం నిరక్షరాశ్యులు. సాంఘిక దురాచారానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని సమీకరించాలి. అందుకు నాటక ప్రక్రియే సరైనది. తాను అధ్యయనం చేసిన విశ్వ సాహిత్య పరిచయం, బెంగాలీ, తమిళ నాటకాల పరిచయాలూ, వ్యావహారిక భాష అవశ్యకత, తెలుగులో దాన్ని ప్రవేశ పెట్టాల్సిన అవసరం, కథా వస్తువుని హాస్యంతో మేళవింపచేసి, సమస్యని వివిధ కోణాల్లో చిత్రించడం, పరిష్కారం ప్రజలకే విడిచిపెట్టడం. ఇదీ నాటకం గురించి ఆయన పథకం. ఫలితంగా 'కన్యాశుల్కం' రచన రూపొందింది. తొలి ప్రదర్శన 1892లో, అచ్చు 1897లో అయ్యాయి. 12 ఏళ్ళ తర్వాత నాటకాన్ని మొత్తంగా తిరగ రాశాడు గురజాడ, విశ్వనాటకరంగాన్ని అధ్యయనం చేసిన అనుభవ సారంతో.

కన్యాశుల్కం దురాచారం యీనాడు సమసిపోయి వుండవచ్చుగాక, అయినా నాటకం యీ నాటికీ సజీవంగానే వుంది. కారణం-నాటకంలో చిత్రించిన ఆనాటి సాంఘిక వ్యవస్థ, సజీవ పాత్రలూ, కళాత్మక విలువలూను. ఇలాంటి నాటకం భారతీయ భాషల్లో కానరాదు. అంతేకాదు. విశ్వ సాహిత్యంలో సయితం ఎన్నదగ్గ అత్యుత్తమ నాటకాల్లో ఈ నాటకాన్ని ఒకటిగా చేర్చుకోవచ్చు.

వందేళ్ళ చరిత్రగలిగిన ఈ నాటకం కన్నడంలోకి 1930 లో, తమిళంలోకి 1964లో, ఇంగ్లీషులోకి 1964 లో, రష్యన్‌లోకి 1969 లో, హిందీలోకి 1988 లో అనువదింపబడింది.

తెలుగులో 'కన్యాశుల్కం' నాటకంపై వచ్చినంత సాహిత్యం మరే ఇతర రచనకీ రాలేదు. ఇతర భాషలోకి ఈ నాటకాన్ని అనువాదం చేసేటపుడు, దీని ప్రాశస్త్యాన్ని తెలియజేసే వివిధ అంశాలను 'ముందు మాట'లో ఇవ్వడం వల్ల అనువదింపబడిన భాషా పాఠకులు ఈ నాటకం గొప్పతనాన్ని తెలుసుకోగలుగుతారు.

ఇటీవలె 'కన్యాశుల్కం' హిందీ అనువాదం మేము చూడటం తటస్థించింది. అనువాదకులు ఖమ్మంకి చెందిన తెలుగు వారైన హిందీ పండితులు డా॥ యం. బి. వి. ఎ. ఆర్. శర్మగారు. ప్రచురణ కర్తలు ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమి వారు. 'అకాడమి తరఫున' అన్న ముందు మాటలో వారు "తాము కోరినంతనే మరొక తెలుగు వారయిన హిందీ రచయిత వారణాశి రామ్మూర్తి 'రేణు'గారు మూల రచనతో హిందీ అనువాదాన్ని సరిచూశా"రని చెప్పుకున్నారు. తీరా చూస్తే, అనువాదం హిందీ పాఠకులను ఉత్సాహంగా చదివించేదిగా లేదు. ఇటువంటి అనువాద కార్యానికి హిందీ, తెలుగు - రెండు భాషల్లోనూ నిష్ణాతులయిన అనువాదకులను ఎంపిక చేసుకోవాలి. ఒకవేళ అలా సాధ్యపడనపుడు, చేసిన అనువాదాన్ని పరిణతి చెందిన ఏ హిందీ రచయితకో ఇచ్చి సరిచేయించాలి. అలాగే మరే యితర భాషలో నైనాను.

ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమి వారే 30-11-1986 తేదీన - గురజాడ వర్థంతినాడు - హైదరాబాదు నగరంలో 'గురజాడ వ్యక్తిత్వం - సాహిత్యం'పై హిందీలో ఒక సెమినార్‌ని నిర్వహించారు. తర్వాత 1987 లో ఆ పత్రాలన్నిటినీ కలిపి హిందీలో ఒక పుస్తకంగా వెలయించారు. పుస్తకం పేరు 'గురజాడ అప్పారావ్ : వ్యక్తిత్వ ఔర్ కృతిత్వ'. ఈ సెమినార్‌లో తెలుగు వారైన సుప్రసిద్ధ హిందీ సాహితీవేత్తలతో పాటు, ఇద్దరు హిందీవారు కూడా పాల్గొనడం విశేషం. వారు డా॥ దిలీప్ సింగ్, డా॥ చంద్రభాన్ రావత్. ఈ ఇద్దరూ దక్షిణ భారత హిందీ ప్రచార సభ, హైదరాబాదు శాఖకి చెందిన హిందీ రిసెర్చ్ సెంటరులో ఒకరు హిందీ రీడరుగానూ (డా॥ సింగ్), మరొకరు హిందీ శాఖాధిపతిగానూ (డా॥ రావత్) పని చేస్తున్నారు. వారి ప్రసంగ వ్యాసాల్లో గురజాడ సాహితీ వ్యక్తిత్వానికి సంబంధించి చెప్పిన విషయాలు కొన్ని యీ దిగువ ఇస్తున్నాము :

డా॥ దిలీప్ సింగ్ - శ్రీ గురజాడ అప్పారావ్ - వ్యక్తిత్వ ఔర్ కృతిత్వ :

"....హిందీలో జాతీయ పునరుజ్జీవన యుగాన్ని 'భారతేందు యుగం' అనీ, నవచైతన్యం, సంఘ సంస్కరణ యుగాన్ని 'ద్వివేదీ యుగం' అని పిలుస్తారు. ఈ రెండు యుగాలూ కలిసి 1857 నుంచి 1918 వరకూ అని నిర్ణయించడం జరిగింది. తెలుగులో ఆధునిక యుగం 1800 నుంచి ప్రారంభమయిందని, ఈ కాలాన్ని మూడు యుగాలుగా విభజించి, ఒకొక్క యుగానికి ఒకొక్క యుగ ప్రవక్త పేరు పెట్టారు. బ్రౌను యుగం (1800 - 1850), వీరేశలింగం యుగం (1850-1900),

గురజాడ★ యుగం (1900 - 1915). హిందీలోని రెండు యుగాలతో తెలుగులోని మూడు యుగాలనూ సమన్వయించుకోవాలి."

o o o o

"కాలేజీలో పని చేస్తూండిన కాలంలో గురజాడ 'కన్యాశుల్కం' అనే నాటకం రాశారు! పైన చెప్పినట్టుగా బ్రహ్మ సమాజం మొ॥ సంస్థలు సంఘంలో వేళ్ళూనుకొని వున్న సాంఘిక దురాచారాలనూ, స్త్రీల దయనీయ స్థితినీ పారదోలేందుకు ఆందోళన చేపట్టాయి. ఇలాంటి కథా వస్తువు నుంచి సాహిత్యం తటస్థంగా వుండజాలదు గదా. గురజాడ ఈ నాటకంలో సాంఘిక దురాచారాలపైనా, సమాజంలోని చెడుగుల పైనా దాడి చేశారు."

o o o o

డా॥ చంద్రభాన్ రావత్ - 'గురజాడ అప్పారావ్: యుగ చేతనా:'

"ముత్యాల సరాలు ఓ ప్రత్యేక తరహా ఛందస్సు. ఇందులో ఏడు మాత్రలుంటాయి. హిందీ కవి (జయశంకర్) ప్రసాద్ 'ఆంశూ' అనే కావ్యంలో ఇదే (సఖీ) ఛందస్సుని ఉపయోగించారు.

o o o o

"(సాహిత్యంలో వ్యావహారిక) భాషను ప్రయోగం చేసిన గురజాడని, హిందీ కవి హరి ఔధ్‌తో సరిపోల్చవచ్చు."

నూరేళ్ళ ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమం ఎన్నెన్నో ఒడిదుడుకుల నెదుర్కొంటూ మరింత విశాలమూ, పదునూ సంతరించుకుని, నూతన ప్రజాస్వామిక విప్లవ దిశగా సాగుతోంది.

భవిష్యత్తు బాటలు నిర్మించుకోడానికి గతాన్ని వెదుర్కోవాలే తప్ప, పూజించడానికి కాకూడదు. గురజాడను స్మరించుకోవటం మొక్కుబడి వ్యవహారం కాదు. ఆయన బోధించినట్టుగా సమకాలీన జీవిత సంక్లిష్టతల్ని ప్రతిబింబించి, వాటికి పరిష్కార మార్గాల్ని సుగమం చెయ్యాలి.

కాలాన్ని జయించిన 'కన్యాశుల్కం' నాటకాన్ని సృజించిన గురజాడకి జేజేలు పలుకుతూ, ఆయన స్పిరిట్‌కి పునరంకితం అవుతూ, ఆయన వారసత్వాన్ని అందిపుచ్చుకుని ముందుకు సాగాలి.

---

★ 'కన్యాశుల్కం' నాటకం సజీవ సామాజిక దృశ్యం. సమకాలీన జీవితంలోని ఒక భాగపు వాస్తవిక దర్పణం. ఏ ఒక్క పాత్రా కల్పితం కానన్నంత బలమైన జీవిత పునాదులు గల చిత్రీకరణే ఈ నాటకం యొక్క ప్రత్యేకత.

— దివి కుమార్

('అయోధ్యలో రావణాకాష్టం' నుంచి)

# కామ్రేడ్ గురజాడ

—శ్రీ శ్రీ

ఒకప్పుడిదో పేళాకోళపు మాట. కమ్యూనిస్టులు గురజాడను కామ్రేడుగా మార్చి అందల మెక్కించారంట. అంతేగాని గురజాడ కవి కానే కాడట.

ఇప్పటికీ గురజాడను కవిగా గుర్తించని గాడిదలున్నాయి. ఈ రెండు కాళ్ళ గాడిదలకి ఇప్పటికీ ఘన సన్మానాలు జరుగుతూనే ఉన్నాయి. స్వచ్ఛమైన సత్యాన్ని చంపి చచ్చుపుచ్చు అబద్ధాలనే కవిత్వంగా చలామణీ చేసే వాళ్ళకి గురజాడ లోని మహత్తర మానవత్వం అర్థం కాదు. వీళ్ళకి ఎదుటివాడు ఒక దేవతగానో, రాక్షసి గానో కనబడతాడే తప్ప తనలాంటి మనిషిగా కనిపించడు.

ఎవణ్ణి నీ నెత్తి మీద కత్తిసాము చేసే నిరంకుశ ప్రభువుగా గాని నీ కాలికింద పడి అఘోరించే బానిస పురుగుగా గాని భావించక పోవడమే కమ్యూనిజం.

ఇవాళ నీ ఇంటికి రెండు వేల రూపాయలతో వచ్చినవాడే నీ పాలిట దేవత. వాడి ఇష్టార్థ ప్రీత్యర్థం నువ్వెన్ని అబద్ధాలు ఆడటానికైనా జంకవు.

నీ ఇంటి ముందు నిలబడ్డ రిక్షా వాడొక రాక్షసుడు. వాడి రక్తం వేరు. నీ రక్తం వేరు. అలా నీ మతం చెబుతుంటే. నీ సంస్కారం చెబుతుంది. "పవిత్రం అంటె మీదీ నాదీ !.... నేను వెధవముండనీ, మీరు సరసులా" అని మీనాక్షి రామప్పంతులతో అంటుంది. ఇలాంటివి కన్యాశుల్కం నుండి కోకొల్లలు. ఇవి ముసుగు కప్పని నిజాలు.

ఒరేయ్ అపవిత్రుడా! కళ్ళుతెరు.

గురజాడ గురించి ఇవాళ కొత్తగా ఏం రాయగలననుకున్నాను. కాని 'కన్యాశుల్కం' నాటకం తలచుకుంటేనే చాలు ఈ మానవ జీవితం మీద ఎన్నో కొత్త వెలుగులు ప్రసరిస్తాయి.

---

★ "వ్యావహారిక భాషా ఉద్యమం సాధించిన పురోగతికి నేను పూర్తిగా సంతృప్తి పడుతున్నాను. కాని నాకు కావలసినదల్లా హెచ్చు మంది రచయితలు. మృదుమధురమైన శైలిలో మెలకువతో వాడుక భాషను రాసే యువకులు నాకవసరం. ప్రాచీన గ్రాంధిక భాషను వ్రాస్తామని దర్పానికిపోతూ వాడుక భాషను కృతకం చేసే రచయితలు నాకవసరంలేదు."

—గురజాడ

మానవత్వ సమానత్వానికి 'కన్యాశుల్కం' ఒక నివాళి. అందులో మనుష్యులే ఉన్నారు కాని దేవతలూ, దానవులూ లేరు. అందరూ సజీవ పాత్రలే. ఎవరూ కవిగారి సొంత పైత్యంలోంచి పుట్టుకొచ్చిన నిర్జీవ కల్పనలు కాదు.

"కన్యాశుల్కం" గ్రంథాన్ని భీభత్స రస ప్రధానమైన విషాదాంత నాటకంగా ఇప్పటికీ అభివర్ణించడం మాన లేను. ఇందులోని భీభత్సం మన జీవితాల లోనిదే. ఇందులోని విషాదం మన జీవితాలదే. అయితే గ్రీకు ట్రాజెడీల్లో లాగా షేక్స్పియర్ నాటకం లాగా "కన్యాశుల్కం" స్టేజి ముందుండి నాటకం చూస్తున్న వాళ్ళని ఒక క్షణ కాలం శవాలుగా మార్చి మరుక్షణం ప్రాణ ప్రతిష్ట చేసే అపూర్వ సృష్టి.

"కన్యాశుల్కం" సంగతి సరే. దాన్ని గురించి ఎంతయినా రాసుకు పోవచ్చు. అదో మహా సముద్రం. జీవితమంత విశాలమైనదీ, అగాధమైనదీ.

కథకుడుగా కూడా గురజాడ జీవితాన్ని మసి పూసి మారేడు కాయ చెయ్యలేదు. "మీ పేరేమిటి?" అన్న కథ దేవుడి మీద గురజాడ చేసిన ఛాలెంజ్.

రామాయణం చదివి సీతమ్మ కష్టాలకు కన్నీరు కార్చే వారూ, హరిశ్చంద్ర నాటకం చూసి చంద్రమతి కోసం బెంగ పెట్టుకునే వారూ, పుత్తడి బొమ్మ పూర్ణమ్మ కథను చదవడం మంచిది.

గురజాడను కవిగా గుర్తించలేని 'వెధవాయను' మనిషిగా నేను గుర్తించలేను. 'మన వాళ్ళు ఉత్త వెధవాయలోయ్' అని గిరీశం చేత ఊరికే అనిపించలేదు గురజాడ!

కనిపించని వంద కల్ప వృక్షాల కన్న 'దేశభక్తి' గీతం మిన్న. సన్మానాలు పొందే లక్ష సామ్రాట్టుల కన్న ఒక కామ్రేడ్ గురజాడ మేలు.

[గురజాడ సంస్మరణ సంచిక. దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘం ప్రచురణ, 1976 నుండి]

★ "మత విశ్వాసాలనేవి ఆచరణకు అసాధ్యమైనవి. నిరోధకమైనవి. గుదిబండల వంటివి. మానవుని ప్రేమించడమన్నది అతి సాధారణమైన జీవన సూత్రం. ఇతరులను ప్రేమించడంవల్ల మానవునికి నిరవధికానందం సిద్ధిస్తున్నది. మనం ఒకరికి యిచ్చే ప్రేమ మళ్ళీ మనకు ప్రేమను కొనితెస్తుంది. ఒకరి నొకరు ప్రేమించుకోవడం ఎంత మహత్తరమైనదని-"

—గురజాడ

# 'సజీవ' కన్యాశుల్కం

—కొత్తపల్లి రవిబాబు

వందలాది ఏళ్ళుగా సజీవంగా వున్న సాహిత్యం వుంది. దాని సజీవత్వానికి కారణమేమిటి? సజీవసాహిత్య లక్షణాలేమిటి? 1892 ఆగస్టు 13వ తేదీన విజయనగరంలో ప్రదర్శింపబడిన 'కన్యాశుల్కం' నాటకం ఈనాటికీ సజీవంగా వుంది. 1897 లో పుస్తకంగా అచ్చయింది. ఆనాటినుండి ఈనాటివరకే కాదు-భవిష్యత్తరాల వరకూ కూడా నాటక ప్రియులకు విందులు చేస్తూనేవుంది. చేస్తూ వుంటుంది కూడా. ఈ సజీవతకు కారణమేమిటి?

విశ్వసాహిత్యంలో సజీవంగా నిలిచిపోయిన సాహిత్యస్థానంలోకి చేరింది 'కన్యాశుల్కం'. ఈ నాటకాన్ని ఎన్నిసార్లు చదివితే అన్ని కొత్త విషయాలూ, కొత్త అందాలూ మనకు దొరుకుతూ వుంటాయి. అది ఒక తరగని గని, ఒక విజ్ఞానకోశం, సజీవ సాహిత్య లక్షణాల్లో ఇదొకటి. ఎందరెందరో విమర్శకులు 'కన్యాశుల్కం'పై రచనలు చేశారు. దీనిలో నాటక లక్షణాలే లేవనీ, ప్రదర్శనా యోగ్యం కాదనీ విమర్శించిన కేతవరపు రామకోటిశాస్త్రిగారు ఆ తర్వాత తన సాహిత్య విమర్శనా దృక్పథంలోనే నూతనత్వం సాధించి 'కన్యాశుల్కం' ప్రాశస్త్యాన్ని వివరించారు. అలాగే ఇప్పటికీ కొందరు 'కన్యాశుల్కం' ముగింపు విషయంలో తమ అసంతృప్తిని వెల్లడిస్తున్నారు. గిరీశం, బుచ్చమ్మల వివాహం జరిగినట్లు చూపించివుంటే విధవావివాహానికి పరిష్కారం చూపించినట్లుండేది అని భావిస్తున్నారు. ఇలా కన్యాశుల్కంలోని పాత్రలపై విమర్శకులు రాస్తూనేవున్నారు. దీనికి కారణం ఈ పాత్రలు నిజ జీవితంలో రోజూ మనకు కన్పించడమే.

ఆంగ్ల సాహిత్యంలో షేక్స్పియర్ నాటకాలపై వచ్చినన్ని విమర్శనాగ్రంథాలు మరే రచయితపైనా వచ్చి వుండవు. ఆ షేక్స్పియర్ పెద్దచదువులు చదివినవాడు కాదు. కాని మానవ స్వభావాన్ని తరచిచూడగల్గిన విద్యావంతుడు. కనుకనే అతను

---

★ "పాశ్చాత్య నాగరికత కొన్ని అంధ విశ్వాసాలను పోగొడుతున్న మాట యథార్థమే అయినప్పటికీ, అది ప్రబోధించే స్వాతంత్ర్యము సాంఘిక ప్రగతి శూన్యమైనది, ఇది అన్యులకు చోటివ్వదు. ఇటువంటి నాగరికత, మనుజులకు అవలక్షణములకు, అస్థిరత్వమునకు, దోషములకు గురిచేసి అక్కడకు తీసుకుపోయి దిగ విడువక తప్పదు. ఈ అవలక్షణములను, దోషములను, చెడుగులను, ధోరణిని దిగ్విజయముగ యెదిరించి పోరాడుట నేటి ప్రప్రథమ సమస్య."

—గురజాడ 'డైరీ' లోంచి

సమకాలీన సంప్రదాయ నాటకఫక్కీని, లాటిన్, గ్రీకుభాషల ఆధిపత్యాన్ని ప్రక్కకు నెట్టివేసి, ప్రజల ఇంగ్లీషుభాషలో నాటకాలు రాసి, స్వయంగా తానుగూడా ఆ నాటకాల్లో నటించాడు. సాంప్రదాయ నాటకబాణీని కాలదన్ని, సాధారణ ప్రేక్షకుడే గీటురాయిగా తన నాటకాలను తీర్చిదిద్దాడు. ఐదువందల సంవత్సరాలకుపైగా ఆయన నాటకాలు సాహిత్య విద్యార్థులను- ప్రజలను ఉత్తేజపరుస్తూనే వున్నాయి. గురజాడ షేక్స్పియర్ నాటకాల ప్రదర్శనలను కొన్నిటినైనా చూచాడు. విశ్వసాహిత్యాన్ని నాటకాలనూ అధ్యయనం చేసాడు.

షేక్స్పియర్ నాటకాల సజీవతకూ, కన్యాశుల్క నాటక సజీవతకూ కారణం ఏమిటంటే ఈ నాటకాలలోని పాత్రలు దేశ, కాల పరిమితులకు లొంగకుండా, సార్వజనీనత కల్గి వుండటమే. మానవులలోని సుగుణాలకూ, దుర్గుణాలకూ ప్రతీకలుగా ప్రతిభావంతంగా మలచిన పాత్రలు అవి. ఆంగ్ల నాటకసాహిత్యంలో ప్రాధమిక దశలోవున్న ప్రక్రియలు 'మిరకల్స్', 'మొరాలిటీస్'. వీటిలో పాత్రల పేర్లు ఆయా గుణాలతోనే వుండేవి. ఉదాహరణకు చెడ్డ పాత్రకు మిస్టర్ ఈవిల్, మంచిపాత్రకు మిస్టర్ గుడ్, ఈర్ష్యాళువైన పాత్రకు మిస్టర్ జెలసీ, ద్వేషం మూర్తీభవించిన పాత్రకు మిస్టర్ హేట్రెడ్ లాంటి పేర్లుండేవి. షేక్స్పియర్ నాటకాలలో పాత్రలకు పేర్లు ఈ విధంగా పెట్టకపోయినా, ఒకో పాత్ర ఒక్కొక్క మానసిక తత్వానికి సంబంధించినవిగా స్థిరపడిపోయే విధంగా చిత్రీకరించటం చూస్తాం. ఉదహరణకు సంశయాత్మకమైన మనస్తత్వంగల పాత్రను హామ్లెట్ అనీ, దుష్టమనస్తత్వం గలపాత్రగా 'అయాగో'ను: అనుమానాస్పదుడైన భర్త మనస్తత్వం గల పాత్రగా 'ఒథేల్లో'ను, అత్యాశపరునిగా 'మాక్‌బెత్' పాత్రనూ, క్రూరమైన వడ్డీవ్యాపారస్తుని మనస్తత్వానికి 'షైలాక్'నూ ప్రతీకలుగా తీసుకుంటున్నాం. ఈ పాత్రలన్నీ మన జీవితంలో మన కళ్ళముందు తారట్లాడుతుంటాయి.

అలాగే గురజాడ 'కన్యాశుల్కం'లోని పాత్రల్లోనూ ఇదే గుణం మనం గమనిస్తాం. గురజాడ తన కొన్ని పాత్రలకు ఆయా గుణాలను సూచించే గుణాత్మక నామాలు పెట్టాడు. ఉదాహరణకు పీనాసితనం మూర్తీభవించిన లుబ్ధావధాన్లనూ, ఛాందస బ్రాహ్మణునిగా అగ్నిహోత్రావధాన్లనూ, కరణీకం, లిటిగేషన్

> "ఏ కవికైనా సరె అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్ర కొక పరిణామం ఉంటాయి. సామాజిక చారిత్రక పరిణామ గమనంలో కవి యొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలి, ప్రతిభాశీలి అయితే ఈ గమనాన్ని అతడు మరింత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను."
>
> —శ్రీ శ్రీ

మూర్తీభవించిన రామప్పంతులునూ, రామప్పంతులుచేతుల్లో మోసపోతున్న మీనా క్షిలా, అమాయకత్వానికి మారుపేరైన బుచ్చమ్మనూ, కుహనా సంస్కరణవాదిగా దిగజారిపోయిన గిరీశాన్ని, మధురవాణిలనూ-ఇలా ఎన్నెన్నో పాత్రలను 'కన్యా శుల్కం' మనకు పరిచయం చేస్తోంది. ఈ పాత్రలనే మనం ఈనాటికీ మన మన వూళ్ళల్లో చూస్తున్నాం - కనుకనే ఆ నాటకం చదువుతున్నా, ప్రదర్శన చూస్తున్నా ఆనందించగల్గుతున్నాం. నూరేళ్ళ నాటికే గురజాడ 'పోలీసువాడు కొట్టే దెబ్బల' గురించి ప్రస్తావించాడు. పైకి గాయం లేకుండా లోపల లోపల కుళ్ళిపోయే పోలీసు దెబ్బల గురించి ప్రజలకు ఈవాడు ఎంత అనుభవమో మరి! "నేషనల్ కాంగ్రెసు గురించి లెక్చరు యిస్తే, వాళ్ళ వూరి హెడ్ కానిస్టేబుల్ని కాంగ్రెసువారు ఎప్పుడు బదిలీచేస్తారని బండివాడు అడిగాడు"—— అన్న ఒక్క డైలాగు ఈనాటికీ సజీవంగా వుండటం మనం హర్షించలేకపోయినా, "స్వతంత్రభారతం"లో రాజకీయ పరిస్థితిని మహాకవి వూహించాడనుకోవాలి. ఇంకా తమాషా ఏమిటంటే ఆనాడు బ్రాహ్మణ కుటుంబాలలో వున్న కన్యాశుల్కం ఆచారం క్రమంగా అదృశ్యమై ఈనాడు వర కట్నం వికటాట్టహాసం చేస్తోంది. ఐతేనేం? సారంలో మార్పులేదు. అప్పుడైనా, ఇప్పుడైనా బాధలకు గురయ్యేది స్త్రీయే. పురుషాధిపత్యం కొనసాగుతూనేవుంది. కనుకనే కాలాన్ని గెలిచి 'కన్యాశుల్కం' నాటకం బతుకుతోంది.

కన్యాశుల్కంలో నూరేళ్ళక్రితం వాడిన వాడుకభాష - సజీవమైన తెలుగు ఈ నాటకాన్ని బతికిస్తోంది. వీరేశలింగంగారిది సరళ గ్రాంధికం. గిడుగు రామ మూర్తి వాడుకభాషా సిద్ధాంత ప్రవక్త. కన్యాశుల్కం ద్వారా ఆ భాషను వాడింది గురజాడ. ఏ పాత్ర ఎటువంటి వ్యావహారిక భాష వాడుతుందో అటువంటిభాషనే గురజాడ ఆ పాత్రకు వాడాడు. గిరీశం ఎన్నెన్నో ఇంగ్లీషు పదాలు వాడాడు - ఇదంతా సామాన్యులకు అర్థం కాని భాష- అని ఒక విమర్శకుడు దాడిచేశాడు. ఆనాడు బ్రిటీషువారి విద్యాలయాల్లో చదువుకునేవారిలో ఇంగ్లీషు భాష ఎలా చొచ్చుకు పోయిందో, ఇంగ్లీషు పదాలు వాడటం ఎలా ఫాషన్‌గా మారిపోయిందో తెలియ

---

★ ".... 20 వ శతాబ్దంలో ప్రాచీన తెలుగు భాషలో రాయడం అసంబద్ధంగా వుంటుంది. నిజానికి తెలుగులో మాటాడే భాషా రాసే భాష యదార్థ స్థితిలో రెండు భిన్న భాషలు. ఇందువల్ల తెలుగు సారస్వతం పెరుగుదల ఆగిపోయింది. భారతీయ విద్యావంతులు తెలుగులో పుస్తకాలు రాయడానికి పూనుకోవడం లేదు. మృత భాషకు, సజీవ భాషకు మధ్య పోటీ జరుగు తోంది. తెలుగు ప్రజలలోని విద్యావంతులు పక్షపాతం లేకుండా, సహేతుకంగా వున్నట్టయితే వారు రెండో దానిని స్వీకరించాలి."

— గురజాడ

1912 డిసెంబర్-'ది హిందూ' పత్రికకు రాసిన లేఖలో

చేస్తుంది గిరీశం ఇంగ్లీషు. ట్యూషన్లు చెప్తున్న మాస్టరు అంత మాత్రం ఇంగ్లీషు ముక్కలు అనకపోతే ఎలా ? అదీకాక గిరీశం ఇంగ్లీషు 'బొట్లేరు' ఇంగ్లీషు కాదు' స్వచ్ఛమైన ఆంగ్ల జాతీయాలతో, సరైన సందర్భోచితమైన పదాలతో సాగిన ఇంగ్లీషు అతనిది.

ఇటీవల వ్యావహారిక భాష విషయంలో ఏ ప్రాంతపు భాష వాడాలి? మాండలికాలలోనే రచనలు చేస్తే ఆయా మాండలికాలు అభివృద్ధి అవుతాయి- అదే సరైన పద్ధతి అన్న వాదనలు వినిపిస్తున్నాయి. అభివృద్ధి పొందిన ప్రాంతాల (కృష్ణ, గుంటూరు జిల్లాల) వాడుకభాషే వార్తాపత్రికల ద్వారా, సినిమాల ద్వారా ప్రచారం అవుతుంది. వివిధ జిల్లాలలోని మాండలిక ప్రయోగాలను ఈ భాషలో కలుపుకోవడం ద్వారా దీనిని మరింత అభివృద్ధి పరచడం సాధ్యమౌతుంది. గురజాడ విజయనగరం ప్రాంతానికి చెందిన మాండలికాలను తన 'కన్యాశుల్కం'లో ఉపయోగించాడు. కాని నాటకమంతా మాండలికం మాత్రమే వాడలేదు. సాధారణ వాడుకభాష వాడాడు. కనుకనే కొంత టీకా-టిప్పణి వుంచేచాలు- కన్యాశుల్కం ఆంధ్రులంతా అర్థం చేసుకోగల్గుతున్నారు. నూరేళ్ళనాడే గురజాడ సాధారణ వాడుకభాషకూ— స్థానిక మాండలికానికీ మధ్య ఈ సమన్వయం సాధించాడు. ఈనాటికీ ఇదే సరైన మార్గమని కన్యాశుల్కం రుజువుచేస్తోంది.

గురజాడ వాడుకభాషను తన కన్యాశుల్కంలో ఎంత ప్రతిభావంతంగా వాడాడంటే ఆ భాషలో కొత్తకొత్త జాతీయాలు, సామెతలుగా ప్రాచుర్యం పొందేంత స్థాయిగల వాటిని సృష్టించి వదలిపెట్టాడు. అప్పటికే వాడుకలోవున్న కొన్ని జాతీయాలను సందర్భోచితంగా వాడుకున్నాడు.— ఇవి చూడండి.

'తాంబోలం యిచ్చేశాను - యిక తన్నుకు చావండి'
'డామిట్! కథ అడ్డంగా తిరిగింది'
'నీ యింట కోడి కాల్చా!'
'పేరులోన నేమి పెన్నిధియున్నది'
'కుప్పుసామయ్యేరు మేడ్ డిఫికల్ట్'
'మనవాళ్ళు వొట్టి వెధవాయిలోయ్'.
"అన్నీ మన వేదాల్లోనే ఉన్నాయష!"
"నాతో మాట్లాడడవే ఒక ఎడ్యుకేషన్"
"అటు నుంచి నరుక్కు రమ్మనారు"
"సానిదానికి మాత్రం నీతి వుండొద్దూ!"
"పొగ తాగనివాడు దున్నపోతై పుట్టున్"
"పొమ్మనక్కర్లేదు-పొగ బెడితే-చాలు" ఇలా ఎన్నెన్నో....

షేక్స్పియర్ కూడా తన నాటకాలలో ఇటువంటి ప్రసిద్ధ వాక్యాలు ఎన్నో

రచించగా, ఆ తర్వాత అవి జాతీయాలుగా, సామెతలుగా ఆంగ్ల సాహిత్యంలో స్థిర పడి పోయాయి. దీనిపైన ఒక కథ వుంది. ఈ మధ్య ఒకామె లండన్‌లో షేక్స్పి యర్ నాటక ప్రదర్శన చూసి- "ఏముంది గొప్పతనం ఇతనిలో? మన ఇంగ్లీషు సామెతలన్నీ వాడుకున్నాడు" అన్నదట! అవన్నీ షేక్స్పియర్ సృష్టించాడన్న విషయం తెలియక!

అలాగే గురజాడ గురించి ఏమీ తెలియనివాడు 'కన్యాశుల్కం' చూస్తే - గురజాడ గొప్పతనం ఏముంది? మన నిత్య వ్యవహారంలో వుండే జాతీయాలన్నీ వాడుకున్నాడు అనవచ్చు. అలా అంటే గురజాడకు కితాబు సమర్పించినట్లే.

సమాజంలోని కుహనా సంస్కర్తలకు, కుహనా నాయకులకు సజీవ ప్రతీక గిరీశం పాత్ర. ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా, ఏ ఉద్యమంలోనైనా గిరీశం మనకు ప్రత్యక్షమౌతాడు. సోషల్ రిఫార్మ్ పేరుతో కొందరు కుక్షింభరులు ఆ సామాజిక సంస్కరణ ఉద్యమాల నెలా స్వంత ప్రయోజనాలకు వాడుకుంటారో, వారి పట్ల ఎంత జాగ్రత్తగా వుండాలో గిరీశం పాత్ర ద్వారా గురజాడ హెచ్చరిస్తున్నాడు. షేక్స్పియర్ తన ప్రముఖ నాటకాలలో ప్రారంభ దృశ్యంలోనే మొత్తం నాటకం యొక్క సందేశాన్ని పరోక్షంగా తెలియ చేస్తాడు. అలాగే 'కన్యాశుల్కం' ప్రారంభ దృశ్యంలో గిరీశం స్వగతంతో ప్రవేశించి తనను పరిచయం చేసుకుంటాడు. 'ఇరవై రూపాయలు డాన్సింగ్ గర్లు క్రింద ఖర్చు పెట్టిన వేశ్యా లోలుడు.' 'పూట కూళ్ళమ్మకి మాయ మాటలు' చెప్పి మోసం చేయడంలో సిద్ధహస్తుడు. 'వెంకు పంతులు గారి కోడలికి లవ్ లెటర్' రాసిన జులాయి, పోకిరీ వాడు, 'వెంకటేశంకు పాఠాలు చెప్పకుండా వాడికి చుట్టలు త్రాగడం మాత్రమే నేర్పిన 'గురువు'-మానవ జాతినంతా చెడగొట్టేది స్త్రీలే నన్న నమ్మకం కల్గిన అభివృద్ధి నిరోధక ఛాందసుడు వీడు. గిరీశాన్ని ప్రారంభ దృశ్యంలో ప్రవేశపెట్టడం ద్వారా గురజాడ కుహన సంస్కర్తల నిజరూపాన్ని బట్టబయలు చేయడంపై కేంద్రీకరించాడన్నది గమనించాలి.

కుహనా సంస్కర్త ఐన గిరీశం పాత్రను మరికొంత విశ్లేషిద్దాం. గిరీశం లాంటివారు తమ మేధాశక్తితో తమకు అనుకూలంగా ఎలా వాదిస్తారో గురజాడ అనేక సందర్భాల్లో ఈ నాటకంలో వివరించాడు. ఉదాహరణకు- 'బుచ్చమ్మల్లాంటి యంగ్ విడోలు సమాజంలో వుండాలంటే, విడో మేరేజిలు జరగాలని; ఉద్యమాలు నడపాలంటే, ఇన్ఫెంటు మారేజీలు వుండాలనే కొత్త ఆర్గ్యుమెంటు' ఈయనకు తోచింది. 'విధవా వివాహమే నాగరికతకు నిగ్గు అయినప్పుడు బాల్య వివాహాలు లేకపోతే నాగరికత ఆగిపోతుంది' అని వాదిస్తాడు. ఇది గిరీశంగారి కొత్త డిస్కవరీ! 'కన్యాశుల్కం లేని మారేజే ఈ భూ ప్రపంచంలో లేద'ని తన శిష్యుని ముందు తప వాదనా పటిమను ప్రదర్శిస్తాడు. అంతేగాక "లుబ్ధావధాన్లు ముసిలాడు. బంగార

ప్పిచ్చికాను. రెండేళ్ళకో మూడేళ్ళకో అమాంతంగా బాల్చీ తన్నేస్తాడు. అనగా 'కిక్స్ ది బకెట్'. దాంతో నీ చెల్లెలు రిచ్ విడో అవుతుంది. నువ్వు పెద్దవాడవైన తర్వాత దానికి విడో మేరియేజి చేసి, శాశ్వతమైన కీర్తి సులభంగా సంపాదించవచ్చు'నని కీర్తి ప్రతిష్టలెలా సంపాదించుకోవాలో ఉపదేశిస్తాడు!

విధవా వివాహాలను సమర్థించే ఈ గిరీశంలోని కపటత్వం, మోసకారితనం అంతా ఇంతా కాదు. అదంతా ఇతను ఇంగ్లీషులో రాసిన 'ది విడో' అనే కవితలో ప్రదర్శిస్తాడు! ఈ కవితలో విధవలైన స్త్రీలను ఎంతగా అవమానించాడో చూడండి. ఆ పద్యంలోని పాదాలలోని భావాలకు అనువాదం ఈ క్రింద చూడండి:

"ఈమె ఉదయం నాలుగ్గంటకే లేచి ఇల్లంతా అద్దంలా వుండేట్లు చూస్తుంది, పెద్దసైజు రొట్టె తయారు చేసుకుని అంతా తనే మింగేస్తుంది. ఉపవాసాలతో, విందులతో ఆమె తన ఆరోగ్యాన్ని కాపాడుకుంటుంది. దొంగిలించిన పైకాన్ని పొదుపుగా దాచుకుంటుంది. వూళ్ళో వారందరూ ఆమె వెనుకగల సంపద గురించి మాట్లాడుకుంటుంటారు. అప్పుడప్పుడూ ఎవరితోనో పోయిందని వూళ్ళోవాళ్ళు చెవులు కొరుక్కుంటుంటారు. కాని వాటినేమాత్రం ఆమె పట్టించుకోదు."

ఇవండీ గిరీశం రాసిన "ది విడో" అనే ఆంగ్ల కవితలోని భావాలు! విధవల పట్ల ఎంత ఉన్నతాభిప్రాయాలు వెలిబుచ్చాడో చూశారా!

ఇంతేకాదు. తృతీయాంకం మూడవ దృశ్యంలో గిరీశం మరొక్కసారి తన "విశ్వరూపా"న్ని మరో సుదీర్ఘమైన స్వగతంలో చూపిస్తాడు. బుచ్చమ్మపై తనకు కలిగిన 'ప్రేమ' గురించి వివరిస్తాడు. "యీ విడో బ్యూటీ చూస్తే ఏమీ తోచకుండా వున్నది. అయితే యిది చెప్పినట్టల్లా వశమయ్యే మనిషి కాదు. పాత దస్త్రాలేం పనికి రాకుండా వున్నాయి. నా యక్స్పీరియన్సూ, నా శృంగార చేష్టలూ గుడ్డిగవ్వంత పని చెయ్యకుండా వున్నాయి....దీనికి లవ్ సిగ్నల్సు....రామ రామా....యేవి తెలియవు.... దీన్ని చూసిన దగ్గిర్నించీ టౌన్ లవ్సూ, డాన్సింగర్ల్సూ మీద పరమాసహ్యం పుట్టింది....మధురవాణికీ యీ మనిషికీ కంపారిజన్ వున్నదా? అది రంగువేసిన గాజుపూస. యిది ప్యూర్ డైమండ్!....దీనిని చెడగొట్టడానికి ప్రయత్నం చెయ్యకూడదు; చేసినా సాగేదికాదు. గనక కొత్తదారీ, కొంత న్యాయమైన దారీ తొక్కాలి. ఏవిటమ్మా అది? మాయోపాయం చేసి దీన్ని లేపదీసుకుపోయి విడో మారియేజి చేసుకుంటినట్టాయనా కీర్తి, సుఖం కూడా దక్కుతాయి." ఇక ఆ తర్వాత బుచ్చమ్మను విధవా వివాహం చేసుకోవడంవల్ల వచ్చే లాభాలూ, నష్టాలూ గిరీశం ఏకరువు పెట్టినపుడు వాడి 'నిజమైన సంస్కర్త హృదయం' ఆవిష్కరింపబడింది. "బుచ్చమ్మ లాంటి అమాయకపు పిల్లను వొప్పించి, తీసుకుపోయి పెళ్ళాడితే మజా, ప్రయోజకత్వం కాని, రెండేసి, మూడేసి సంతానాలు కలిగి, తురకాడితోనో, దూదేకులవాడితోనో లేచిపోడానికి సిద్ధంగా వున్న దండు ముండల్ని విడో మారియేజి చేసుకుంటే

హెలో! పూటకూళ్ళమ్మలాంటి ముండను పెళ్ళాడ్డం విడో మారియేజి అనిపించుకోదు. అదీ దొంగముండా మారియేజి."....ఇదండీ గిరీశంగారికి బాల వైధవ్యంపైనా, విధవలపైనా వున్న మహోన్నతమైన అభిప్రాయాలు! జామచెట్టు కింద దృశ్యంలో ఈ కుహనా సంస్కర్త తన అబద్ధాలతో మాయమాటలతో చమత్కారంతో బుచ్చమ్మను వలలో వేసుకుంటాడు.

ఈ సోషల్ రిఫార్మర్ చివరి దృశ్యంలో 'పాపంలో కాలుజారి, పశ్చాత్తాపపడి, రిఫార్మ్ అయినాను ... ఐక్రేవ్ యువర్ మెర్సీ' అని సౌజన్యారావు ముందు దాసోహమంటాడు. సౌజన్యారావు "గిరీశాన్ని ఆషాఢభూతిగా వర్ణించి, బుచ్చమ్మను పూనాలోని విడోస్ హోమ్‌కు పంపే ఏర్పాటుచేసి, ఆమె చదువుకొని ప్రాజ్ఞురాలై తన ఇష్టం వచ్చినవారిని పెళ్ళిచేసుకుంటాదనీ, గిరీశాన్ని కాలేజీలోచేరి పై పరీక్షలకు చదువు కొమ్మనీ, బుద్ధి తెచ్చుకొని బతకమ"ని హెచ్చరించి వదిలేస్తాడు. గిరీశాన్ని "తక్షణం ఇంట్లోనుంచి బైటికి పో" అని శాసిస్తాడు. దాంతో గిరీశం కథ అడ్డంగా తిరిగింది.

కన్యాశుల్కం ముగింపు విమర్శకులు కొందరికి నచ్చలేదు. కనీసం గిరీశం, బుచ్చమ్మలకు వివాహం చేయడం ద్వారా విధవా వివాహాలను ప్రోత్సహించినట్లు చేయవచ్చుగదా-దేనికీ పరిష్కారం లేకుండా వదిలేసాడేమిటి? అన్నది వారి విమర్శ. కాని గిరీశం పాత్రను దృష్టిలో పెట్టుకుని పరిశీలిస్తే, వాడిలో 'ట్వెంటీ ఫోర్ అవర్సులో వచ్చిన ట్రూ రిపెంటెన్సు' నిజమైన పశ్చాత్తాపమేనా అనేది ఇంకా కాలం రుజువు చేయాలి. బుచ్చమ్మను చెడగొట్టడానికి ప్రయత్నం చేసినా సాగేదికాదు కనుక అటువంటి ప్రయత్నం మానుకున్నాడేగాని అతనిలో ట్రూ రిపెంటెన్స్ వచ్చినట్లు దాఖలాలేవీ? అదీగాక ఇప్పుడే వీడు బుచ్చమ్మను పెళ్ళాడితే, వీడి చదువుకి ఉద్యోగమే దొరకదే-ఇక బుచ్చమ్మ తెచ్చే ఆస్తిలో బతకాలి ఇద్దరూ. ఇది సరైన పద్ధతి కాదు. కనుక సౌజన్యారావు గిరీశాన్ని చదువు పూర్తిచేసుకొమ్మంటాడు. ఈలోగా పూనాలోని విడోస్ హోమ్‌లో వున్న బుచ్చమ్మ ప్రపంచాన్ని అర్థం చేసుకుంటుంది. అప్పుడు కావాలంటే వివాహమాడవచ్చు. ఇది చాల అర్థవంతమైన ముగింపు.

విధవా వివాహాలను ప్రోత్సహించవలసిందే. కాని కుహనా సంస్కర్తల బారినుండి వారిని రక్షించాలి. ప్రతి యుగంలోనూ, ప్రతి ఉద్యమంలోనూ గిరీశం తరహా సంఘసంస్కర్తలు కుప్పలు తెప్పలుగా ప్రత్యక్షమౌతుంటారు. కనుకనే మనం ఈనాడు ప్రతిచోటా గిరీశాలను చూడగల్గుతున్నాం. కమ్యూనిజం పేరు→

---

★ "తెలుగుదేశంలోని వివిధ ప్రాంతాల్లో మామూలుగా మాట్లాడే తెలుగులో మాండలిక భేదం పెద్దగా లేదు. కాబట్టి సమర్థులైన రచయితలు పూనుకోవాలేగానీ, ఒక కొత్త ఉమ్మడి సాహిత్య మాండలిక భాషను సులభంగా నెలకొల్పవచ్చు.

— గురజాడ

# మధుర వాణి నవ్వు

కొన్ని యుగాలుగా భుజాల మీదెక్కి
సవారీ చేస్తున్న గాడిదల కుమ్ములాటలో
చితికిపోయిన లేగదూడల రక్తంతో
ఒళ్ళంతా తడిసి ముద్దయి పోయినా
కన్నీళ్ళన్నీ కోపాన్ని
కడుపులోనే దాచుకోవాల్సి వచ్చినపుడు
కిలకిలా గలగలా పొంగి పొర్లేది
నెత్తుటి చారికల కన్నీటి నవ్వు

బలి తీసుకుని బలిసిపోయిన గాడిదలు
పసికూనల మృతహాసాల మువ్వలతో అలంకరించుకుని
లొటిపిటల మీదెక్కి బోలాల వెంట ఊరేగితే
"ఓరి గాడిదకొడకల్లారా!" అని తిట్ట లేకపోయినపుడు
పైగా శుశ్రూషలు చేయాల్సి వచ్చినపుడు
కుతకుతలాడే గుండెలోంచి
భగభగలాడే నవ్వు
పకపకా బైటికొస్తుంది
వెయ్యి కోరల లక్ష పంజాల

---

→చెప్పుకుంటూ పెట్టుబడిదారీ విలాస జీవితం గడిపే గిరీశాలూ; పేదరికం లేకపోతే కమ్యూనిజం రాదుగనుక పేదరికం ఇంకా పెరగాలని వాదించే గిరీశాలూ; ప్రజలపై నిర్బంధం మరింత పెరిగితేనేగాని ఎదురు తిరగరనీ, వారిపై నిర్బంధం బాగా పెరిగేటట్లుచేసే గిరీశాలూ, మన ముందు ఎందరెందరో?

ఈ గిరీశాలపట్ల జాగ్రత్తగా వుండమని గురజాడ మనలను హెచ్చరిస్తున్నాడు!

గురజాడ జీవితం సాహిత్యం మొత్తం గనుక పరిశీలిస్తే ఆయనలో మనకొక ద్రష్ట కనిపిస్తాడు. రాబోవు యుగం రూపు రేఖలూ, రాబోవు సమాజం స్వరూప స్వభావాలూ, రావాల్సిన మార్పులూ, చేయాల్సిన చేర్పులూ, తెలుగు భాషను అభివృద్ధి పరచడానికి అవసరమైన చర్యలూ, ఉత్తమ మానవ విలువలుగల్గిన సమాజ స్థాపనా, మొదలైనవెన్నో ఆయన రచనల్లో, ఆయన ఊహల్లో మనకు కనబడ్తాయి. ఆనాటి ఛాందస వాతావరణం నుండి బయటపడి, ఎంతో ముందుచూపు ప్రసరించిన సాహితీ విప్లవకారుడు గురజాడ.

మృగాలకి సేవ చేస్తూనే
శిథిలీకృత వ్యవస్థ కరాళ నృత్యాన్ని పరిహసిస్తో
సీతాకోక చిలుక కన్నీటి బిందువులు
పగలబడి నవ్వుతాయి

శిష్యా ! అక్కలాగనో ! స్నేహితురాలిగానో
నీపై వరాల వెన్నెల కురిసిన
ఆ నవ్వులో ముద్దులో
జీవన సౌందర్య బీభత్సాలు రెండూ ఉన్నాయి

బాల్యవివాహాల్ని, సంస్కర్తల హృదయాల్ని
ఒకే నోటితో అమ్మేసే గిరీశాన్నిపుడు పోల్చుకోలేం
ఇపుడు గిరీశం మన ఏలిక, ఏలికలకు ఏలిక
రష్యాలో చైనాలో, అక్కడా ఇక్కడా అన్ని చోట్లా
విప్లవాల్ని డాలర్లలోకి మార్చుకుని
మానవత్వాన్ని వ్యాపారంతో సంస్కరించే గిరీశాన్ని
మనమిప్పుడు పోల్చుకోలేం
లాభం కోసం బాంబులు కురిపించి
సృష్టి లోపాలు సరిదిద్దుతాడు
లాభం కోసమే శాంతి కపోతాల్ని ఎగరేస్తాడు

నేటి గిరీశం చేతిలో కరెన్సీగా మారి
అధోలోకాలకి దొర్లిపోతున్న
తనను చూసి తానే
పొగిలి పొగిలి ఏడ్వలేక
అచ్చంగా మధురవాణిలా
పగలబడి నవ్వుతోంది మానవ జీవితం

—వసీరా

కవితా కళకు నేను వొద్దిగ్గి ఉండవలసిన వాడినే అయినా, మానవ సమాజం పట్ల నాకొక మహత్తరమైన బాధ్యత ఉంది.

— గురజాడ

# కన్యాశుల్కం-రచనా సంవిధానం-ప్రదర్శన

—కాకరాల

ఆధునిక తెలుగు నాటకానికి ప్రామాణికం కన్యాశుల్కం. దాని తొలిప్రదర్శన జరిగి-1992 ఆగస్టు 13కి-వందేళ్ళయింది. రచన ఇంకా అయిదేళ్ళ ముందు అయినా అదే ఆధునిక తెలుగు నాటకానికి ప్రామాణికంగా నిలవడానికి కారణాలేవిటి?

చారిత్రకమైన సామాజిక కారణాలు వొకెత్తు. దాని రచనా ప్రదర్శనల ఔన్నత్యం మరో యెత్తు.

ఇదీ కన్యాశుల్కం ప్రదర్శన శతవార్షికోత్సవ సంవత్సరం. ఈ సందర్భంగా దాని రచనా ప్రదర్శనల ఔన్నత్యం గురించి స్థూలంగా గుర్తు చేసుకుందాం. ఎక్కణ్ణించొచ్చామో తెలిస్తే ఎక్కడికెళ్ళాలో తెలుస్తుందంటాడు కొ. కు.

ఈ రూపంలో ఆధునిక తెలుగు రంగస్థల గత వర్తమాన సమీక్ష దాని భావికి దారిని తప్పక సూచిస్తుంది. కనక ఈ సంవత్సరం నుంచి "కన్యాశుల్కం" నాటకం మీద చర్చ బహుముఖాల జరగాలని నా ఉద్దేశం.

కన్యాశుల్కం రచనకి ప్రేరణ కన్యాశుల్కం దురాచారమే. గురజాడే నాటకం ముందు మాటలో ఈ సంగతిని వివరించాడు. ఎబొచ్చీ ఆయన ఈ నాటకాన్ని పమిట కొంగులు కండువాలు తడిసిపోయేలా రాయకూడదనుకున్నాడు. అలాగే రాయాలనుకుంటే సుబ్బి ప్రధాన పాత్రయి రంగంమీదికొచ్చేది. సంవిధానం మరోలా సాగేది. ఆదర్శవంతమైన పాత్రలు రూపొందేవి. అతి కఠోరమైన సామాజిక వాస్తవం-జీవిత

---

★ "విశాఖపట్నం జిల్లాలో మూడేండ్ల కాలంలో జరిగిన కన్యాశుల్కం వివాహాల గురించి 1887 లో పరిశీలన జరపబడి, సేకరించిన లెక్కల ప్రకారం కన్యాశుల్క వివాహాలు 1034 నమోదు చేయబడినాయి. అనగా సగటున యేటా 344 జరిగాయి. 99 మంది ఆడపిల్లలకు అయిదేండ్ల వయసులోనూ 44 మందికి నాలుగేండ్ల వయసులోనూ, 36 మందికి మూడేండ్ల వయసులోనూ, ఆరుగురికి రెండేడ్ల వయసులోనూ, ముగ్గురికి యేడాది వయసులోనూ పెండ్లి జరిగింది. యేడాది శిశువుల ధర ఒక్కొక్కరికి రు. 350 నుండి రు. 400 దాకా ఉండింది. విడ్డూరమనిపించవచ్చుగావీ, ఒక్కోసారి కడుపులోని పిల్లకు బేరాలు కుదిరాయి. ఈ స్థితి సమాజానికి అవమానకరమైనది. యిలాంటి ఆచారాలను బట్టబయలుచేసి, ఉన్నత నైతిక ప్రమాణాలను నెలకొల్పడంకంటె ఉత్తమమైన లక్ష్యం సాహిత్యానికి ఉండజాలదు."

— గురజాడ 'కన్యాశుల్కం' ముందుమాటలో.

బీభత్సం-కనుమరుగై పోయేది.

ఈ దురాచారాని కున్న సమాజ మూలాన్ని సూచించి ప్రజల్ని ఆలోచింప జేయాలన్నది ఆయన లక్ష్యం. ఈ ప్రధాన లక్ష్యానికి తోడుగా ఆయనకింకా కొన్ని లక్ష్యాలున్నాయి.

నికృష్టమైన రంగస్థలాకర్షణలకి తావులేకుండా నాటకం రాయాలి. సజీవమైన వాడుక భాషే పాత్రల సహజ ప్రవర్తనకి దోహదం చేస్తుందని చేసి చూపించాలి. సమస్య సాధనంగా సమగ్ర జీవితాన్ని చిత్రించాలి. ఆధునికానికి ప్రామాణికంగా నిలిచే సంవిధాన పాత్ర చిత్రణల కోసం స్వతంత్ర ప్రయత్నం చెయ్యాలి.

ఈ లక్ష్యాల్ని ఓ తాటిమీదికి తెచ్చి పురికొల్పింది "నాది ప్రజల ఉద్యమ్యం" అన్న ఆయన అచంచల భావన. ఆ నిబద్ధతతో ప్రజల పక్షాన నిలిచి సమాజంలోని దురాచారాలికి స్టేట్-రాజ్యం-ఎలా మూలమో సూచించాడు గురజాడ.

అలా లక్ష్య లక్షితుడైన గురజాడ నుంచి కొత్త లక్షణాల్తో వచ్చింది "కన్యాశుల్కం". కన్యాశుల్కం లక్ష్యాన్ని కొత్త లక్షణాల్ని అర్థం చేసుకుందుకి శాస్త్రీయ దృక్పథం కావాలి. శాస్త్ర జ్ఞానం వున్నపోటే అందుంటుంది. ఈ షరతు యెందుకంటే గురజాడ యీ జ్ఞానం నుంచొచ్చిన శాస్త్రీయ దృక్పథం నుంచే ప్రాక్ పశ్చిమ రంగస్థలాల అభివృద్ధిని అధ్యయనం చేశాడు. సమకాలీన సమాజ రుగ్మతల్ని పరిశీలించి సాహిత్య సృజన చేశాడు. కనుక ఆ దృక్పథంవున్న ప్రయోక్తే కవి చూపు నుంచి కన్యాశుల్కం లక్ష్య లక్షణాల్ని అర్థం చేసుకుని ప్రదర్శనకి న్యాయం చెయ్యగలడు.

ఓ వ్యాసంలో "శాస్త్ర జ్ఞానమంటే రేడియోలూ రాకెట్లు తయారు చేయడమే కాదు. నిజానికీ అబద్ధానికీ తేడా తెలుసుకోడమే దాని పరమార్థం" అన్నాడు కొ. కు. సరిగ్గా ఈ పరమార్థాన్ని సాధించడానికి కన్యాశుల్కం-మొదటి కూర్పు-సంవిధాన పాత్ర చిత్రణలో గురజాడ చేసిందేవిటో ముందు చూద్దాం.

దురాచారాలికి మూలమైన శిథిల వ్యవస్థని చుట్టుముట్టాలి. దాని బీభత్సాన్నంతనీ కళ్ళకి కట్టించాలి. ప్రాణ స్థానంలో వున్న వ్యక్తిలో-లుబ్ధావధాన్లలో-మానసిక పరివర్తన తీసుకురావాలి. సామాజిక బీభత్సానికి మూలమైన స్టేట్‌ని-రాజ్యాన్ని-సూచించి ప్రేక్షకుల్ని ఆలోచింపజెయ్యాలి.

ఈ మొత్తం లక్ష్యాన్ని సాధించడానికి ఆయన వేసుకున్న వ్యూహమే సంవిధానం. ఎక్కడ కావల్సిన యెత్తుగడలు అక్కడెత్తుతూ వ్యూహాన్ని లక్ష్యం వైపు సహజంగా నడిపించే పాత్రల సజీవ చిత్రణే పాత్ర చిత్రం. జీవితంలో యే లక్ష్యాన్ని సాధించదల్చుకున్న నిర్మాణానికైనా ఈ వ్యూహం యెత్తుగడలు తప్పవు. రచనా ప్రక్రియల నిర్మాణానికి సంబంధించి వాటిని సంవిధాన పాత్ర చిత్రణలంటున్నాం.

దురాచారాల్ని గుర్తించిన వెంటనే పోగొట్టాలనే ప్రయత్నాలలా మొదలవు

తాయి. చారిత్రక గతిక్రమంలో సంఘటితమై ఉద్యమాలవుతాయి. జాతీయోద్యమం పొడుగునా స్వతంత్ర సంస్కరణ పోరాటోద్యమాలు యిలాగే సాగాయి. కాని ఆ వుద్యమాల్లో త్రికరణశుద్ధిగా పనిచేసిన వాళ్ళతోబాటు ఆ చైతన్య ఫలితాల్ని సొంతానికి వాడుకునే "ఆషాఢ భూతి తత్వాలూ" పనిచేయడం జరిగింది.

జీవితంలోని వెలుగునీడలే వుద్యమాల్లోకీ వస్తాయి.

కన్యాశుల్కం నాటక సంవిధానం-plot-రాజకీయ సంస్కరణోద్యమాల్లో నక్కవున్న ఆషాఢభూతితత్వంతో మొదలైంది. ఆధునిక అవకాశవాదానికి గురజాడ చేసిన సజీవ పాత్ర చిత్రణే గిరీశం. "అతడూ-ఆమె" నవల్లో గిరీశం స్వభావ స్వరూపాల్ని గొప్పగా విశ్లేషించి వివరించారు ఉప్పల లక్ష్మణరావుగారు. ఆదర్శ వాదపు మేలిముసుగులో మసిలే సర్వదుర్లక్షణాల సమన్వయ రూపమే గిరీశం.

పూటకూళ్ళమ్మ ఇంట్లో వుంటున్న ఈ గిరీశం "కథ అడ్డంగా తిరిగి" వీధిన పడ్డంతో "బొంకుల్దిబ్బ" దగ్గర చాలా అర్థవంతంగా పరిచయం చెయ్యబడిందీపాత్ర. ఈ పాత్ర తననీ తన స్వభావాన్ని స్వీయ పరిచయం చేసుకోడంతో నాటకం మొదలవుతుంది.

ఈ గిరీశానికి మీనియేచరే వెంకటేశం. గిరీశం శిష్యరికంలో అబ్బిన దుర్వ్యసనాల చురుకుపాలూ అగ్రహారపు బతుకులోని జడ్డితనం పాలూ కలగల్సిన మిశ్రమ తత్వం ఇతనిది. ఇప్పుడు బడుద్ధాయిలా కనిపిస్తున్నా బాలారిష్టాల్ని దాటగలిగితే వీడు గురువుని మించిన శిష్యుడు కాగలడన్న సూచనలు అక్కడక్కడ అతని తత్వంలోంచి తళుక్కున మెరుస్తూ వుంటాయి.

పరస్పర వినియోగస్థితిలో వున్న ఈ పాత్రల విరుద్ధ స్వభావాల సంఘర్షణతో ఘటన పురెక్కి బిగిజారకుండా నడిచింది. పాత్రల ప్రవర్తనా, సంభాషణలే వాటి తత్వాల్ని వ్యక్తం చేశాయి. సూచన ప్రాయంగా రాబోయే ప్రధాన సహాయ పాత్రల్ని కూడా పరిచయం చేశాయి. శిష్యుణ్ణి తన చాకచక్యంతో బోకెట్లో వేసేశాననుకున్నాడు గిరీశం. గురువుగారు రావడంవల్ల పెయ్యకట్టుతాటి దెబ్బల్నుంచి తప్పుకోవచ్చును కున్నాడు శిష్యుడు. దొందుకి దొందేగాని తాయిలంపెట్టి పిల్లల్ని బెలిపించినట్టు బలే బుట్టలో వేశాడు వెంకటేశాన్ని గిరీశం అనుకుంటాడు ప్రేక్షకుడు.

వేశ్య మహాలక్ష్మిని చూసి వెళ్ళాలనుకున్న గిరీశం పొడేగ్రాపు బంట్రోతుకి దొరికిపోయాడు. పొటోల బాకీ ఎగొట్టడానికి చెవిటివాడుగా నటించాడు. బంట్రోతు మొల్లో చెయ్యేసి తీసేసరికి గాయత్రిమీద ప్రమాణం చేశాడు. గతుక్కుమన్న బంట్రోతు "రేపియ్యకపోతే భవిష్యముండదు" అని హెచ్చరించి వెళ్ళాడు. "మేక్

---

★ "చిన్నతనంలో బొమ్మలాట నేర్చి ఉండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటిరీతులను ఆటాడే మనుష్యులనే పాత్రముల సొగసునే కనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసులేని మనిషే ఉండడు. — గురజాడ.

హే వైట్ పీ సన్ షైన్స్" అంటూ మహాలక్ష్మి ఇంటికెళ్ళాడు గిరీశం.

ఈ దృశ్యం చివరి కొచ్చేసరికి పాత్రలు శిథిల వ్యవస్థచూర్ణ - Old Customs - పట్టుకు యెలా వేలాడుతున్నాయో సూచితమైంది. పరస్పర హరణో ద్యోగంలో ఆ ఆచారాల్ని వినియోగించుకోడంలో గిరీశాలెంత అందెవేసిన చేతులో నిర్ధారణైంది.

అగ్నిహోత్రావధాన్లు వెంకమ్మ సాక్షాత్తూ శిథిల వ్యవస్థకి ప్రతినిధులు. మూర్తీ భవించిన సనాతన మూర్ఖత్వమే వెంకమ్మ, కాని మమకారం దగ్గరకొస్తే ఈవిడికి కాస్త పట్టూ విడుపులున్నాయి. అవీ లేని పరమ మూర్ఖుడు అగ్నిహోత్రావధాన్లు. కరటకశాస్త్రి పరిభాషలో 'ఎదురు చెప్పినకొద్దీ కొర్రెక్కుతాడు'.

కరటకశాస్త్రి శిష్యుడూకూడా ఈ శిథిల వ్యవస్థకి ప్రతినిధులే. కాని వస్తున్న మార్పుల్ని అర్థం చేసుకుని కాస్త సర్దుకునిపోమే తత్వం-నాటకాలేస్తూ చేసిన-లోక సంచారం నుంచి వీళ్ళిద్దరికీ వచ్చింది. డబ్బు ఖర్చేగాని కొడుక్కి ముక్కరావట్లేదని అగ్నిహోత్రుడికి కోపం. ఎంత ఖర్చయినా కొడుక్కి ఇంగ్లీషు చెప్పించాలనేది వెంకమ్మపట్టు. ఈ శిగపట్లల్లో సమస్య-చిన్న పిల్లల్ని డబ్బుకి అమ్ముకునే దురాచారం ఈ కుటుంబాల్లో వుందని-పరిచయమైంది.

ఇలాంటి తత్వాలూవున్న ఆచారాలూవున్న కుటుంబంలోకి వెంకటేశంతోవచ్చాడు గిరీశం.పరస్పర విరుద్ధతత్వాల సంఘర్షణతో ప్రధాన అనుబంధ సమస్యల్ని-బాల్య స్త్రీ పునర్వివాహాల్ని-పరిచయం చేయడం జరిగింది. ఆ ఘర్షణ బిగి సడలకుండా దృశ్యాన్ని నడపడమేకాదు. చివరికి ఆవేశాలు అదుపు తప్పి "ఈ పెళ్ళి చెయ్యకపోతే బారిక రాముణ్ణో" అని ఆగ్రహంగా వెళ్ళాడు అగ్నిహోత్రుడు. ఈ సంబంధం తప్పించకపోతే నుయ్యోగొయ్యో చూసుకుంటానంది వెంకమ్మ. ఏం చెయ్యాలో తోచని కరటక శాస్త్రికి ఉపాయంతోచి చెబుతాను రమ్మని చెల్లెల్ని తీసుకుని లోనికి వెళ్ళాడు. ఈ వైరుధ్యాల్ని బలహీనతల్ని పసిగట్టిన గిరీశం బుచ్చెమ్మని ముగ్గులోకి లాగడానికి ఆ ఇంట్లోనే తిష్టవేసి కత్తికటారీ నూరడానికి నిశ్చయించుకున్నాడు. గిరీశం వెంకటేశాల్ని భోజనానికి పంపి శిష్యుణ్ణి పిల్చి పథకం చెప్పాడు., ఇల్లరికాన్ని యెరేసి ఆడవేషం వెయ్యడానికి వొప్పించాడు కరకటశాస్త్రి.

గిరీశం తన పాలిటిక్స్ దెబ్బతో అగ్నిహోత్రుణ్ణి ఎలా బోకెట్లో వేసుకున్నాడో వెంకటేశానికి చెప్పాడు. విడో బొయెట్రీలు టొబేకోపనిషత్తులూ లామేకింగులూ పాఠాలు చెప్పాడు. కోర్టు వ్యవహారాల్లో వంతపాడి అగ్నిహోత్రుణ్ని పూర్తిగా బోకట్లో వేసుకున్నాడు.

సంవిధానం-plot-రామచంద్ర పురాగ్రహారంలో కళ్ళెం వదిలిన గుర్రంలా దౌడుతీసింది. అంటే పాత్రలే గుర్రాలై-నిలకడగా పరస్పర సంఘర్షణతో స్వభావాల్ని వ్యక్తీకరించకుండా-పరుగులు తీశాయి. మధురవాణి లుబ్ధావధాన్లని పెళ్ళికెలా వప్పిం

చింది రావుప్ప పంతులు చేతే చెప్పించింది. లుబ్ధావధాన్లింటికి వెళ్ళి రావుప్ప పంతులు అతని పీనాసితనాన్ని బయటపెట్టాడు.

ఆడ వేషం వేసిన శిష్యుడితో వచ్చిన కరటకశాస్త్రి కుదిరిన సంబంధాన్ని తప్పించి తన సంబంధాన్ని కుదర్చడానికి రావుప్ప పంతుల్ని వప్పించాడు. రావుప్ప పంతులు ఉత్తరాన్ని బనాయించి ఆ పని చేశాడు. కరటకశాస్త్రి వెనకే వెళ్ళి లుబ్ధావధాన్లచేత తాంబూలాలిప్పించాడు. అప్పుడే మీనాక్షికీ రావుప్ప పంతులికీ అక్రమ సంబంధం సూచితమైంది.

గిరీశం శిష్యుడికి చదువు చెప్పే మిషతో బుచ్చమ్మ హృదయానికి గేలం వేస్తున్నాడు. అదే వాడుపుతో అక్కడి కొచ్చిన అగ్నిహోత్రుణ్ని బుట్టలో వేసేసి పెళ్ళి పన్లకి పెద్దయ్యాడు.

రామచంద్ర పురాగ్రహారంలో కరటకశాస్త్రి పట్టుకోవల్సిన వాళ్ళ-పురోహితుడు మీనాక్షి-కాళ్ళా గడ్డాలూ పట్టుకుని పనికానిచ్చి డబ్బుతో వుడాయించాడు. రావుప్ప పంతు రొచ్చి పెద్ద రగడచేసి "యీ పిల్ల రెండో పెళ్ళి పిల్లలాగ కనపడుతోం"దన్నాడు. అక్కడున్న వాళ్ళంతా సర్దిచెప్పి లుబ్ధావధాన్లు సాష్టంగంపడగా మధురవాణికి వేరే డబ్బు ఇచ్చుకోడానికి వప్పించి మరీ శాంతించాడు రావుప్ప పంతులు. పెళ్ళి రూపంలో శిథిల వ్యవస్థకి ప్రతీకైన లుబ్ధావధాన్లని దాన్ని ఆశ్రయించుకుని బతికే పరాన్నజీవులే చుట్టుముట్టారు.

ఈ పరాన్నజీవుల పీడన శిష్యుడూ హాకర్‌తో ఆరంభమైంది. మధురవాణి కంటెతో మలుపు తిరిగింది. 'మీ తండ్రి కూతుణ్ణి కలిసి పెళ్ళికూతుర్ని నూతిలో తోశా'రని రావుప్ప పంతులు యెత్తెత్తడంతో అది కుతుకులకి పట్టుకుంది. సారాకొట్టు కూట సాక్షులు హెడ్డూ కల్సి ఆడిన లిటిగేషన్ని అదుపుతప్పి ఆఖరికి మీనాక్షీ లుబ్ధావధాన్ల పీక్కి వుచ్చైంది.

అగ్నిహోత్రుడు ఆడంబరంగా పెళ్ళికి బయల్దేరుతున్నాడు. అదును చూసుకుని తనతో లేచి వచ్చేందుకు వప్పించాడు గిరీశం. జగన్నాథపురం సత్రం దగ్గర వెంకటేశాన్ని యేసుగెక్కించి తమ బండిని తోవతప్పించాడు గిరీశం. కంటె కోసం మరో వూహూపి లుబ్ధుడు లొంగకపోయేసరికి యేంతోచక చెరువు గట్టుకి కాలోచిత కృత్యాలు తీర్చుకుందుకి వెళ్ళాడు రావుప్ప పంతులు.

పెళ్ళికి తరలి వచ్చిన అగ్నిహోత్రుడు ఆ చెరువుగట్టుదగ్గరేదిగాడు. రావుప్ప

---

★ "గురజాడ అప్పారావు సమకాలికులకంటె రెండడుగులు ముందుకువేసి, భూస్వామిక సమాజ ఆవరణని దాటే సాహిత్య ప్రయత్నంలో ఆధునికత్వానికి అస్కారం కలిగించాడు. హేతువాద దృక్పథం, శాస్త్రీయ విజ్ఞానపై ఖరి, ప్రగతిశీలత నా అభిప్రాయంలో ఆధునిక లక్షణాలు."

— కె. వి. రమణారెడ్డి.

పంతులు తన లౌక్యప్రజ్ఞంతా వినియోగించి అగ్నిహోత్రుణ్ని లుబ్ధుడిమీదికి ప్రయోగించాడు. ఇంటికెళ్లి మధురవాణి కాళ్ళట్టుకుని యెలాగైనా యీ మాటుకి కాపాడమని వేడుకున్నాడు. 'కంటె యెవర్తికిచ్చావో దానికాళ్ళే పట్టుకో'మంది మధురవాణి.

లుబ్ధావధాన్లని చావచితకతన్నొచ్చిన అగ్నిహోత్రావధాన్లు ఇంకా కక్ష తీరక క్రిమినల్ తీసుకురావాలని రావప్ప పంతుల్తో మంత్రాలోచన మొదలెట్టాడు ఆ మంత్రాలోచనలో బుచ్చెమ్మ గిరీశంతో లేచిపోయిందన్న విషయం బయటపడింది. ఆ కోపం యీ కోపం వెంకటేశంమీదికి మళ్ళి "ఈ గాడిదకొడుకు ఇంగ్లీషు చదువు కొంప తీసింది" అంటూ తాళాధ్యాయం మొదలెట్టాడు అగ్నిహోత్రుడు.

బాల్య విధవా వివాహాల్ని వాటి పరిష్కారాల్ని వైయక్తికంగా భావిస్తే నాటకం ఇక్కడితో ముగిసింది. ఎందుకంటె ఆ దురాచారాల్ని సమర్థించి కొనసాగిస్తున్న "బ్రహ్మ"లిద్దరికి రిమ్మతెగులు వదిలేలా శృంగభంగమైంది.

లుబ్ధావధాన్లే యిరుసుగావున్న శిధిల వ్యవస్థని ఆశ్రయించుకున్న పరాన్నజీవులే అతన్ని అనేక రూపాల్లో పీడించారు. చివరికి కేసుల్లో ఇరికించారు. అగ్నిహోత్రావధాన్లొచ్చి చావచితకదన్నాడు. బాల్యవివాహంవల్ల చావుదప్పి కన్నులొట్టోయినట్టయింది. విధవా వివాహాన్ని వ్యతిరేకించినందువల్ల అతని కూతురు ప్రవర్తనే అతని పరువు తీసింది. ఇక అగ్నిహోత్రావధాన్లకీ సుబ్బికీ పెళ్ళిపీటలమీద కెళ్ళకుండానే చెడిపోయింది. విధవ కూతురు బుచ్చెమ్మ గిరీశంతో లేచిపోయి తలవంపులు తెచ్చింది.

గురజాడ యీ సమస్యల్నిగాని పరిష్కారాల్నిగాని వైయక్తింగా భావించలేదు సాంఘికమనే భావించాడు. ఈ సాంఘిక దురాచారాలకి సామాజిక మూలాన్ని సూచించాలనేదే ఆయన లక్ష్యం. ఆ లక్ష్యాన్ని సాధించడానికే ఆయన కథనిక్కడతో కంచికి పంపించలేదు. విశాఖపట్నానికి పంపించాడు.

సమాజ నిర్మాణాన్ని నడిపించే కీలక యంత్రం రాజ్యాంగం సమాజంలో జరిగే అభివృద్ధికి అణిచివేతకి దురాచారాలకి దానిదే పూర్తి బాధ్యత.

సమాజం మంచి చెడ్డలికి బాధ్యత వహించిన ఈ రాజ్యాంగ యంత్రానికి మూడు ముఖాలు. శాసన వ్యవస్థ దొక ముఖం. ఉద్యోగ వ్యవస్థ దింకోముఖం. న్యాయ వ్యవస్థది మరోముఖం. మొదటి రెండు ముఖాల చర్యల్ని పర్యవేక్షించి శృతి చేయాల్సిన బాధ్యత సామాజిక న్యాయాన్ని నిలబెట్టే కర్తవ్యం న్యాయ వ్యవస్థది.

ఆధునిక శాసన వ్యవస్థకున్న-పాత కొత్త-రెండు తలలూ రావప్పపంతులూ గిరీశాల పాత్ర చిత్రణలో సూచితమయ్యాయి. ఉద్యోగ వ్యవస్థ హెడ్ద్వారా సూచితమైంది. ఈ శాసన ఉద్యోగ వ్యవస్థల్ని పర్యవేక్షించి శృతిచేసే న్యాయవ్యవస్థ స్థితిగతుల్ని కళ్ళకి కట్టించడానికే కథని విశాఖపట్నం నడిపించాడు గురజాడ.

కంటె తగువుతో విశాఖపట్నానికి మకాం మార్చింది మధురవాణి. కోర్టు కేసుల్తో అగ్రహారీకుల మకామూ విశాఖే అయింది. సంస్కర్త సౌజన్యరావు రిక

మెండేషన్ కోసం బుచ్చమ్మని పెళ్ళాడ్డానికి-గిరీశమూ విశాఖకే వచ్చాడు.

తాతల్నాటి వస్తువుల్ని కరిగించేస్తూ అగ్నిహోత్రుడి కేసు నడిపిస్తున్నాడు రావప్ప పంతులు. వకీలు నాయుడు మధురవాణి ఇంట్లోంచి రావడం చూశాడు. కేసు వకాల్తీని భీమారావు పంతులికి మార్చేశాడు. దాంతో నాయుడు కులతత్వాన్ని రెచ్చగొట్టి తన తడాఖాని చూపించదల్చుకున్నాడు. న్యాయాన్ని నిలబెట్టాల్సిన నాయకుల్లోనూ అధికారుల్లోనూ జాతి మత కుల ప్రాంతీయ భాషా సంకుచితత్వాలు కేంద్రీకృతమైతే న్యాయం అన్యాయమౌతుంది. అన్యాయమే న్యాయమౌతుంది.

లుబ్ధావధాన్లకి ఆత్మానుభవమై తత్వం బోధపడింది. రావప్ప పంతులు అతని బసకొచ్చి పీడించాడు. అవధాన్లు అందుకు అవకాశం ఇవ్వలేదు. సౌజన్యారావువస్తూనే పంతులు వాలకంచూసి "నువ్వు ఎవరో నాకు తెలుసు-నడు బయటికి" అన్నాడు. రావప్ప పంతులు తోకముడిచాడు.

అగ్నిహోత్రుణ్నివప్పించి సామరస్యం చెయ్యాలన్న సౌజన్యారావు ప్రయత్నం విఫలమైంది. గుంటూరు శాస్త్రి వైనం కోసం హెడ్ బైరాగి వెనకపడ్డాడు. వృత్తి పోటీలో తలెత్తిన కులతత్వం కోర్టులో అగ్నిహోత్రుడి వ్యవహారాన్ని అడ్డంగా తిప్పింది. పూర్తిగా తోకముడిచాడు రావప్ప పంతులు.

సౌజన్యారావు తన దగ్గర కొచ్చిన గిరీశాన్ని లుబ్ధావధాన్లని తీసుకురమ్మని పంపాడు. తనని దత్తత చేసుకున్నట్టు దత్త పత్రిక రాసిమ్మని లుబ్ధావధాన్లని పీడించాడు గిరీశం. సౌజన్యారావు గారింటికి ఇద్దరూ బయల్దేరుతుండగా కంటెనీ సొమ్మునీ బంగీలో పంపాడు కరటకశాస్త్రి. ఆశ్చర్యపోతున్న లుబ్ధావధాన్లు చూసి అదుగో గుంటూరుశాస్త్రి అన్నాడు. అతను ఉడాయించే సరికి వెనకే గిరీశాన్ని బౌడు తీయించాడు.

కేసు మానుకోవాలా వద్దా అన్న మీమాంసలోవున్న అగ్నిహోత్రుడికి పరిగెత్తుకొచ్చిన కరటకశాస్త్రి కనిపించాడు. "ఏమిటిది బావా" అని అతను అటు తిరిగేసరికి తరుముకొస్తున్న గిరీశం కనిపించాడు. "అదుగో గాడిదకొడుకు"కని అగ్నిహోత్రుడు చెయ్యి చేసుకోబోయేసరికి అతని కాళ్ళు పట్టుకులాగిపడేసి ఉడాయించాడు గిరీశం.

లుబ్ధావధాన్లు గిరీశం ఇచ్చిన సమాచారంతో కేసు మబ్బులా విడిపోయింది. లుబ్ధావధాన్లది దొంగ పెళ్ళని తేలిపోయింది. నాయుడు ఆ కంటె మధురవాణిదన్నాడు. ఎవరి వస్తువులు వారికిచ్చేద్దామన్న సౌజన్యారావు గిరీశంతో "మీ మామా అల్లుళ్ళ సరసాన్ని మేకమించి చూశాను.నువ్వు కంటబడితే అగ్నిహోత్రావధాన్లు నీ ఎముకలు సున్నం చేస్తాడు. బుచ్చెమ్మతో మీ పెళ్ళి విషయం వీరయ్య పంతులుగారికి ఉత్తరం రాస్తాను. బుచ్చెమ్మ విడోహోమ్‌లో చదువుకుని ప్రాజ్ఞురాలవుతుంది. నీ బుద్ధి మార్చుకుని చదువుకుని మంచివాడివైతే ఆమెకిష్టమైతే నిన్ను పెళ్ళాడుతుంది లేదా మానుతుంది" అని గిరీశం దొడ్డిదారిన దౌడాయించడానికి యేర్పాట్లు చేశాడు.

గిరీశం దొరికిపోయిన దొంగలా నిలబడ్డాడు. తలవంచుకుని వెడుతూ పక్కకి తిరిగి "డామిట్ ! వ్యవహారం అడ్డంగా తిరిగింది" అన్నాడు. గిరీశంబుద్ధి కుక్కతోకలా వంకర తీరనిదని నిర్ధారణ చేసిన యీ దృశ్యాన్ని నిశ్చలనం చేసి "కన్యాశుల్కం"-మొదటి కూర్పు-నాటకాన్ని ముగించాడు గురజాడ.

వందేళ్ళ క్రితం గురజాడే అన్నట్టు నికృష్టమైన రంగస్థలాకర్షణలకి చోటివ్వకుండా రచించబడిందీ నాటకం. అదనపు ఆకర్షణలేమీ లేకపోయినా జనం బళ్ళు కట్టుకుని తండోపతండాలుగా వచ్చి యీ నాటక ప్రదర్శనల్ని చూశారు. ఈ విజయానికి పొంగిపోయి దీన్ని గురించిన ఆలోచనలకి పులుస్టాపు పెట్టలేదు గురజాడ.

'లోకమందలి మంచి చెడ్డలు లోకులెరుగుదురా' అన్నవాడు గురజాడ. అంచేత లోకవృత్తాన్ని అనుకరించే నాటకం మంచిచెడ్డలుకూడా-ఆ నాటకం వారినెంత ఆకర్షించి అలరిస్తున్నా-గుర్తించలేరన్న సంగతి ఆయనకి తెలుసు. ఆ గురుతరమైన బాధ్యత తనలాంటి కళాకారుల మీదేవుందన్న సంగతి కూడా తెలుసు. అందుకనే అంత జనాదరణకి పాత్రమైన తన నాటక ప్రదర్శనల్ని తాననుకున్న లక్ష్యాన్ని ఎంతవరకూ సాధించగలిగానన్న విమర్శనా దృష్టితో చూడగలిగాడు.

తాను చూడ్డమేకాదు. తనంత విమర్శనా దృష్టితో చూడగల్గిన తన మిత్రులతో చర్చించాడు. ఎస్. శ్రీనివాసయ్యంగారు (1874-1941) యీ విషయాల్లో గురజాడకి బాగా నమ్మకమున్న మిత్రుడు. ఆయన సలహాలతో మార్పులూ చేర్పులూ చేయబోగా ఇంచుమించు తిరగరాసినట్టయిందని ఆయనే అన్నాడు. ఆ మార్పులూ చేర్పులూ ఏవిటో ఇప్పుడు చూద్దాం.

నాటకం రచనా నిర్మాణంలో యెన్ని లోపాలైనా ఉండవచ్చును. మనశ్శరీరాల మీద సంపూర్ణాధిపత్యం వున్న నటీనటులు ప్రదర్శనా నిర్మాణ విద్యలో ప్రావీణ్యమున్న ప్రయోక్తా కలక్టివ్‌గా పనిచేస్తే దాన్ని తేలిగ్గా రక్తి కట్టిస్తారు. నాటకం రక్తి కట్టి జనాన్ని ఆకర్షించినంత మాత్రాన దాని రచనలో లోపాల్లేవని తీర్మానించడానికి లేదు.

ఈ అవగాహనతోనే గురజాడ తన నాటక ప్రదర్శనల్ని చూశాడు. చూడగా చూడగా లక్ష్యాన్ని వదలని ఆయన దృష్టికా ప్రయత్నం "ఆపరేషన్ సక్సస్-పేషంట్ డైడ్"లా కనిపించింది. అందుకనే యింకా నిర్దుష్టంగా తన లక్ష్యాన్ని వ్యక్తీకరించడానికి యేం చెయ్యాలని తానాలోచించాడు. తనకి తెలీని లోపాలింకా యేమున్నాయని తన మిత్రులతో చర్చించాడు. వాటన్నిటి ఫలితంగా ప్రధానంగా పాత్ర చిత్రణలోనూ ఆటుమీదట సంవిధానంలోనూ మరింతగా కేంద్రీకరిస్తే తన లక్ష్యాన్ని సంపూర్ణంగా సాధించగలనని గ్రహించాడు.

మొదటి కూర్పు రేఖా చిత్రం. దాన్ని సజీవ వర్ణచిత్రంగా మల్చడానికి కొన్ని సంవత్సరాలు మదనపడ్డాడు. ఆయన అంతర్మథనం నుంచి-పాత్ర చిత్రణకి సంబం

షించి-మధ్య యుగాల "మృచ్ఛకటికం" మెరిసి స్ఫూర్తిగా నిల్చింది. దీన్ని స్ఫూర్తిగా గ్రహిస్తే జీవితాన్ని బీభత్సం చేస్తున్న సాంఘిక దురాచారాలకి మూలమైన స్టేట్ స్వభావాన్ని మరింత నిర్దుష్టంగా వ్యక్తం చెయ్యగలనని ఆయన కనిపించింది. ఎటొచ్చీ మధ్య యుగాల స్టేట్ స్వభావం మూర్ఖత్వంతో కూడిన క్రూరత్వమైతే అదిప్పుడు ఆధునికమై లౌక్యంతో నాగరికతా సంస్కారాల్ని ప్రదర్శించే స్థాయి కొచ్చింది. అలాగే మధ్య యుగాల జీవితం చీకట్లో జీవిస్తూ-ఆదర్శపు - వెలుగుల్ని వూహించింది. ఆధునిక మవుతున్నకొద్దీ అది వెలుగునీడల మిశ్రమం అన్న అవ గాహన కొచ్చింది. ఈ సంవిధానంలో అవసరమైన ఆ మార్పుల్ని చొప్పించటానికేం చెయ్యాలి ?

మొదటి కూర్పులో విస్మరించిన విషయాన్ని యీ ప్రశ్నే మహాకవికి గుర్తు చేసింది. అది వేశ్యా సమస్య. మొదటి కూర్పులో వేశ్యలున్నారుగాని వారి సమస్య స్పృశింపబడలేదు. ఈ సమాజం గొప్ప ఆదర్శంగా భావించే వివాహానికి యిది చీకటి పార్శ్వం.

కన్యాశుల్కం దురాచారానికి నిలయమైన వివాహ వ్యవస్థ నాశ్రయించివున్న దురాచారాలన్నీ నిర్దుష్టంగా వ్యక్తంకావాలంటే యీచీకటి పార్శ్వాన్ని అంతఃసూత్రంగా నడిపించాలనే నిర్ణయానికొచ్చాడు గురజాడ. దాంతో మొదటి కూర్పులోని మధుర వాణిలో కల్సిపోయింది మహాలక్ష్మి. మహాకవి శ్రీశ్రీ చెప్పినట్టు 'అన్ని విధాలా వసంతసేన తలదన్నిన మధురవాణి పాత్ర చిత్రణకి అంకురార్పణ జరిగింది.'

మొదటి కూర్పుకీ రెండో కూర్పుకీ సంవిధానం రూపంలో పెద్దగా మార్పు రాలేదు. సారంలో చాలా మార్పు వచ్చింది. పాత్ర చిత్రణలో వస్తున్న మార్పు చేర్పుల్నిబట్టి కొన్ని సీన్లు పోయాయి. కొత్త సీన్లు వచ్చాయి. కొన్ని సీన్లు రూప రేఖా విలాసాలే మారిపోయాయి.

పాత్ర చిత్రణలో అనవసరమైన సామాన్య పాత్రలు పోయాయి. అవసర మైన కొత్త సామాన్య పాత్రలొచ్చాయి. ఉన్న చిన్న-సామాన్య-పాత్రల స్వభావాల్లో వచ్చిన మార్పులూ చేర్పులూ సహాయ ప్రధాన పాత్రల సజీవత్వాన్ని పెంచి వాట సహజ ప్రవర్తనా పరిధి విస్తరణకి దోహదం చేశాయి. ఫలితంగా నాటకం విస్తా రంగా విస్తరించినా పాత్ర చిత్రణా సంవిధానంలో ప్రామాణికంగా నిల్చిపోయేలా వచ్చింది. సంభాషణల్లోని గ్రాంథిక వాసనలు పూర్తిగాపోయి యెక్కడా కుంటుపడని- పట్టు సడలని-గమనం సాధ్యమైంది.

మొదటి దృశ్యం యెత్తుబడిలోనే పురెక్కించే మొదటి ముడిపడింది. అద మహాలక్ష్మి మధురవాణి వొకటి కావడం. కనిపించకుండా వినిపించే మహాలక్ష్మి పోయింది. ఆ స్థానంలోకి మధురవాణి వచ్చింది. గిరీశం "మధురవాణిని వదలడమంటే యేమీ మనస్కరించకుండా వుంది." అని "It is the women that seduce al

mankind" అనేసరికి ఆ పాత్ర కేవలం పాత్రకాక మొత్తం స్త్రీత్వానికి ప్రతీకయి పోయింది. 'మానవజాతి మొత్తాన్ని సెడ్యూస్ చేస్తున్నది స్త్రీలే' అన్న గిరీశం పురుషాధిక్యత భావనలోంచొచ్చిన యీ భావం అతను గుర్తు చేసుకున్న మధురవాణికి అన్వయమై ఆ ప్రతీక సూచితమైంది.

గ్రాంథిక వాసనల్నించి విముక్తమైన వాడుక భాష గిరీశం వెంకటేశాల ఘట్టాన్ని పట్టు సడలకుండా పరిగెట్టించింది. రెండు పాత్రలూ ఇంకా సజీవమై స్వభావసిద్ధమైన కళాకళల్ని ప్రదర్శించే అవకాశాన్నిచ్చింది. వెంకటేశాన్ని వంపాక మళ్ళీ మధురవాణి సమ్మోహన సౌందర్యాన్ని గిరీశం తల్చుకోడంతో పరిచయం కాబోతున్న పాత్రమీద ఉత్కంఠ పెరిగింది.

ఫొటోగ్రాఫ్ బంట్రోత్తు స్వభావంలోకి అదనంగా పోగాకు బలహీనతొచ్చింది. ఈ చిన్న చేర్పు యీ పాత్ర స్వభావంలో పెద్ద మార్పుని తెచ్చింది. రెండో కూర్పులో చుట్ట చూపించేసరికి బంట్రోత్తు నాగస్వరం విన్న నాగుపాములా తలాడించి మచ్చికయిపోయాడు. అంత డబాయించినవాడూ "శిత్తం సొమ్మి మాకేం శలవండి" అని నీళ్ళు నమిలాడు. దానిమీద గాయత్రిని ప్రయోగించడంతో "శిత్తం రేప్పొద్దున సొమ్మియకపోతే నా ఆబోరు దక్కదండి". అని గిరీశాన్ని బతిమాలుకుని వెళ్ళాల్సిన పరిస్థితిలో బంట్రోత్తు పడ్డాడు. కాదు గిరీశమే బంట్రోత్తుని ఆ పరిస్థితిలో పెట్టి-తల ప్రాణం తోక్కొచ్చినా-వదిలించుకున్నాడు.

బలహీనతని తెలుసుకుని ప్లే చేస్తే యెంతటివాడైనా బోల్తాపడతాడని ఈ మార్పుతో రుజువైంది. గిరీశం ఈ విద్యలో అందెవేసినవాడనీ వ్యక్తమైంది. చివర్లో "మేక్ హే వైల్దీ సన్ షైన్స్ అన్నాడు" అనడంతో అతను అవకాశవాదానికి ఆధునిక రూపమని సూచితమైంది. అంతేకాదు. ఆధునిక రాజ్యానికి-స్టేట్ కి-వున్న రెండు తలల్లో ఇతనో తలకి ప్రతీకన్న సూచనా వుంది.

రెండో కూర్పులోని రెండో సీను అదనంగా వచ్చింది. ఇది రామప్ప పంతులూ మధురవాణుల్ని-విజయనగరంలోనే-పరిచయం చేసింది. మధురవాణి తన-వృత్తి-వెలుగు నీడల్ని వ్యక్తంచేస్తూ రామప్ప పంతులు ప్రవృత్తిని బయటపెట్టింది. దీని వల్ల ఈ పాత్ర కేవలం పాత్ర కాకుండా అవకాశవాదపు సనాతన రూపమని అర్థమైంది. అంతేకాదు. ఆధునిక రాజ్యానికి-స్టేట్ కి-వున్న రెండో తలకిది ప్రతీకనీ సూచితమైంది.

గిరీశం రాకతో సీను విమానం టేకాఫ్ అయినట్టు పైకిలేచింది. శ్రీ శ్రీ చెప్పినట్టు మధురవాణి 'రామ' అన్న చోట క్షణంలో సగంసేపు కాలాన్ని ఆగమని శాసించాడు గురజాడ. అవకాశవాద-పాత కొత్త-ముఖాల కళ్ళాలు వెలుగునీడల జీవితం-మధురవాణి-చేతుల్లో వున్నాయని సూచించాడు. దీంతో మధురవాణి కేవలం పాత్రే కాకుండా స్త్రీత్వానికి జీవితానికి ప్రతీకై నిలిచింది.

పూటకూళ్ళమ్మ రాక దృశ్యాన్ని మరింత పైకి బిల్డప్ చేసింది. పాత్రల పరంగాచూస్తే ఇలా అనిపిస్తుంది. మధురవాణి ఇద్దరు సరసుల్ని వొకే మంచం కింద దాచింది. పూటకూళ్ళమ్మ చీపురుకట్ట సరసంతో వాళ్ళ తత్వాల్నింకా బయటపెట్టింది. పూటకూళ్ళమ్మలాంటి కొరకరాని కొయ్యలతోసహా ఈ లోకాన్ని తన కనుసన్నల్లో ఆడించగల శక్తియుక్తులు మధురవాణిలో వున్నాయి.

కాస్త లోతుగా ప్రతీకల పరంగా ఆలోచిస్తే రెండు తలల-పాత కొత్త-అవ కాశవాద చట్టాల సర్వాన్ని వెలుగునీడల జీవితం ఒకే రాజ్యాంగం కింద వుంచిందని పిస్తుంది. పూటకూళ్ళమ్మ పాత్రేగాక స్త్రీ సమస్యకున్న కోణాల్లో ఒకదానికి ప్రతినిధని పిస్తుంది. దెబ్బకి జడిసే దెయ్యంలా వొణికే రాజ్యాంగాన్ని దాన్ని వణికించే బల వంతుల్ని తన కనుసన్నల్లో నడిపించే శక్తియుక్తులు వెలుగునీడల జీవితానికే వున్నా యన్న సూచనా వుందనిపిస్తుంది.

ఈ విధంగా చూస్తే రెండో కూర్పులో కొత్తగా వచ్చిన యీ సీను పాత్ర చిత్రణలోనే చాలా కీలకమైనది. ప్రధాన పాత్రల-గిరీశం రామప్ప పంతులు మధుర వాణుల-స్వభావాల్ని యెంతో నిర్దుష్టంగా వ్యక్తం చేసింది. రాబోయే దృశ్యాల్లో వాటి ప్రవర్తనా పరిధిని వీలైనంతగా విస్తరించుకుందికి కావల్సిన సజీవత్వాన్ని సంతరించి పెట్టింది.

పూటకూళ్ళమ్మ ఇంటి నుంచి వీధిన పడ్డ గిరీశం విజయనగరంలో ఆబోరు దక్కదని వెంకటేశంతో కృష్ణరాయ పురాగ్రహారానికి బిచాణా యెత్తాడు. విజయనగ రంలో జీవనం గడవక మధురవాణి రామప్ప పంతుల్తో రామచంద్రపురాగ్రహారానికి వెళ్ళింది.

ఈ విధంగా ఒకొకాఫయిన ఈ నాటక విమాన విన్యాసాలకి జీవితమే ప్రమాణం పాత్ర చిత్రణలోని లోతులూ సంవిధానం సహజంగా లక్ష్యం చేరేందుకు తిరిగిన మలుపులూ యీ గీటుకే నిలుస్తాయి.

కృష్ణరాయపురాగ్రహారానికొచ్చిన గిరీశం ముందు కరటకశాస్త్రి మీద యీ వశీకరణ బాణాన్నే వేశాడు. మొదటి కూర్పులో దాని ప్రభావంలో పడకుండా వీడు టక్కర్లా వున్నాడని గ్రహించేస్తాడు. రెండో కూర్పులో ముందు పడిపోతాడు. తరు వాత నెమ్మదిగా గిరీశం తత్వాన్ని గ్రహిస్తాడు.

లోకం తెలీని వెంకమ్మయితే మూర్ఛపోయింది. తెలిసీ తెలీని శిష్యుడు గిరీశం-పాశ్చాత్య-ప్రభావానికి లోనయ్యాడు. అగ్నిహోత్రావధాన్లు ముందు గిరీశం మీద తారామండలానికి లేచినా యీ చిటకా ప్రయోగించేసరికి పూర్తిగా బుట్టలో పడి పోయాడు. గిరీశం వేషం భాషా వాలకం బుచ్చెమ్మకి మాత్రం మింగుడుపడనంత ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.

తోబుట్టువుకి పెళ్ళి తప్పిస్తానని భరోసా ఇచ్చి కరటకశాస్త్రి మొదటికూర్పులో-

శిష్యుడి విషయంలో-యీ చిట్కాని ప్రయోగించలేకపోయాడు. అదే రెండో కూర్పులో అత్యద్భుతంగా ప్రయోగించాడు. రెండో కూర్పులో శిష్యుడి వ్యామోహ బలహీనతలు వ్యక్తమై దీనికి దోహదం చేశాయి.

శిష్యుడు రఘువంశం బట్టీయం వేసేప్పుడు అవి వ్యక్తంకాలేదు. అది కుమారసంభవమయ్యే సరికి అతను కవికుల గురువుని గురువు భార్యని వేళాకోళం చేసే స్థాయికెదిగి తన బలహీనతలను వ్యామోహాల్ని వ్యక్తం చేశాడు. దాంతో పరస్పర వినియోగ ప్రయత్నం సజావుగా సాగింది. చివరికి యిల్లరికాన్ని మెరేసి ఆడ వేషం వేయ్యడానికి వప్పించడం జరిగింది.

రెండో కూర్పు సంవిధాన పాత్ర చిత్రణల్లోని ఈ అభివృద్ధి పాత్రల్ని పాత్రలుగా నడిపిస్తూ సమాజంలోని వాటి ప్రాతినిధ్యాల్ని సూటిగా చూపించింది. పాశ్చాత్య వ్యామోహాన్ని సూచిస్తూ వచ్చింది. గిరీశం వొడుపుగా యీ చిట్కానే ప్రయోగిస్తూ బుచ్చెమ్మని ముగ్గులోకి లాగాలని చూస్తున్నాడు. అగ్నిహోత్రావధాన్ల కున్న కోర్టు బలహీనతల మీద ప్లేచేసి పోకెట్లో వేసుకున్నాడు.

రామచంద్ర పురాగ్రహారంలోని లుబ్ధావధాన్లింటి సీన్లు రెండో కూర్పులో తొలిగి పోయాయి. రామప్ప పంతులింటి సీన్లు రూపు రేఖా విలాసాలే మారిపోయాయి. పాత్రల స్వభావ సంక్లిష్టతా గాంభీర్యతలు యెంతో నిర్దుష్టంగా వ్యక్తమయ్యాయి. ముఖ్యంగా మధురవాణి ఈ దృశ్యాల్లో తన వెలుగునీడల విశ్వరూపాన్ని చూపిం చింది.

నిజానికి గిరీశం మధురవాణుల చర్యలొకటే. వుద్దేశాలూ లక్ష్యాలూ మాత్రం వేరు. స్వార్థానికి ప్రాధాన్యమిచ్చి పరమార్థాన్ని ప్రదర్శిస్తాడు గిరీశం. పరమార్థానికి ప్రాధాన్యమిచ్చి-అవసరాన్నిబట్టి-స్వార్థాన్ని ప్రదర్శిస్తుంది మధురవాణి. ఎటొచ్చీ గురువుని మించిన శిష్యురాలైన వేశ్య గనక ఆమె వశీకరణ బాణాలికి పురుషపుంగ వులు పూర్తిగా మూర్ఛపోతారు. శిష్యుడే మధురవాణి నవ్వే పట్టుబడాలని చూశాడు.

మిగిలిన పురుష పుంగవుల సంగతిని వేరే వివరించనవసరంలేదు.

మధురవాణి వస్తూనే రామప్ప పంతులు వోటుకొమ్మని గ్రహించింది. ఆపదలో ఆదుకోగల ఆ ప్రాంతపు పెద్దలికి కనుకట్టు కట్టింది. వాళ్ళల్లో వొకడైన హెడ్ కాని స్టేబు యీ విషయాన్నీ రామప్ప పంతులు బండారాన్ని బయటపెట్టాడు. శిష్యుడితో వచ్చిన కరటకశాస్త్రికి తనేవిటో తెలియజేసింది మధురవాణి. అతని తోబుట్టువు ఆపద తీర్చడానికి సూత్రధారి బాధ్యతని స్వీకరించింది. తానెంత గొప్పగా నిర్వ హించగలదో మచ్చూ చూపించింది.

ఇంత గొప్పగానూ గిరీశం కృష్ణరాయపురాగ్రహారంలో బుచ్చెమ్మని ముగ్గు లోకి లాగే ప్రయత్నాలు చేశాడు. పోకెట్లో వేసుకున్న అగ్నిహోత్రుణ్ణి వుబ్బేసి పెళ్ళి పన్లకి పెద్దయ్యాడు. చివరికి-జామిచెట్టు సీన్లో-అతనికి అతని పాచిక పారినట్లని

పించింది.

వీధిన పడి జీవనం గడవక గిరీశం మధురవాణులు విజయనగరం వదిలారు. గిరీశం అగ్నిహోత్రుడి కోటలో పాగా వేశాడు. మధురవాణి రావప్ప పంతులు యింటికే గాక ఆ ప్రాంతానికి రాణయింది. పెద్దా చిన్నా అందర్నీ గులాముల్నిచేసి తన కను సన్నల్లో నడిపించగల స్థితికొచ్చింది.

సంవిధానం యీ స్థాయికి బిల్డప్ అయ్యాక-రెండో కూర్పులో-లుబ్ధావధాన్లు పరిచయమయ్యాడు.

ఎంతో కీలకమైన ఈ ఉత్తరం సీను-రెండో కూర్పులో-కొత్తగా వచ్చింది. ఈ మార్పు మానవ మనస్తత్వాల లోతుల్ని బయటపెట్టింది. గిరీశం బనాయించిన ఉత్తరం అనుమానాంకురం తలెత్తితే లుబ్ధావధాన్లలో మానసిక పీడనని పెంచే సమాచారాన్ని సప్లయి చేసింది. మొదటి కూర్పులోని పై సీన్లు కొన్నిలేవు. కొన్ని రూపురేఖలు మారిపోయాయి.

మధురవాణి తన పాత్ర పరిమితుల్లోనే సూత్రధారి పాత్రని-వెనక నుంచి హేంగు చేయడాన్ని-గొప్పగా పోషించింది. చివరికతినేర్పుగా రావప్ప పంతుల్ని ప్రయోగించి లుబ్ధావధాన్లని దొంగ పెళ్ళి సుడిలోకి తోసింది. ఈ మార్పు చేర్పులు లుబ్ధావధాన్లు కేవలం పాత్ర మాత్రమేకాదని శిధిల వ్యవస్థకి శిసలైన ప్రతినిధని యీ పరిచయ దృశ్యంలోనే సూచించాయి. దాని బలగాన్ని దానిమీదకే నడిపించి దాడి చేయించింది మధురవాణి.

శిధిల వ్యవస్థ నాశ్రయించుకున్న పరాన్న జీవులు పెళ్ళి పేరుతో జలగల్లా దాని-లుబ్ధావధాన్ల-రక్తం ఎలా తాగుతున్నదీ వ్యక్తమైంది. హాస్య ప్రధానమైన యీ నాటకంలో-సంఘర్షణలో-శిష్యుడు రావప్ప పంతులు కరటకశాస్త్రి మీనాక్షి పూజారి గవరయ్య కొండుభట్టు కాంబొట్టు పెళ్ళికొచ్చిన యావన్మందీ తమ తత్వాల్ని తెలియజేస్తూనే జీవిత బీభత్సాన్ని భూతద్దంలో చూపించారు.

ఉన్నత లోకం పరస్పర హరణోద్యోగంతో వుచ్చనీచాల్ని వదిలి ధనాన్ని స్త్రీని-మధురవాణిని-పొందాలని యెలా పోటీలు పడుతున్నది చాలా నిర్దుష్టంగా సూచితమైంది. అంతేకాదు. తన చుట్టూ వెంపర్లాడే వాళ్ళనే మధురవాణి లుబ్ధావధాన్ల మీదికి వ్యూహాత్మకంగా నడిపి దాడి చేయించిందన్న సూచనా కనిపించింది.

మధురవాణి శిధిల వ్యవస్థ-లుబ్ధావధాన్ల-మీదికి దాని శక్తుల్నే ప్రయోగించి చుట్టుముట్టించింది. ఇదిక్కడ జరుగుతున్నపుడే కృష్ణరాయపురాగ్రహారంలో గిరీశం పిచుక మీద తన చిట్టచివరి బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. ఉప్పల లక్ష్మణరావుగారు 'అతడూ. ఆమె'లో చెప్పించినట్టు బుచ్చెమ్మ అమాయకులైన సామాన్య ప్రజలకి సంకేతం ఆమె మీద తన ప్రజ్ఞంతా వినియోగించే బ్రహ్మాస్త్రాన్ని-బ్లాక్ మెయిల్ ని-ప్రయోగించి తనతో లేచిరావడానికి బలవంతంగా వప్పించాడు గిరీశం.

పెళ్ళిలో యే రెండో పెళ్ళి దాన్నో కట్టపెట్టాడని రావమ్మ పంతులన్నప్పుడే లుబ్ధావధాన్లలో అనుమానం తలెత్తింది. దానికి గిరీశం వుత్తరంలోని సమాచారం జోడించుకున్నాడు. అనుమానాన్ని పెనుభూతంగా పెంచుకున్నాడు. దాంతో పెళ్ళాడిన దాని మొదటి మొగుడు గిరీశం రూపంలో కల్లోకొచ్చి పీడించడం ఎక్కువైంది. చివరికీ మానసిక పీడన లుబ్ధుణ్ణి బెదురుగొడ్డుని చేసింది.

అసిరిగాడూ మీనాక్షి దన్నుగావున్నా లుబ్ధావధాన్లు దెయ్యం దెబ్బకి తారెత్తుతున్నాడు. అదునుచూసి కంటెతో గోడదూకి వుడాయించాడు శిష్యుడు. మధురవాణి మీద తన అంతర్నాటకంలోని ప్రధాన పాత్రల్ని వూరు దాటించాల్సిన బాధ్యతుంది. ఎక్కడుంచాల్సిన బలగాల్ని అక్కడుంచి ఎత్తుగడల్ని ఆలోచిస్తూ సిద్ధాంతి భుక్తాపోలిసెట్టిలతో పేకాడుతూ కూచుంది.

పూజారి గవరయ్య పోతానంటె సాగనంపి తలుపేసివచ్చి కూచుంది మధురవాణి. పంతులు తలుపులు బాది పిలిచాడు. తేలుకుట్టిన దొంగల్నా గదిలోనే దాచి తలుపు తీస్తున్న మధురవాణి మెళ్ళో కంటెవేసి ఆమెనే ఆశ్చర్యపరిచాడు శిష్యుడు. మీ గురువుని చేరకుండాగాని దాసరి వేషంవేస్తా రమ్మంది. వచ్చింది పంతులుకాదని మళ్ళీ ఆట మొదలైంది.

ఈసారి పంతులు నిజంగానే వచ్చాడు. వాళ్ళనింట్లోనే వుంచి పంతుల్ని గుమ్మంలోనే నిలేసింది మధురవాణి. తన కంటె తీసుకునే గుమ్మంలోకి రమ్మని అక్కణ్ణించే పంతుల్ని పంపేసింది. మధురవాణి తన గుట్టు నిలుపుకుందికి తాత్కాలికంగా అడ్డం వేసుకున్న కంటె వ్యవహారం చక్రమై నాటకాన్ని వూహించని మలుపుకి తిప్పింది.

పంతులు కంటె కోసం లుబ్ధుడింటి కెళ్ళాడు. అవధాన్లు తెలీదు పొమ్మన్నాడు. అసిరిగాడూ మీనాక్షిల్తో అక్కడికొచ్చాడు గవరయ్య. రెండు దెయ్యాల్ని సీసాలో బిగించాను బరువు చూసుకోమన్నాడు. పంతులు హడిలిపోతే అసిరిగాడుచూసి ఖరారు చేశాడు. రేపు శాంతి చేసేదాకా-డబ్బుముట్టేదాకా-సీసా దగ్గర పెట్టుకుని పెరట్లో పడుక్కుంటానని వెళ్ళాడు గవరయ్య. మళ్ళీ కంటె గురించి అడిగాడు పంతులు' అవధాన్లు లొంగలేదు. దాంతో "నువ్వూ నీ కూతురూ కలిసి దాన్ని చంపేశారు కాబోలు....నీ పని పట్టిస్తానుండు" అని వెళ్ళాడు రావమ్మ పంతులు.

సంవిధానంలో యిమడలేదనిపించేలా విస్తరించింది సారాకొట్టు సీను. ఒక్క బాల్యవివాహమే సమస్య యితే అది నిజమే. మొత్తం స్త్రీ సమస్య దృష్టితో ఆలోచిస్తే అలా అనిపించదు. అవసరమే అనిపిస్తుంది. జీవితమనే నాణానికి బొమ్మాబొరుసులు వున్నత అధోలోకాలు. లుబ్ధావధాన్ల పెళ్ళి పేరుతో బొమ్మకి సంబంధించిన బీభత్సం కళ్ళకి కట్టింది. అతన్ని కేసుల్లో ఇరికించిన మధురవాణి కంటె రూపంలో బొరుసుకు-అధోలోకానికి- సంబంధించిన బీభత్సం కళ్ళకి కట్టింది. పెరసి జీవిత వాస్తవికత

పూర్తిగా వ్యక్తం కాబడింది.

సీను చివర్లో వచ్చిన రామప్ప పంతులు హెడ్డుతో కంటె, ఋణీల సంగతి చెప్పాడు. హెడ్డు దీన్ని ఆసరా చేసుకుని లుబ్ధుణ్ణి బెదిరించి తన ప్రాంసరీనోటు తీసేసుకున్నాడు. పంతుల్ని 'నీ కంటె సంగతి నువ్వే చూసుకో'మన్నాడు. పంతులుకి మరో దారిలేక అసిరిగాడి చెయ్యితడిపి మీనాక్షిని లేపించాడు. మీనాక్షిని పెళ్ళి చేసుకుంటానని బెలిపించి కంటె తీసుకుని పుడాయిద్దామనుకున్నాడు. అది లుబ్ధుడి కంటపడి కాళ్ళు విరగొట్టాడు. కూతుర్ని ఇంట్లోంచి పొమ్మన్నాడు. పంతులు పారిపోతుంటే మీనాక్షి వెంటపడింది. మీనాక్షితో వస్తేనే లోపలికి రానిస్తానంది మధురవాణి. అన్నంత పనీ చేస్తుందని అక్కణ్ణించి పరుగు తీశాడు పంతులు.

పంతులు "ఎవడిల్లు? యవర్తె యిది నన్ను అడ్డడానికి? ఆశ్చర్యం" అని ఆత్మావలోకనంలో పడ్డాడు. శిష్యుడు దాసరి వేషంలో "తత్వం" బోధించాడు. ఆత్మానుభవమవుతున్న లుబ్ధుడు లాంటి వాళ్ళకి అది బోధపడుతుందేమో. ఈ శిధిల వ్యవస్థని దోచుకుని పీడించే పంతుల్లాంటి వాళ్ళకా "తత్వం" అర్థంకాదు. అందుకనే దాన్ని "వెర్రిముండా పాట" అని చెరువుగట్టు పైకి వెళ్ళిపోయాడు.

చెరువుగట్టుమీద పెళ్ళికి తరలొచ్చిన అగ్నిహోత్రుడి బళ్ళుదిగాయి. రామప్ప పంతులు ద్వారా లుబ్ధావధాన్ల పెళ్ళయిందని తెలిసింది. ఇల్లు చూపడానికొచ్చే దాసరి శిష్యుడు తన "తత్వం" వినిపించాడు. అగ్నిహోత్రుడు వాణ్ణి కొట్టబోయాడు. దారి చూపించనని వెళ్ళిపోయాడు దాసరి శిష్యుడు. ఎటో దిక్కుతోచక నిలబడిపోయాడు అగ్నిహోత్రుడు.

లుబ్ధావధాన్లని చావచితకదన్ని వచ్చినా అగ్నిహోత్రుడి ఆగ్రహం తగ్గలేదు. రామప్ప పంతుల్తో కలిసి క్రిమినల్ తేవడానికి ఆలోచిస్తుండగా అయ్యవారు బుచ్చెమ్మని లేవదీసుకుపోయారని తెల్సింది. ఆ కోపం యీ కోపం వెంకటేశంమీదికి మళ్ళింది. అతని వళ్ళు హూనమైంది.

బాల్య, స్త్రీ పునర్వివాహాలకే పరిమితమై ఆలోచిస్తే నాటకం యిక్కడితో ముగించవచ్చు. చాలా మంది ప్రయోక్తలు-ఉదా : అబ్బూరీ, నార్లా వంటివారు-ఇక్కడితోనే నాటక ప్రదర్శనని ముగించారు. ప్రధాన అనుబంధ సమస్యల్ని వాటి పరిష్కారాల్ని వైయుక్తంగా ఆలోచిస్తే ఈ ముగింపు సమంజసంగానే కనిపిస్తుంది. అందుకనే అధిక శాతం ఇదే ముగింపుగా ఆమోద ముద్ర వేసేసుకుంది.

నిజానికి యిక్కడితో యే సమస్యా పూర్తికాలేదు. వాటి మూలమూ సూచితం కాలేదు. కాని మొత్తం స్త్రీ సమస్య చుట్టూవున్న జీవితం సమగ్రంగా చిత్రితమైంది. పురుషాధిక్య-పితృస్వామ్య-వ్యవస్థలో దోపిడీ పీడనలకు గురవుతున్న స్త్రీత్వపు అన్ని కోణాలూ ప్రదర్శితమయ్యాయి. మధురవాణి తరువాత నాటకంలో ప్రదర్శితమవుతూ వచ్చిన స్త్రీతత్వపు అన్ని ప్రాతినిధ్యాలూ యిక్కడితో నిలిచిపోయాయి. ఈ ప్రాతి

నిధ్యాల సమన్వయ రూపమైన స్త్రీత్వం-మధురవాణి-నాటకం చివరిదాకావచ్చి ముగింపులో దిఃఖరించిన ప్రశ్నార్థకంలా నిల్చింది. ఈ వ్యవస్థా న్యాయాన్నే ప్రశ్నించింది.

స్త్రీ సమస్యకున్న అన్ని కోణాలూ యెలా వ్యక్తమయ్యాయో చూడండి.

కన్య-సుబ్బిలా-ముసిలాడికి విక్రయించబడితే ఆమె కన్నెచెర వదులుతుంది. కాని ఆ ముసిలి మొగుడు మరణించిన మరుక్షణమే విధవవుతుంది. ఘోటకూళ్ళమ్మలా పక్కదార్లు పడుతుంది. లేదా మీనాక్షిలా రామప్ప పంతుళ్ళ పాలబడి భ్రష్టమవుతుంది. కాదూ అంటే బుచ్చెమ్మలా చివరికి గిరీశాల పాలబడక తప్పదు.

పెళ్ళయితే మొగుడు అగ్నిహోత్రుడిలా పుక్కుపిండమైతే "ఎదురు చెప్పిన కొద్దీ మరింత కొర్రెక్కే మూర్ఖపు గాడిద కొడుక్కి" బతుకంతా బానిసయి అణిగిమణిగి చావాలి. పెళ్ళి కాకపోతే నిత్యకన్యగా-మధురవాణిలా-షెలయాలై జీవనం సాగించాలి. అగ్ని 'సరసుల' ఆటుపోట్లని తట్టుకుంటూ యేటికెదురీదాలి. అంచనాలు తలకిందులై బతుకు చితికిపోతే యోగినిలా పతన జీవుల పాలబడి వళ్ళు కుళ్ళ పెట్టుకుచావాలి.

ఇన్ని విధాల దురన్యాయానికి బలయిపోతున్న స్త్రీత్వంచేతే యీ వ్యవస్థని ప్రశ్నింపజేసి దానికి కనువిప్పు కలిగించాలనుకున్నాడు గురజాడ. అందుకనే మధురవాణితోసహా కథని విశాఖపట్నానికి నడిపించాడు. మధురవాణి కంపె మిషతో తెగతెంపులు చేసుకుని విశాఖకి వచ్చింది. అగ్రహారీకులూ కేసులు కారణంగా అక్కడికే వచ్చారు.

గురజాడ స్త్రీ సమస్యని సమాజ జీవితాన్ని సమగ్రంగా చిత్రించాలని మధురవాణి పాత్ర చిత్రణ మీద కేంద్రీకరించాడు. వివాహ వ్యవస్థకి చీకటి పార్శ్వమైన వేశ్యావృత్తిని సాధనంగా చేసుకున్నాడు. ఆ వ్యవస్థలోని స్త్రీత్వపు స్థితిగతుల్ని అన్ని కోణాల్నించీ చర్చించాడు. మధురవాణి పాత్ర సజీవమయ్యే క్రమంలోనే మిగిలిన సామాన్య సహాయ ప్రధాన పాత్రలూ యాంత్రిక స్థితినుంచి సజీవత్వాన్ని సాధించుకున్నాయి. ఇందుకు వాడదగని సీన్లూ సామాన్య పాత్రలూ తొలగించబడ్డాయి. ఇదే ప్రాతిపదిక మీద విశాఖ దృశ్యాల మార్పులూ చేర్పులూ కూడా జరిగాయి.

నాయుడి వకాల్తా భీమారావు పంతులు కిప్పించాక, సౌజన్యరావు పంతులు రామప్ప పంతులుకి వుద్వాసన చెప్పాక, శిష్యుడు కరటకశాస్త్రి మధురవాణిల సీన్లు కొత్తగా వచ్చాయి. అలాగే సౌజన్యరావు అగ్నిహోత్రుణ్ణి సామరస్యంగా దారికి తేలేకపోయాక, కచేరీలో అగ్నిహోత్రుడూ రామప్ప పంతుళ్ళ కథ అడ్డం తిరిగాక, బైరాగి వెనక హెడ్డుపట్టాక, పోలిసెట్టిని సాక్ష్యానికి నిలబెట్టాలనే విఫలయత్నం సీను కొత్తగా వచ్చింది. నాయుడితో మాట్లాడుతున్న అగ్నిహోత్రుడి కాళ్ళు వట్టుకులాగి గిరీశం పారిపోయాక గిరీశం లుబ్దావధాన్ల సీనొచ్చింది. ఈ సీన్లో అసిరిగాణ్ణి పూజారి గవరయ్యని సాక్ష్యానికి నిలబెట్టాలని హెడ్డూ గిరీశం చేసిన విఫలయత్నం కొత్తగా వచ్చింది. ప్రతీకలైన పాత్రల ప్రవర్తనతో సమాజ జీవితాన్ని సమన్వయించి అలో

చింపజేసేలా నాటకాన్ని ముగించిన సీను చివరిది.

మొదటి కూర్పు ఈ సీక్వెన్సుల్లో న్యాయవ్యవస్థ అస్తవ్యస్తత సౌజన్యరావు పాత్ర ఔచిత్యం కేవలం సూచితమయ్యాయి. రెండో కూర్పులో ఇక్కడ కొత్తగా వచ్చిన దృశ్యాలూ పాత్రలూ వాటి నింకా నిర్దుష్టంగా వ్యక్తం చేశాయి. చివరిసీను సమన్వయం దురాచారాలికి మూలమైన సామాజిక స్థితి-స్టేట్ ని- సూచనా ప్రాయంగా మెరిపించింది.

ఈ సీక్వెన్సులోని మొదటి సీన్లు న్యాయాన్ని తారుమారు చేస్తున్న కుల తత్వాన్ని అన్యాయాన్ని అవతలకి నెట్టే సంస్కరణ తత్వాన్ని పరిచయం చేశాయి. ఈ రెండూ-నాయుడు సౌజన్యరావు-న్యాయాన్ని నిలబెట్టాల్సిన న్యాయవాదులు కావడం గమనించాల్సిన విషయం.

కొత్తగా వచ్చిన కరటకశాస్త్రి మధురవాణిల సీన్లు ఆడిన అంతర్నాటకం అమాయకుల పీక్క వురిబిగించిందని చెప్పాయి. ఇందుకు శాసన వుద్యోగ వ్యవస్థల వృత్తి పోటీ అవినీతుల బాధ్యత ఎంతుందో వెనకటి దృశ్యాల్నించి నెమరేసుకు చూసుకోవాలి. ఇప్పుడు నిజం తెలిస్తే ఆ వురి వాళ్ళ పీక్క తప్పినా ఆడిన వాళ్ళ పీక్క పడతుందని చెప్పాయి. మధురవాణి కరటకశాస్త్రిల పాత్ర చిత్రణ లోతుల్తో బాటు సౌజన్యరావు-సంస్కరణ-తత్వఔన్నత్యాన్నీ బయటపెట్టాయి. చివర్లో మధురవాణి శిష్యుడితో దానికి "తత్వం" కరటక శాస్త్రికీ వినిపించింది. ఈ తత్వం ఆత్మానుభవమైన లుబ్ధుడికి అర్థమైనట్టు శిథిల వ్యవస్థని పీక్కుతినే వంకర బుద్ధులకు అర్థం కాదని చెప్పక చెప్పినట్టయింది.

సామరస్యం చేసేవాణ్ని చూసి మూర్ఖుడు "వీడికి వెర్రి కాబోలు" అనుకుంటాడు. సౌజన్యరావుని చూసి అగ్నిహోత్రుడు అదే అనుకున్నాడు. కేసుకి కీలకమైన గుంటూరు శాస్త్రిని వెతుకుతున్నాడు హెడ్డు. అంజనంలో చూసి చెబుతానన్న బైరాగికి దాసోహమని కూడా పడ్డాడు. మన శాసనకర్తలు ప్రభుత్వోద్యోగులు కార్యసాఫల్యతకి యీ నాటికీ సాధువులికీ సన్యాసులికీ దాసోహమంటూనే వున్నారు. కులతత్వం చేసిన గోల్మాల్ కి కోర్టులో అడ్డంగా తిరిగింది అగ్నిహోత్రుడి కేసు. రాకడ చూసి ముందే గ్రహించిన రామప్ప పంతులు చల్లగా జారుకున్నాడు. సౌజన్యరావు మాట వినుంటే అగ్నిహోత్రుడికీ అవమానం తప్పేది వింటే అగ్నిహోత్రుడెందుకవుతాడు.

అమాయకులైన మీనాక్షీ లుబ్ధావధాన్లని నిర్దోషులని నిరూపించేందుకు పోలిసెట్టిని సాక్షిగా నిలబెట్టాలని శత విధాల ప్రయత్నించాడు సౌజన్యరావు. ఫలితం సూన్యమే. నాయుడి ముఖతః రామప్ప పంతులు "తత్వం" వింటున్న అగ్నిహోత్రుడి కాళ్ళట్టుకలాగి "మావగారికి నమస్కారం" అని పరుగుచ్చుకున్నాడు గిరీశం. అగ్నిహోత్రుడికి జీవితంలో గిరీశం చేసిందేమిటో యీ చర్య సూచించినట్టయింది.

వ్యవస్థలూ వస్తువులే. వస్తుసారంలోని వైరుధ్యాలు వాటిలోనూ వుంటాయి. గాసన వ్యవస్థలోని వైరుధ్యాలకి ప్రతినిధులు గిరీశం రామప్ప పంతులు. ఉద్యోగ వ్యవస్థలోని వైరుధ్యాలకి కనిపించే హెడ్డు కనిష్టేబు కనపడని ఇనస్పెక్టరు. న్యాయ వ్యవస్థలోని వైరుధ్యాలకి నాయుడు భీమారావు పంతులు. ఈ ప్రాతినిధ్యాలతో సామాజిక స్థితికి-స్టేట్‌కి-బాధ్యత వహిస్తున్న స్టేట్-రాజ్యం-లోని వ్యవస్థల వైరుధ్యాల్ని చూచిస్తూ వచ్చాడు గురజాడ. నిజాన్ని అబద్ధంగా, అబద్దాన్ని నిజంగా మార్చే వీటి విచిత్ర విన్యాసాల్ని నాటకం ఆ చివర్నించి ఈ చివరిదాకా చిత్రించాడు. మొత్తం తన నాటక సంవిధాన సారాన్ని లుబ్దావధాన్ల దృశ్యం నుంచీ సమన్వయం చేయడం మొదలుపెట్టాడు.

గిరీశం వస్తూనే అవధాన్లని కౌగిలించుకుని ఏడ్చాడు. కింద మీదాపెట్టి చివరికి కనీసం "పవరాఫ్ అటర్నామా" గిలికిమ్మనాడు. సౌజన్యరావు పంతులెలా చెబితే అలా చేస్తానన్నాడు లుబ్దావధాన్లు, గిరీశం వెంటనే "వారెలా చెబితే అలాగే చేద్దాం" అని సర్దుకున్నాడు. నాడు నా వుత్తరం సంగతులు నువ్వాలోచించి వుంటే నేడు నీకీ చిక్కులు రాకపోను కదా అని సానుభూతి చూపుతూనే దెకారించాడు.

అప్పుడు గడ్డి తిన్నానని నిజాన్ని అంగీకరించాడు లుబ్దావధాన్లు.

హెడ్డు దుకాణదారుతో వచ్చాడు. లుబ్దావధాన్లతో బైరాగి మాయమయ్యాడని చెప్పాడు. బైరాగిమీద పెద్ద చర్చ జరిగింది. కనీసం తనకున్న కామన్ సెన్స్‌కూడా హెడ్డుకి లేదని తేల్చిన సారాదుకాణదారు "ప్రాణం పెడతాను బాయి, సాక్ష్యం మాట మాత్రం సెలవివ్వకండి" అన్నాడు. చివరికి హెడ్డు "ఇనస్పెక్టరు నా కొంప తీశా"డని ఏడిస్తే "బైరాగి నా కొంప తీశా"డని దుకాణదారేడ్చాడు.

పోలిసెట్టి దుకాణదారు సాక్ష్యానికెందుకు రావన్నారో అసిరిగాడొచ్చాక అర్థమైంది. ఆ పార్టీకో యీ పార్టీకో హాని కల్గించని సాక్ష్యం వుండదు. లోకం ఏలా పోతే మాకేం అని వ్యక్తిగతంగా ఆలోచించుకునే వాళ్ళు (వీళ్ళ సంఖ్యే ఎక్కువ) నిజం తెలిసినా సాక్ష్యం చెప్పరు. కనుక కేసు గెలవాలనే లక్ష్యంతో అటూ యిటూ అబద్ధం సాక్ష్యాలు కట్టకతప్పదు. అందుకు కోర్టు వ్యవహారాల్లో ఢక్కామొక్కలు తిన్న ఘనాపాటీలే-డబ్బుమేసి-సిద్ధపడతారు.

సారాకొట్టు సీన్లో బైరాగి "నిజవేవిఁటి, అబద్దవేవిఁటి? మేం సిద్ధులం అబద్ధం నిజం చేస్తాం. నిజం అబద్ధం చేస్తాం. లోకవేఁ పెద్ద అబద్దం-పదండి" అంటాడు. సిద్ధుల తరువాత ఈ శక్తున్నది బ్రాహ్మలకే. కనుకనే కూట సాక్ష్యాలకి వీళ్ళు సిద్ధంగా వుంటారు. పూజారి గవరయ్య తిరస్కరిణీ విద్యనవలంభించిన బైరాగిని తీసుకుని యిక్కడికి ఆ పని మీదే వచ్చాడు.

బైరాగి గవరయ్యకి అసిరిగాడికే అవుపిస్తాడు. గిరీశం హెడ్డులికి కనిపించడు. సిద్ధులూ పిశాచాలూ మాంత్రికులికి మూఢభక్తులికి పసిపిల్లకే తప్ప మరెవ్వరికీ కన

పడవని గవరయ్య వివరణ. ఇది విన్న గిరీశం "ఇదంతా హంబగ్" అని కాశీ చోటుని కొట్టి హంగామా చేశాడు. అది చూసి గవరయ్య రెచ్చిపోయాడు. గవరయ్యకి వంత పలుకుతూ "అదేటిబాబూ బైరాగోరు" అన్నాడు అసిరిగాడు. గిరీశం "ఏడిరా వెధవా" అని తన్నబోయేసరికి "లేదు బాబూ వృత్తినన్నాను" అన్నాడు. "కిరస్తానపు భ్రష్టుబున్నచోట మాంత్రికులూ సిద్ధులూ వుండ తగ"దంటూ బైరాగిని తీసుకుని వెళ్ళబోయాడు గవరయ్య. వెడుతూ "ఇనస్పెక్టర్ గారు కబురంపా"రని చల్లగా చెప్పాడు. వార్డు చిన్న మాటంటే అదేనో ఆ మహానుభావుడితో చెప్పండని వెళ్ళిపోయాడు.

గవరయ్య కూడా పోయేసరికి పెట్టుకున్న ఆశలు పూర్తిగా పోయాయి. గిరీశంతో "ఈ సాక్ష్యం మీరు మాట దక్కించుకున్నారు. మరి సాక్ష్యమన్నదిలేదు" అని కుదేలయిపోయాడు. కురుక్షేత్ర యుద్ధంలో భీష్ముడి మీదికి లంఘిస్తున్న కృష్ణుడిలా "ఆ మాటకొస్తే-నేనే సాక్ష్యానికి దిగి నీళ్ళు కారించేస్తాను. నా శక్తి చూతురుగాని-సౌజన్యరావు పంతుల్తో మాత్రం మాట యింకా చెప్పకండి" అన్నాడు గిరీశం.

శాస్త్ర జ్ఞానం సాయంతో నిజానికి అబద్ధానికి వున్న తేడాని తెలుసుకునే బాధ్యత మన మీదే వుంచి ఈ దృశ్యం ముగిసింది. తెలుసుకోవాలని ప్రయత్నించే వాళ్ళు చివరి మాటలన్న గిరీశం మొహాన్ని గుర్తుంచుకుని మాంటేజ్‌లా నాటకాన్నోసారి నెమరేసుకోవాలి.

నిజానికీ, అబద్ధానికి, న్యాయానికీ అన్యాయానికి మంచికీ చెడ్డకీ వున్న తేడాని తేలిగ్గా తెలుసుకోలేం, సమాజ సంక్లిష్టతతోసహా వాస్తవాన్ని-అంతర్లీనంగా-చిత్రించుకున్న కన్యాశుల్కం లాంటి నాటకాల్లోనూ యీ తేడాని తేలిగా తెలుసుకోలేం. ఆలోచించేకొద్దీ అంతర్లీనంగా వున్న వాస్తవం నిర్దుష్టమయ్యేందుకు రచనా నిర్మాణంలోనే రచయిత అనుసరించిన పద్ధతి తెలిస్తే తేలికవుతుంది.

జీవ నిర్మాణంలో జీవం అణువు అణువునా వుంటుంది. సజీవ నాటక నిర్మాణంలోనూ అంతే. అణువు అణువునా-ఘటనల ఘర్షణలో పాత్రల ప్రవర్తనలో-వుంటుంది. చూడగానే అవి మనసులో నాటుకోవాలి. ఆలోచించినకొద్దీ వాటిలో అంతర్లీనంగా వున్న వాస్తవస్థితి కళ్ళకి కట్టాలి. కళ్ళకి కట్టిన దాన్ని సమన్వయం చేసుకుని బొమ్మ కట్టించుకునే క్రమంలో వాస్తవం నిర్దుష్టమవుతూ వుంటుంది.

కన్యాశుల్కం-రెండు కూర్పుల-నాటక రచనకి గురజాడ అనుసరించింది యీ వాస్తవ పద్ధతినే. ఘనీభవించిన కొండలోపల వున్న వాస్తవాన్ని బయటపెట్టడానికి డైనమేట్ పెట్టి కొండని పేల్చడం లాంటిదీ పద్ధతి. కన్యాశుల్కానికి సంబంధించి డైనమేట్ మధురవాణి. దాన్ని వెలిగించే జానకితాడు గిరీశం. దాన్ని పేల్చే మీట అతని-నాటకం-చివరిమాట.

మొదటి కూర్పు పాత్ర చిత్రణలో గిరీశం పార్టీ-వెంకటేశం. అగ్నిహోత్రావ

ధాన్లు, వెంకమ్మ, బుచ్చెమ్మ-స్వభావంలో వున్నంతలో నిర్దుష్టంగా రూపొందాయి. అపోజిట్ పార్టీలోని పాత్రల స్వభావ నిర్దుష్టత లేక అవి యాంత్రికమయ్యాయి. అంచేత కొంచెం యింపుమించు సంవిధానం అదే అయినా ఫలితం సాధించబడలేదు. ఒక్క మాటలో దీన్నంతనీ చెప్పాలంటే నిర్మాణం-జానకి తాడు దాన్ని పేల్చే మీటా-అన్నీ వున్నాయిగాని డైనమేట్ లేదు.

అంచేతనే రెండో కూర్పులో డైనమేట్ ని కీలక స్థానంలోపుంచి నిర్మాణం చేశాడు గురజాడ,

రెండు కూర్పుల్లో యెత్తుబడి ముగింపు వొకటే. గిరీశం అవస్థని బట్టి చివర్లో వున్నమాట-మీట-యెత్తుబడికి ముందు వుందని వూహించవచ్చును. ఆ మీటనుం చొచ్చిన యీ జానకితాడు-గిరీశం-మొదటి సీన్లో తన స్వభావ వ్యక్తీకరణకి దోహదం చేసిన పాత్రల్ని కలుపుతుంది. మధురవాణి డైనమేట్-చుట్టూ తనెంతగా అల్లుకున్నది సూచించింది.

రెండోసీన్లో జీవితానికి దానికి మూలమైన స్త్రీత్వానికి ప్రతీకయిన మధురవాణి దానికి రక్షణగా నిలిచిన రెండు తలల-పాత కొత్త చట్టాల-రాజ్యాంగానికి ప్రతీకలైన రామప్ప పంతులు గిరీశం తమ సజీవ స్వభావాల్తో సహజంగా ప్రవర్తిస్తారు. పూట కూళ్ళమ్మొచ్చి పాతకొత్త అవకాశవాదాల్ని మధురవాణికి-జీవితానికి-వున్న శక్తి యుక్తుల ప్రావీణ్యాన్నీ బయటపెట్టింది.

మధురవాణి యింటినుంచి వుడాయించిన గిరీశం అగ్నిహోత్రుడింట్లో తిష్ట వేశాడు. ఆ యింటి మనుష్యుల చుట్టూ అల్లుకుపోయాడు. రామప్ప పంతుల్తో వెళ్ళిన మధురవాణి అతనికేగాక ఆ ప్రాంతం పెద్దలికి పిన్నలికి కనుకట్టు కట్టింది. వాళ్ళని తన కనుసన్నల్లో నడిపిస్తోంది.

ఆ స్థితిలో వచ్చిన కరటక శాస్త్రికి హామీ యిచ్చి సూత్ర ధారయింది. అక్కడ బుచ్చెమ్మ మీద గిరీశం వేసిన పాచిక పారింది, అగ్నిహోత్రుడి కుటుంబాన్ని మచ్చిక చేసుకునే క్రమంలో గిరీశం రాసిన వుత్తరం తీసుకుని లుబ్ధావధాన్లు రామప్ప పంతు లింటికొచ్చాడు. పాత సంబంధాన్ని తప్పించి కొత్తసంబంధాన్ని యెలా కుదర్చాలోనని ఆలోచిస్తున్న మధురవాణీ, రామప్ప పంతుళ్ళకి అది ఆధారమైంది. మధురవాణి వెనకనుంచి హంగు చేస్తూనే శిధిల వ్యవస్థకి ప్రతీకయిన లుబ్ధావధాన్లని-రామప్ప పంతులు ద్వారా-దొంగపెళ్ళి సుడిగుండంలోకి తోసి తాను తెరవెనక్కి తప్పుకుంది. సూత్రధారయి ఆ వ్యవస్థ నాశ్రయించుకున్న శక్తుల్తోనే చక్రవ్యూహం పన్ని మొత్తం జీవిత బీభత్సాన్నంతనీ కళ్ళకి కట్టించింది. అక్కడ అతి వొడుపుగా గిరీశం బుచ్చె మ్మని కార్నర్ చేసి - కాదనడానికి వీల్లేని స్థితిలో పడేసి - తనతో లేచి రావడానికి వప్పించాడు.

గిరీశం వుత్తరం పెళ్ళిలో రామప్ప పంతులన్నమాట అనుమానాన్ని పెను

ఘాతం చేశాయి. ఆ పెనుఘాతం పట్టుకు పీడిస్తున్న జుబ్బుకు మానసిక పీడనకి గురయ్యాడు. కంటెతో గోడ దూకొచ్చిన శిష్యుణ్ణి దాసరి వేషంతో వూరుదాటించే యేర్పాటు చేసింది మధురవాణి. తన యీ గుట్టు రట్టవకుండా వుండడానికే తన కంటె తెస్తేగాని యింట్లోకి రానివ్వనంది మధురవాణి, కంటెకోసం లుబ్ధావధాన్ల యింటికెళ్ళిన రామప్ప పంతులు అక్కడి తతంగం చూశాడు. కంటె యివ్వకపోయే సరికి ఆ పిల్లని మీరే చంపారు నా తడాఖా చూపిస్తానని బెదిరించి వెళ్ళాడు.

పతన జీవులు చేరేచోటు సారాకొట్టు. అధోలోకపు జీవన బీభత్సం అక్కడ అవుపిస్తుంది. శాసన వుద్యోగ వ్యవస్థలక దీనికీ విడదీయరాని అనుబంధం. అక్కడికి రామప్ప పంతులువచ్చి హెడ్డుకి కంటె సంగతి, ఖూనీ సంగతి చెప్పాడు. దీన్ని ఆసరా చేసుకుని, హెడ్డు తన ప్రాంసరీ నోటు గుంజుకున్నాడు. రామప్ప పంతుల్ని నీ కంటె సంగతి నువ్వే చూసుకోమన్నాడు.

పాలిపోని పంతులు అసిరిగాడి సాయంతో మీనాక్షిని కలిశాడు. బెలిపించి కంటె తీసుకుపోదామనే ప్రయత్నంలో వుండగా లుబ్ధుడు కాళ్ళు విరగ గొట్టాడు. పారిపోతున్న పంతులువెంట మీనాక్షీ పడింది. మీనాక్షితోవస్తేనే యింట్లోకి రానిస్తానంది మధురవాణి. చెరువు గట్టువైపుకి వెడుతున్న పంతులుకి దాసరి "తత్వం" బోధించారు. బళ్ళు దిగగానే లుబ్ధుడికి పెళ్ళయిందని తెలుసుకున్న అగ్నిహోత్రుడికి అదే తత్వాన్ని వినిపించాడు. లుబ్ధుడ్ని చావ చితకతన్నొచ్చి అగ్నిహోత్రుడు క్రిమినల్ తేవాలని పంతుల్తో ఆలోచిస్తుండగా అయ్యవారు బుచ్చెమ్మని లేవదీసుకుపోయాడని తెల్సింది. అగ్నిహోత్రుడు వెంకటేశం వళ్ళు హూనం చేశాడు. రామప్ప పంతులు అగ్నిహోత్రులు అగ్నిహోత్రుడి ద్వారా మీనాక్షీ లుబ్ధావధాన్లమీద క్రిమినల్ కేసు పెట్టించాడు.

దురాచారాలకి మూలమైన శిథిల వ్యవస్థ బీభత్సమంతా బయటపడింది. కాని దాని మూలస్థానంలో వున్న యిద్దరు బలహీనులైన నిర్దోషుల్ని-మీనాక్షి, లుబ్ధావధాన్లని-దోషుల్ని చేసింది. వాళ్ళని రక్షించడమన్నది వ్యక్తుల చేతుల్లో లేకుండా అదుపు తప్పిపోయింది. అందుకు కారణం రాజ్యాంగ వ్యవస్థల్లోవున్న అంతర్వైరుధ్యాలు. వాళ్ళిద్దరూ నిర్దోషులని రుజువు కాకపోతే వురి ఖాయం.

గిరీశం లుబ్ధావధాన్లమీద రామప్ప పంతులు సాయంతో అగ్నిహోత్రుడేసిన కేసులు సౌజన్యారావు దగ్గరకే వచ్చాయి. పంతులు చేసిన తిపిరీ నాయుడిలోని కుల తత్వాన్ని నిద్రలేపింది. దీనంతకీ కారకుడైన రామప్ప పంతుల్ని చూసి సౌజన్యారావు బయటికి పొమ్మన్నాడు. కేసుకి కీలకమైన గుంటూరు శాస్త్రి భోగట్టా విచారించాడు.

మధురవాణి తాను చక్రం అడ్డెయ్యకపోతే వాళ్ళ పీక్కి పడిన వురి మీ పీకలకి పడుతుందని శిష్యుడూ కరటక శాస్త్రుల్లకి తేల్చి చెప్పింది. గిరీశానికి అగ్ని

హోత్రుడికి సామరస్యం చెయ్యాలని విఫలమయ్యారు సౌజన్యరావు. గుంటూరు పత్రికోసం వెతుకుతున్న హెడ్డు బైరాగి వెనకపడ్డాడు. కోర్టులో కులతత్వం-మచ్చెమ్మా, గిరీశాలమీది-కేసుని అగ్నిహోత్రుడికి వ్యతిరేకంగా తిప్పింది.

రామప్ప పంతులు-రాజ్యాంగంలోని పాత చట్టాల తలకి ప్రతీక-చల్లగా తోకముడిచి జారుకోడం జరిగింది. అగ్నిహోత్రుడు కుదేలయిపోయాడు.

సౌజన్యరావు పోలిసెట్టిని సాక్షిగా వొప్పించలేకపోయాడు. అగ్నిహోత్రుడి కాళ్ళు పట్టుకులాగి పారిపోయాడు గిరీశం. హెడ్డూ, గిరీశం, దుకాణదారుని అసిరిగాణ్ణి సాక్షులుగా వొప్పించలేకపోయారు. అబద్ధాన్ని నిజం చేస్తున్న-లేని బైరాగిని వున్నాడని నమ్మిస్తున్న-గవరయ్యని ఖండించడంతో వాడూ జారుకున్నాడు.

ఏ సాక్షీ లేకపోయేసరికి హెడ్డు కుదేలయ్యాడు, అప్పుడు అతనితో గిరీశం అన్నమాట జానకి తాడుని అంటించింది, నాటకంలో జరిగిన యీ పైదృశ్యాలన్నీ-సినిమా మాంటేజ్‌లా-డైనమేట్లు పేలిన మెరుపుల్లా మనకి నెమరుకు వస్తాయి. చివరికి విత్తనదశలోవున్న వ్యాఘ్ర ముఖం గిరీశంలోంచి తొంగిచూస్తోంది.

రామప్ప పంతులు - రెండుతలల రాజ్యాంగంలోని పాత చట్టాల తల-తన కోర్టులోనే తలెత్తుకోలేక తోకముడిచాడు, అగ్నిహోత్రావధాన్ల కథ అక్కడే అడ్డంగా తిరిగింది. గిరీశం-కొత్త చట్టాలతల-నయవంచనతో కోర్టుకందని స్థాయికెదిగాడు. ఈ భావన మనలో కలిగాక పాత్రలే ప్రతీకల్ని గుర్తుచేస్తూ ప్రవర్తించి శక్తివంతంగా నాటక లక్ష్యాన్ని సూచించిన ముగింపు దృశ్యం మొదలవుతుంది.

సంస్కరణోద్యమంలోని వెలుగుకి ప్రతీక సౌజన్యరావు రాజకీయ సంస్కరణోద్యమాల్లోని నీడకి ప్రతీక గిరీశం. వీరిద్దరి సంభాషణ శాసన వుద్యోగ వ్యవస్థల్ని కృతిచేసే న్యాయవ్యవస్థ యెంత అపశృతుల మయంగా వుందో కళ్ళకి కట్టించింది. సారాంశాన్ని సమన్వయంచేసి సాంఘిక దురాచారాలకి మూలం స్టేట్—రాజ్యం-అని చెప్పకుండా చెప్పింది.

సమాజాన్ని నడిపించే పనిముట్టు రాజ్యం, ఇది సమాజ వుత్పత్తిని సొంతాస్తిగా మార్చే యంత్రాంగం కూడా. కనుక యీ యంత్రం యేవర్గం చేతిలోవుంటే దానికే వుత్పత్తి ఫలితం దక్కుతుంది. ఈ వర్గానికి మిగిలిన వర్గాలు అణిగి మణిగి వుండేలా యిదెప్పుడూ పహారా కాస్తుంది. అదుపు తప్పితే అణిచివేతని ప్రయోగిస్తుంది. మంచి చెడుల-అభివృద్ధి అణిచివేతల-మిశ్రమ రూపం రాజ్యాంగయంత్రం.

ప్రాథమిక దశల్లో దీని మంచి కనిపించినంత చెడు కనిపించదు, పాలక వర్గానికి కాలం చెల్లుతున్న దశల్లో చెడుని దాచుకుని మంచిని ప్రదర్శించాలని ప్రయత్నిస్తోంది, కాలం చెల్లిపోయాక దాని చెడు నగ్నంగా బయటపడుతుంది, దానిలో భాగమైన వ్యవస్థల్లోనూ వ్యవస్థలమధ్యా వైరుధ్యాలు తీవ్రమై అవి శృతి తప్పుతాయి. అపశృతుల మయమైపోతాయి

గిరీశం సౌజన్యరావుల సంభాషణ యీ సామాజిక స్థితినే సూచించింది.

సమాజంలో పుట్టి పెరుగుతున్న ప్రతివ్యక్తిమీద స్టేట్ ప్రభావం వుంటుంది. అంటే ప్రతి వ్యక్తిలో రెండు ముఖాలు-సమాజం, రాజ్యాంగం-వుంటాయి. అవి నిరంతరం సంఘర్షిస్తూ వుంటాయి అనుభవ అధ్యయనాల ఫలితంగా వ్యక్తి చివరి కేదోవైపుకి మొగ్గక తప్పదు.

సమాజానికి త్రికరణశుద్ధిగా అంకితమైన వ్యక్తి సొంతాన్ని వదులుకుంటాడు. పరమార్థానికి పాటుపడతాడు. సొంతానికే ప్రాధాన్యమిచ్చినవాడు సమాజ ముఖాన్ని కప్పుకుంటాడు. లేని పరమార్థాన్ని ప్రదర్శిస్తాడు. ఉన్న స్వార్థాన్ని దాచుకుంటాడు. పైచూపుకీ యిద్దరి ప్రవర్తనా ఒకేలా వుంటుంది. కనుక ఎవరేవిఁటన్నది లోకానికే తెలీదు. వ్యక్తుల కసలు తెలీదు.

ఈ సంక్లిష్టతవల్లే నిజానికీ అబద్ధానికీ, న్యాయానికి అన్యాయానికి, మంచికీ చెడ్డకి తేడా తెలుసుకోడం కష్టమైపోతుంది. కాని జీవితం నిడివి మీద- ఆచరణ గీటురాయి మీద- ఎవరేవిఁటో వేరుచేసి చూపిస్తుంది. అప్పటికి మంచిచెడ్డల మిశ్రమమైన రాజ్యాంగయంత్రపు మంచిముసుగు పూర్తిగా జారిపోతుంది. అప్పుడు కూడా చెడ్డ తెలివిమీరి తనని తాను ప్రజా వుద్యమాల మేలిముసుగులో దాచుకునే ప్రమాదం వుంది. అప్పుడూ జీవితం యేదో రూపంలో "పరీక్ష" పెడితే తప్ప తేడా తెలీదు. కొత్త మనిషి వచ్చాక అతనితో గిరీశం సౌజన్యరావుల సంభాషణ యీ సారాంశాన్నే సూచించేంది. గతుక్కుమన్న గిరీశం ఆ బోరు దక్కించుకుందుకి అతితెలివిగా అక్కణ్నించి తప్పుకున్నాడు.

విజ్ఞులు జీవితాన్ని వెలుగునీడల - మంచిచెడ్డల- మిశ్రమం అన్నారు మంచిలో చెడ్డ వుంటుందని, చెడ్డలో మంచి వుంటుందని గుర్తించారు. సహేతుకంగా వివరిస్తారు. కాని వారే- యేదో రూపంలో జీవితం సహకరిస్తే తప్ప ఆ తేడాని కనిపెట్టలేరు.

సమాజ సంక్లిష్టత మానవ మేధస్సుకి విధించిన పరిమితిది.

ఈ విజ్ఞులే ఆ రోజుల్లో వేశ్యావృత్తిని నిషేధిస్తూ- యాంటీనాచ్- వుద్యమాన్ని తెచ్చారు. సంస్కరణోద్యమం పరిమితిది. ఇదేకాదు. జాతీయోద్యమ కాలంలో వచ్చిన - మధ్యతరగతి - రాజకీయోద్యమాల్ని కూడా సంస్కరణవాద పరిమితే.

ఈ ఉద్యమ చైతన్య పరిమితిని దానికే యెత్తిచూపించి కనువిప్పు కలిగే కొత్త మనిషి రూపంలో వచ్చిన జీవితం- మధురవాణిగా యెత్తు యెత్తిం లుబ్ధావధాన్ల కేసు వివరం ఓ వేశ్యకి తెలుసు. సౌజన్యరావు ఆమెని వుంచుకున పెళ్ళాడినా ఆ నిజం చెబుతుంది.

కొత్త మనిషి తెచ్చిన యీ కబురు సౌజన్యరావు పీక్కి వురేసింది. అం

రిస్తే నిజం తెలుస్తుందిగాని అతని వ్యక్తిత్వ అస్తిత్వాలు వూడ్చుకుపోతాయి. అంగీక రించకపోతే అవి క్షేమంగా వుంటాయిగాని నిజం తెలీదు.

అంగీకరిస్తే తనపీక్కి - నైతికమైన - వురి.

అంగీకరించకపోతే వాళ్ళ పీక్కి - భౌతికమైన వురి.

ఈ విధంగా అతని పీక్కిప్పుడు గండకత్తెర.

చివరికి వేశ్యలకి వకీళ్ళు సమదంతా అని అంగీకరించాడు. ఓడిపోయానని వొప్పుకున్నాడు. వృత్తి సంస్కర్తగా - తన ప్రవర్తన ద్వారా - ఋజువు చేసుకుని ద్రవ్యాన్ని కోరమన్నాడు. ఆ మనిషి ద్రవ్యానికి సాధ్యురాలు కాదని కొత్తమనిషి అనడంతో "మీరు యాంటీనాచ్‌కారా? మీకీ భోగట్టా ఎలా తెల్సింది" అని నిలేశాడు. కొత్తమనిషి విధికృతం అనేసరికి "యేవిటో ఆ విధికృతం?" అని వెకారించాడు.

ఇది అని కొత్తమనిషి తన నిజరూపాన్ని చూపించింది.

పేరు మధురవాణి. ఊరు విజయనగరం. వృత్తి వేశ్య.

ఆగ్రహోశ్చర్యాల్ని నిగ్రహించుకోలేకపోయారు సౌజన్యారావు. ఏవిఁ మోసం?! అన్నాడు. చెడ్డలో కూడా మంచివుండచ్చన్న అతని ఉపదేశమే అతనికి గుర్తు చేసింది. ఎవిఁ దగా?! అన్నాడు. ఆగ్రహం తగ్గలేదని గ్రహించి తాను నిర్మలమైన అంతఃకరణతోనే వచ్చానని చెప్పి వెళ్ళబోయింది. అతను పిలిచి పాగా కోటూ మరిచిపోయావన్నాడు. మధురవాణి తన అంతఃకరణనంతా అతని ముందుంచి 'మనసే మరచిపోయాను' కాదవేవిఁటి? అని వెడుతుంటే పిల్చి లుబ్ధావధాన్లు మాటేవిఁటన్నాడు. చివరికి తుని తగువు దగ్గరికి తెచ్చి ఓ చిన్న ముద్దుని కోరింది. అప్పటికీ ప్రయత్నించి విధిలేక వ్రతభంగానికి సిద్ధమయ్యాడు.

లుబ్ధావధాన్లు పెళ్ళాడింపె ఆడపిల్లకాదని చెప్పింది. ఈ నిజానికి సంబంధించిన వివరం విన్న సౌజన్యారావు "నేను మేలుకున్నానా?! నిద్రపోతున్నానా?!" అనుకున్నాడు. తన ఫీజిచ్చి మరీ నిద్రపొమ్మంది మధురవాణి, అతను "బీదవాణ్ణి యిచ్చుకోలేనే?" అంటే "నాకు లోకంలో ఉన్న ధనవంతా అదే అనుకున్నానే" అని ఆమె అంది. "నీవు సొగసరివి ... ముద్దు చేదనికాదు. వ్రతభంగం కదా అని దిగులు" అంటూ అదుపు చేసుకుంటూ వస్తున్న ప్రలోభ ముఖాన్ని అతి నెమ్మదిగా బయటపెట్టాడు.

విజయనగరం మధురవాణింట్లో ఆమె సమయస్ఫూర్తిని - శక్తియుక్తుల్ని - సూచించడానికి - 'రామ' అన్నచోట - కాలాన్ని క్షణంసేపు ఆగమని శాసించాడు మహాకవి. అలాగే యిక్కడ ఆమె అంతఃసంఘర్షణని వ్యక్తం చెయ్యడానికి కాలాన్ని క్షణంసేపు ఆగమని శాసించాడు. మంచిలోవున్న చెడు బాగా నిర్దుష్టంగా ముందుకొచ్చాక చెడులోవున్న మంచిది పైచెయ్యయింది.

వారించి చెడని వాళ్ళని చెడగొట్టద్దన్న వాళ్ళమ్మ మాటని చెప్పింది.

సౌజన్యరావులోని ప్రలోభానికి - మంచిలోవున్న చెడుకి - ఆశాభంగమైంది. కాని నిగ్రహించుకుని నైతికంగా వ్రతభంగం కానందుకు కృతజ్ఞతలు చెప్పాడు సౌజన్యరావు.

మధురవాణి బల్లమీదున్న పుస్తకాన్ని చూసింది. వివరమడిగింది. భగవద్గీత గొప్పతనాన్ని చెప్పాడు సౌజన్యరావు. అమాయకంగా "శ్రీకృష్ణుడు యాంటీనాచ్ కాడాండి." అని చురకేసింది. మాట వెనకున్న వ్యంగ్యాన్ని, ఆమె పెంకెతనాన్ని అర్థం చేసుకున్న సౌజన్యరావు కావలిస్తే ఆ పుస్తకాన్ని తీసుకెళ్ళమన్నాడు. వృత్తి మానమని సలహా యిచ్చాడు.

మధురవాణి సత్పురుషుల దయ సంప్రాప్తమయ్యాక దుర్వృత్తి ఉండదంది. సత్పురుషుడనే నామానికి సార్థకమైనవాణ్ణి నీకిచ్చాను, ఆయన స్నేహం బలపడితే మా బోంట్లను తలచవన్నాడు సౌజన్యరావు. పెడుతూ అప్పుడప్పుడు రావచ్చునా అనగానే తటపటాయించాడు. అది చూసి మధురవాణి "వృత్తి మానినా, మంచి—" అర్థోక్తిగా ఆగిన ఆమె మాట వెనక ఆమెలో కనిపిస్తున్న పశ్చాత్తాపాన్ని నిర్మలాంతఃకరణని చూసి "అయితే రావచ్చును" అన్నాడు. కృతార్థురాలనని చెప్పి మధురవాణి అక్కణ్ణించి బయలుదేరింది.

మధురవాణి చెడులోని మంచిని తన మంచిలో దాగివున్న చెడుని చూడగల్గిన సౌజన్యరావు ఆలోచనలో పడ్డాడు. చటుక్కున గిరీశం విషయం గుర్తొచ్చింది. ఆమెని ఆపి గిరీశం గురించి అడిగాడు. బుచ్చెమ్మ జీవితం అన్యాయమైపోతుందన్నాక ఆమె చెప్పింది. మంచిలో విత్తనరూనంలోవున్న చెడుని చూసి ఆశ్చర్యపోయాడు సౌజన్యరావు. ఒక్క నిమిషం ఆగమని గబగబా పైకి వెళ్ళి గిరీశాన్ని తీసుకొచ్చాడు.

మధురవాణిని చూపించి యీమెను మీరెరుగుదురా అన్నాడు. అన్నివిధాలా ఆధారమైన సంస్కర్త - సంస్కరణోద్యమం - ముందే మధురవాణి - జీవితం - గిరీశం - అవకాశవాద ఆధునికరూపం - నిజరూపాన్ని బయటపెట్టింది. అతి వినయంగా పశ్చాత్తాప ప్రాయశ్చిత్తాలతో మళ్ళీ తన మంచి మాస్కుని తగిలించుకునే ప్రయత్నం చేశాడు. ఎన్నాళ్ళయింది చీకట్లోంచి వెలుగులోకురికి అనేసరికి అవాక్కయిపోయాడు. మధురవాణిని చెప్పమనగానే "ట్రూ రిపెంటెన్స్‌కి ట్వెంటీఫోరవర్స్ చాలదా" అన్నాడు. అతివినయం వెనకున్న ధూర్త లక్షణాన్ని గుర్తించిన సౌజన్యరావు గట్టిగా మందలించాడు. మధురవాణి చేసిన మహోపకారానికి ఆమెతో షేక్ హేండ్ చేశాడు. ఆగ్రహంగా "నెపోలియన్! తక్షణం యింట్లో నుంచి బయటకు అన్నాడు. దొరికిపోయిన దొంగలా గదిగుమ్మం దాటిన గిరీశం "డామిట్! కథ అడ్డంగా తిరిగింది" అన్నాడు. ఇటూ అటూ సౌజన్యరావు గిరీశాలు మధ్యలో మధురవాణి వారివారి అవస్థల్లో వుండగా నాటకం - చివరి దృశ్యం - ముగుస్తుంది.

మొత్తం నాటక నిర్మాణానికి కీలకమైన మాట గిరీశం చివరి మాట. అతని

బుద్ధి కుక్కతోకని చెప్పక చెప్పింది. అంతేకాదు. మన మీ నాటకాన్ని మనసుకి నాటుకునేలా చదివినా, ప్రదర్శన చూసినా యీ మీట నొక్కినప్పుడల్లా దృశ్యాలు నెమరుకువస్తాయి. గిరీశమనే జానకి తాడుకో కనెక్టయిన ఆ డైనమేట్లు - ఘటనలు పాత్రలు - పేలినప్పుడల్లా కొత్తకోణాన్ని కళ్ళకి కట్టిస్తాయి. అంతకుముందు ఊహా కందని కొత్త అర్థాల్ని ఆవిష్కరిస్తాయి.

చిన్నపిల్లల్ని, సామాన్య ప్రజల్ని కడుపుబ్బా నవ్విస్తాయి చాప్లిన్ చిత్రాలు. కనక వాటి పరమార్థమదే అని సరిపెట్టుకోడం భావ్యమా ? కాదు. అలాగే కన్యాశుల్కం. మనల్ని నవ్విస్తూనే మన జీవితంలో వున్న సామాజిక విషాదాన్ని కళ్ళకి కట్టిస్తుంది.

చాప్లిన్ చిత్రాల్లోని దృశ్యాలు ఆ పాత్ర చేసే చర్యలు చూసి నవ్వుకుంటూనే అవి వ్యక్తంచేసే ప్రతీకల్ని సూచనల్ని గ్రహించగల్గిన వారికి మాత్రమే వాటి వెనక విషాదం కళ్ళకి కడుతుంది. అలాగే కన్యాశుల్కం సంవిధానంలో సాగిన దృశ్యాలూ, పాత్రలు వ్యక్తంచేసే ప్రతీకల్ని, సూచనల్ని గ్రహించగల్గితేనే ఆ విషాదం కళ్ళకి కడుతుంది.

ఈ విషయాన్ని నాబోటి అల్పజ్ఞులు సూటిగా, సులువుగా, సూక్ష్మంగా చెప్పలేకపోవచ్చును. కన్యాశుల్కాన్ని మథించిన విజ్ఞులు అందరూ తలో కోణం నుంచీ ఆ పని చెయ్యాల్సిన అవసరం ఉంది. నా దృష్టిలో మొదటి కూర్పులో పాత్రలు కేవలం పాత్రలేగా - మరబొమ్మలుగా - సాగాయి. అవే రెండో కూర్పు కొచ్చేసరికి పాత్రలు కేవలం పాత్రలేగాక ప్రతీకలయ్యాయి. ఆ ప్రతీకల్ని దృష్టిలో వుంచుకునే యీ వ్యాసంలో విషయాన్ని వివరించే ప్రయత్నం చేశాను.

సమాజంలోని దురాచారాలకి మూలమైన స్టేటస్ అనే నాణానికి బొమ్మ గిరీశం. బొరుసు రామప్ప పంతులు. వెలుగు నీడల జీవితం మధురవాణి. జీవితానికి మూలమైన స్త్రీత్వానికి మధురవాణి ప్రతినిధి. కరటకశాస్త్రి జ్ఞానాన్ని సొంతానికి వినియోగించుకునే పండితులుకి ప్రతినిధి. లుబ్ధావధాన్లు శిథిలమైపోతున్న సామాజిక వ్యవస్థకి ప్రతీక. అగ్నిహోత్రావధాన్లు వివేకభ్రష్టమైన సంప్రదాయ మూర్ఖత్వానికి ప్రతినిధి. సౌజన్యారావు సంస్కరణోద్యమానికి ప్రతీక. వీరందరూ యేదో రూపంలో మధురవాణిముందు-స్త్రీత్వంముందు - యేదో రూపంలో పురుషాధిక్యతని ప్రదర్శించారు. కానీ చివరికి ఆమెముందు-జీవితంముందు-అంగుష్టమాత్రాల్లా నిలిచారు.

ఇది పురుషులకి సంబంధించి. ఇక స్త్రీలకి సంబంధించి చూస్తే మధురవాణి పరిచయమయ్యాకే పూటకూళ్ళమ్మ, వెంకమ్మ, బుచ్చెమ్మ, మీనాక్షి, యోగిని పరిచయమై స్త్రీ సమస్యకున్న విభిన్న కోణాల్ని వ్యక్తంచేశారు. చెరువుగట్టు సీనుతో ఆగిపోయారు. వివిధ కోణాలున్న స్త్రీ సమస్యయొక్క సమన్వయ రూపంగా అక్కణ్నించి చివరిదాకా మధురవాణి వచ్చింది.

ఊరికేరాలేదు. తనతోసహా పాత్రల్ని డైనమేట్లనిచేసి జానకి తాడులా అల్లుకుపోతూ గిరీశం అటునుంచి నరుక్కొచ్చాడు. ఆ పాత్రల్ని తన కనుసన్నల్లో నడిపించి శిథిలవ్యవస్థ వికారవికృత బీభత్సరూపాన్ని వ్యక్తంచేసింది. ఆ ప్రయత్నంలో వ్యవస్థ వ్యక్తమైనా బలహీనులైన వ్యక్తుల పీక్కి వురిబడితే రక్షించాలని వచ్చింది. ఆ రక్షించే క్రమంలో దోషులయ్యే వారికి చక్రం అడ్డేయాలని వచ్చింది. ఈ జీవితం కన్నా పొలంలో కాపుకి సాయం చేస్తే జీవితానికి రక్షణుండునేమో అని భావించింది. అటునుంచి నరుక్కుంటూ వస్తున్న గిరీశం మాత్రం తన కుక్కతోక తత్వంలో మార్పులేకుండా వచ్చాడు.

చివర్లో జీవితానికి స్త్రీత్వానికి ప్రతీకయిన మధురవాణి సంస్కరణోద్యమంలోలి వెలుగుకి ప్రతీకయిన సౌజన్యరావుకి కోర్టులకందనంత స్థాయి దిగి సంస్కరణవాద పరిమితిలో సాగే రాజకీయోద్యమాల్లో దాగి రేపు రాజ్యాంగ యంత్రంలోకి యెగపాకబోయే అవకాశవాద ఆధునిక రూపానికి ప్రతీకయిన గిరీశాన్ని పట్టిచ్చింది. అక్కడ దృశ్యాన్ని గురజాడ మహాకవి ఫ్రీజ్ చేశాడు.

సౌజన్యరావుకి గిరీశానికి మధ్య- జీవితానికీ దానికి మూలమైన స్త్రీత్వానికి- ప్రతీకగా నిల్చిన మధురవాణి మొహంలో పెద్ద ప్రశ్నార్థకం చోటుచేసుకుంది. తాను రక్షణనుకున్న రైతు తనని వుద్ధరిస్తాడా ? లేక సహృదయుడైన సౌజన్యరావు యిచ్చిన భగవద్గీత పురుషోత్తముడు తనని రక్షించి వుద్ధరిస్తాడా ? తేల్చుకోలేని ప్రశ్నార్థకం ఆమె మొహంలో చోటుచేసుకుంది.

ఆ నిశ్శబ్దం నుంచి "ఆధునిక స్త్రీ తన చరిత్రని తిరిగి రాస్తుంది" అన్న తన అవగాహనని స్ఫురింపజేసేలా దృశ్యాన్ని చిత్రించి నాటకాన్ని ముగించాడు. నేను విశ్లేషించడంలో నాకు తెలీకలోపాలు దొర్లి వుండచ్చు. తెలుసున్న విజ్ఞులు యిలాంటి ప్రయత్నాలు యింకా చేస్తే కన్యాశుల్కం నుంచి చాలా విషయాలు తెలుసుకోవచ్చును.

కన్యాశుల్కం ప్రదర్శనాయోగ్యం కాదనుకోవడం వల్ల ఆధునిక తెలుగు నాటకరంగం చాలా కోల్పోయిందని నాకనిపిస్తుంది. ముఖ్యంగా గురజాడ తరువాత కవిత్వంలో ప్రబలమైన ఆత్మాశ్రయ ధోరణే మిగిలిన సాహిత్య ప్రక్రియల్నీ యేలింది. దాంతో నాటక రచనకూడా సమస్య సాంఘికమైనా పరిష్కారాన్ని వైయక్తికంగా సూచించడం యెక్కువైంది. ఇందువల్ల కొన్ని మంచినాటకాలు వచ్చాయిగాని కన్యాశుల్కం సరసన నిలిచే గొప్ప నాటకం రాలేదు.

అటుమీదట నాటక రచన మూడు ముఖాల సాగింది. కిరాయి నాటకరంగంలో వచ్చిన సాంఘిక నాటకాలు. ప్రోత్సాహిక నాటక రంగంలో వచ్చిన నాటకాలు. అంత ర్వాహినిగా వస్తున్న సాహిత్య రంగంనుంచొస్తున్న సాంఘిక నాటకాలు. వీటిలో కిరాయికోసమో, బహుమతికోసమో నాటక రచనా పద్ధతిని వ్యక్తి ప్రధానంగా తీర్చిదిద్ది పక్కదారి పట్టడం జరిగింది. అయినా వుద్యమాల్నించి వచ్చిన -

'మా భూమి' 'ముందడుగు' లాంటి వాటిని మినహాయిస్తే పక్కదారి పడిన వాటి సంఖ్యే ఎక్కువ. మంచి నాటకాల సంఖ్య తక్కువ.

సాహిత్యంలోనూ ఔత్సాహిక నాటకరంగంతోనూ సన్నిహిత సంబంధం ఉన్న రా.వి. శాస్త్రి-1959-ప్రాంతాల కన్యాశుల్కం దారిలో-దాని సరసన ఎంతవరకూ నిలుస్తుందో పెద్దలు చెప్పాలి-నిజం రాశారు. మిగిలిన విషయాల మాటెలావున్నా గురజాడ కాలానికి విత్తన రూపంలోవున్న గిరీశం యిప్పటికి వటవృక్షంలా విస్తరించి రాజ్యాధికారానికి రావడం జరిగింది. మరో నాలుగైదేళ్ళకి కా.రా. మేస్టారి "యజ్ఞం" కథ-దీన్ని నాటకం చెయ్యదలిస్తే కన్యాశుల్కం పద్ధతిలోనే చెయ్యాలి-యీ మర్రిచెట్టు-నిన్నటి విత్తనం నుంచి నేడు వృక్షమైంది-సామ్రాజ్య వాదపు వూడల మర్రిలో భాగమని చెప్పింది. ఈ క్రమంలో రాజకీయ నేపథ్యాన్ని అంచనా వేస్తూవస్తే- యీ వేళ రామప్ప పంతులు-అవకాశవాద సనాతన రూపం-పల్లెల్లో కరణీకం వెలగబెడుతున్నాడు, గిరీశం-అవకాశవాద ఆధునిక రూపం-సర్వభౌమా రావయి-ఎం.పి-అయి ఢిల్లీలో దివాన్‌గిరీ-ప్రధాన మంత్రి గిరి-చెలాయిస్తున్నాడు. అంచేత కన్యాశుల్కం రచనా పద్ధతి దాన్ని ఆనాటి చారిత్రక పత్రంగా నిలపడమే కాదు. దాన్ని స్కేల్‌గా పెట్టుకుని జరుగుతున్న చరిత్రని అంచనా వేసుకునే చారిత్రకాధారమై కూచుంది.

సామాజిక చారిత్రక క్రమాన్ని గర్భస్థం చేసుకున్న చారిత్రక పత్రంలా నిల్చే మరో నాటకం రావడానికి దీన్ని ప్రామాణికంగా తీసుకుని పరిశోధనలు జరగాలి, గురజాడకున్న శాస్త్రీయ దృక్పథంతో ప్రజల పక్షం వహించి సమాజంలోని సమస్యలకి మూలం "స్టేట్" అన్న అవగాహనుండాలి. ఆ దృష్టితో పరిశోధనా రచన సాగాలి.

కన్యాశుల్కం ప్రదర్శనా యోగ్యం కాదన్నమాట ఎవరన్నా అది ఆడలేని సానిమద్దెల ఓడన్న, సామితే. నాటక విస్తరణ ప్రదర్శనా యోగ్యతకి నవలా విస్తరణ పఠనాయోగ్యతకి ఆటంకాలనుకుంటే చాలా ప్రామాణికమైన నాటకాలూ నవలలు పనికి రానివయిపోతాయి.

---

★ "మాట్లాడినట్టే సరీగ్గా రాయడం కూడా ఎవరికి సాధ్యం? అథవా రాసినప్పటికీ అందులో ఏమి పసవుంటుంది" అనేవారికి 'కన్యాశుల్కం'లోని ప్రతి వాక్యమూ, ప్రతి మాటా తిరుగులేని జవాబిస్తాయి. సామాజిక వాస్తవికతను 'కన్యాశుల్కం' ప్రతిబింబించినంత సంపూర్ణంగా మనదేశంలోని మరే యితర నాటకమూ ప్రతిబింబించలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. సంఘంలోని వివిధవర్గాలకు, కులాలకు, వృత్తులకు, మనః ప్రవృత్తులకు చెందిన ఎందరో వ్యక్తులు నిత్యజీవితంలో తాము ఎలాగ మాట్లాడతారో అలాగే 'కన్యాశుల్కం'లో మాట్లాడతారు." — శ్రీశ్రీ

నవలల్లో వుదాహరణ టాల్‌స్టాయ్ "యుద్ధము-శాంతి." ఇది మచ్చే, యిలా చెప్పుకుందుకి చాలా నవలలున్నాయి. గురజాడకి ముందూ వెనకాగా సమకాలికులైన హెన్రిక్ యిబ్సన్ (1824 - 1904), బెర్నార్డ్ షా (1856 - 1950) నాటకాలు కత్తిరింపులు లేకుండా ప్రదర్శించబడ్డాయి. ఇక ఇబ్సన్ "PEEROGNYT"లో కన్యాశుల్కంలో కన్నా యెక్కువ రంగాలున్నాయిట. అయినా గిల్‌గిడ్ అనే ప్రయోక్త ఒక్క మార్పుకూడా చెయ్యకుండా ఆడాడట.

వేగవంతమవుతున్న పెట్టుబడిదారీ కాల పరిమితుల్లోకి కన్యాశుల్కం వదగ లేదని ప్రదర్శనా యోగ్యత లేదనడం అర్థరహితం. నా కెందుకో గ్రీకు ట్రయోలజీ లక్షణం కన్యాశుల్కానికుందనిపిస్తుంది. నా ఆలోచనకి దగ్గరగా బుర్రా శేషగిరిరావు గారు గురజాడ కీ నాటకం మూడుభాగాలుగా రాయాలని వుందని చెప్పారన్నట్టు వారు రాసింది చదివాను. అవును కన్యాశుల్కంలో మూడు నాటకాలున్నాయి.

వీధినపడి జీవనోపాధి గడవక విజయనగరం నుంచి మకాం యెత్తిన గిరీశం మధురవాణులు చెరోవూర్లో "కోటలో పాగా" వెయ్యడం ఒక భాగం. ప్రగల్భాలు పలికే రామప్ప పంతులు చివరికి తనింటినుంచి తన సానిచేతే గెంటించుకు చెరువు గట్టుకు పోవడం 'మరో భాగం' ఇది "కంచె కథ", అయ్యవారు బుచ్చెమ్మను లేవదీసుకుపోయి అగ్నిహోత్రుడి కథ అడ్డంగా తిరిగిన దగ్గర్నుంచి చివర్లో గిరీశం కథ అడ్డంగా తిరిగేదాకా మూడో భాగం. దీని పేరు "డామిట్! కథ అడ్డంగా తిరిగింది".

ఇప్పటిదాకా జరిగిన ఎడిటింగులన్నీ సాంఘిక సమస్యకి, వైయుక్తిక పరిష్కారంతో తృప్తి పడి చెరువు గట్టుతో ముగించినవే. నా కెందుకో చివరిసీను-గిరీశం, సౌజన్యరావు. మధురవాణులున్నది-లేకుండా ఆడిన కన్యాశుల్కం ప్రదర్శన తలలేని మొండెంలా కన్పిస్తుంది. సమన్వయ సారమంతా ఆ దృశ్యంలోనే వుంది. సాంఘిక దురాచారాలకి మూలం "స్టేట్" అన్న సూచనా వుంది, ప్రదర్శన ఎడిట్ చేసి ఆడాలా, మొత్తం ఆడాలా అన్నది ప్రశ్నకాదు ఎలా ఆడినా అది మహాకవి లక్ష్యాన్ని నిర్దుష్టంగా వ్యక్తం చేయాలి, అందుకు ఎడిట్ చేయాలంటే, మధురవాణి కేంద్ర బిందువు కావాలి, లేదా పూర్తిగా ఆడితేనే గురజాడకి న్యాయం జరుగుతుంది. గిల్‌గుడ్ లాంటి ప్రయోక్త రాకపోతాడా "కన్యాశుల్కం" పూర్తిగా ఆడకపోతాడా అని అబ్బూరివారి ఆశట. అలాంటి ప్రయోక్తకి అవకాశం కల్పిరావాలిగాని ఈనాడున్న సాంకేతిక ప్రగతి సాయంతో పూర్తి నాటకం ఆడడం కష్టసాధ్యమేకాని అసాధ్యం కాదు.

అబ్బూరి వారి ఆశ తీరే రోజుకోసం ఎదురు చూద్దాం. ○

---

★ నేను ఎంత హాస్యప్రసన్నుడనో అంత గంభీరుడను, అంత భయంకరుడను.

— గురజాడ

# గురజాడ నిపుణవాణి మధురవాణి

—డా. సంజీవ్‌దేవ్

పాత్రసృష్టి పాత్రస్రష్ట కంటే భిన్నంగా ఉంటుందా ?

భిన్నంగాను ఉంటుంది, అభిన్నంగాను ఉంటుంది.

మట్టిపాత్రను సృష్టించిన శిల్పస్రష్ట కంటే ఆ సృష్టించబడిన పాత్ర భిన్నంగా ఉంటుంది.

కారణం, స్రష్ట అయిన తాను మనిషి, తన పాత్ర మట్టిపాత్ర. అటువంటప్పుడు పాత్రను నిర్మించిన వానికంటే పాత్ర భిన్నంగా ఉండక తప్పదు.

ఇది వస్తు జగతికి చెందిన సత్యం.

కాని కావ్య జగత్తులోని సత్యాలు ఇందుకు భిన్నంగా ఉంటాయి. కారణం, కావ్యశిల్పి మనిషి, తాను సృష్టించిన పాత్రలు కూడ మనుషులే కనుక.

అందుకని తన పాత్రలు తనకంటే అభిన్నంగా ఉండటం ఎక్కువ జరుగుతుంటుంది. కవి తన పాత్రలను ఎంత వస్త్వాశ్రయ దృష్టితో నిర్లిప్తంగా నిర్మించినా కూడ తనకు తెలియకుండానే తన భావాల, స్వభావాల స్పష్ట, అస్పష్టఛాయలు తన పాత్రల మీద పడుతూనే ఉంటాయి.

| ఆధునిక మహిళలు చరిత్రను తిరిగి రచిస్తారు. — గురజాడ |
|---|

ఒక శతాబ్దం క్రింద గురజాడ రచించిన కన్యాశుల్కంలోని ఉజ్వల పాత్ర మధురవాణి విషయంలో కూడ ఇదే సత్యం ప్రత్యక్షమవుతుంది.

ఆమె దొక విశిష్ట స్త్రీపాత్ర. ఆమె చింతనా శైలి వింతగా ఉంటుంది ఆమె భావాలు, స్వభావాలు ఎంతో ప్రభావవంతంగా రూపొందుతూ రూపాంతరం చెందుతుంటాయి ఎన్నో రమ్య రమ్య రీతుల్లో.

ఆమెను పదునుగల మేధావిగా, సరళమైన రసజీవిగా మలచాడు నిపుణ సాహితీ శిల్పి గురజాడ. తన మధురవాణి మీద తానే స్వయంగా ముగ్ధుడవుతాడు ఆయన.

మధురవాణి జీవితం సున్నిత వైవిధ్యాలకు, చురుకైన వైరుధ్యాలకు వింత నికేతనం. ఆమె ఎవరో, ఏమిటో అంతంత మాత్రాన స్పష్టంగా తెలుసుకోటంలో విఫలమవుతారు ఆమె సన్నిహితులూ స్నేహితులూ కూడ.

వ్యక్తరూపంలోని గుప్తజీవి ఆమె !

ఆమె పూర్తి వేశ్య కాదు, వేశ్య కాకుండాను లేదు. తన వేశ్య జీవితం తన కిష్టమైన వృత్తి కాదు. అయినా, కాకుండా ఉండటం కుదరటంలేదు. ఈ

వాంఛనీయ, అవాంఛనీయాల మధ్య ఆమె నలిగిపోతుంది. ఆమె సంగతి, ప్రగతి నలిగిపోతున్నాయి. ఆమె వెనక్కుపోలేకపోతూంది ముందుకూ రాలేకపోతూంది, ఎటూ సాగిపోకుండా ఉన్నచోటనే ఉండలేకపోతూంది. తన శక్తిలో పొందలేని ఆనందాన్ని తన అశక్తిలో అన్వేషించుకోసాగింది. కానీ అదీసఫలం కావటం లేదని గుర్తించింది.

ఇక ఏది గమ్యానికి మార్గం? గమ్యాన్ని వదిలినా మార్గం లేకుండా పోదు. కాని మార్గాన్ని వదిలితే మాత్రం గమ్యం వుండదు. కనుక గమ్యాన్వేషణకంటే మార్గాన్వేషణకే ఆమె ఎక్కువ విలువనిస్తుంది.

తాను జీవిస్తున్న విధానానికంటే భిన్నమైన విధానాన్ని ఎక్కువ మెచ్చుకుంటుంది. కరటక శాస్త్రిలు అన్న "నువ్వు విద్యా సౌందర్యాలు రెండు దోహదం చేసి పెంచుతున్నావు" అన్న మాటలకు మధురవాణి జవాబిస్తుంది ఈ క్రింది సాదా మాటల్లో :

"అంతకన్న కాపు మనిషినై పుట్టి మొగుడి పోలంలో వంగమొక్కలకూ మిరప మొక్కలకూ దోహదం చేస్తే యావజ్జీవం కాపాడే తనన్నవాళ్ళు వుందురేమో!"

| ప్రేమ, హృదయమున పుష్పించిన ఒక కోమల పుష్పం. అది అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టి, ఆత్మను తేజోవంతం చేస్తుంది. — గురజాడ. |
|---|

ఆమె తెలిపిన సరళ వాక్కుల్లో తనను నిరంతరం కాల్చివేస్తూన్న వేదనా జ్వాల, తాపం, సంతాపం, వర్తమానం మీద వైముఖ్యం మొదలైనవి వ్యంజనాత్మకంగా ప్రత్యక్షమవుతాయి.

తన వాడంటూ తనకొక మొగుడు లేకపోవటాన్ని తాను భరించలేకుండా ఉంది. తాను ఇంతవరకూ గడుపుతూన్న వేశ్య జీవితంలో తనకు పూర్తిగా అతికిపోయిన, తాను పూర్తిగా అతికిపోయిన భర్త అంటూ ఎవరూ లేరు. అందరూ తనకు తాత్కాలిక సహచరులే. తన శరీరానికి మించినదాన్ని వాంఛించేవారు వారిలో ఎందరుంటారో?

ఇటువంటి పైపై కిరాయి జీవితాన్ని గడపటానికి ఆమె మానసం ఎంతో ఘోషించేది. ఘోషించినంత మాత్రాన వాటన్నిటినీ తేలికగా వదులుకోవటం జరగజాలదు. మానవుడు తన కిష్టం వున్న వాటినన్నిటినీ ఆచరించలేడు, ఇష్టం కాని వాటన్నిటినీ వదలలేడు.

మధురవాణి విజయనగర నివాసిని అయిన వేశ్య అనీ, సాహిత్య, సంగీత, మొదలయిన కళలలో గొప్పగా నైపుణ్యం కలదనీ, "మృచ్ఛకటిక"లోని వసంతసేన తన ఆదర్శవనిత అనీ గురజాడవారు పేర్కొన్నారు. గిరీశం దగ్గర ఇంగ్లీషు కూడ నేర్చుకున్నదట. కొంతకాలం గిరీశంతో కూడ కలిసి జీవించిందట. అటు

తరువాత రామప్పపంతుల మోసంలోపడి ఆ పనతో కలిసి జీవించింది. కరటకశాస్త్రి అనే ఒక విజ్ఞానితోకూడ ఆమెకు పరిచయం.

ఎంత చిన్నవారితో, ఎంత గొప్పవారితో పరిచయమైనా కూడ, ఎందరితో కలిసి సహజీవనం చేసినా కూడ ఎవరి భావాల ప్రభావంకూడ తనమీద పడనివ్వక తన ప్రభావాన్ని మాత్రమే తనమీద పడనిస్తూ జీవితాన్ని నిర్వహిస్తూ వచ్చింది. మరి వారందరి మీద తన ప్రభావాన్ని ప్రాకించిందేమో తెలియదు.

రామప్పపంతుల జీవితంతో కలిసి వుంటున్నప్పుడు కూడ ఆయన్ను నిజాయితీతో భర్తవలె ఆరాధించేది. రామప్పపంతులు ఎక్కువగా కేసుల్లో తిరుగుతూ తిరుగుతూ చివరకు విశాఖపట్టణంలో స్థిరపడిపోతాడు. ఆమె కూడ విశాఖపట్టణాన్ని తనది చేసుకుంటుంది.

అక్కడుంటున్న రోజుల్లోనే మధురవాణి జీవితంలో మహాపరివర్తన ప్రవేశించింది. తన వృత్తిలో హైన్యాన్ని, దైన్యాన్ని, మాలిన్యాన్ని క్రమంగా గుర్తిస్తుంది. మహిళా జీవ వికాసానికి ధనసంపాదన కాని, ఇటువంటి హేయవృత్తి కాని, అతి భోగంకాని మార్గాలు కావని గ్రహిస్తుంది.

జీవితంలో ఏది భోగం కాదో, 'ఏది త్యాగమో, ఏది ద్వేషం కాదో, ఏది నిస్వార్థప్రేమయో, ఏది అల్పం కాక అనల్పమో, ఏది బంధనకాక స్వేచ్ఛయో, ఏది రోగం కాక నీరోగమో, ఏది నీరసం కాక రస సమృద్ధియో, ఏది స్థితికాక గతియో, ఎది జడచేతనాల సార్థక్యంకాక చిరంతన ఐక్యమో దాన్ని అన్వేషించ సాగింది. అన్వేషించిన దాన్ని అందుకో గలిగింది.

ఇటువంటి రోజుల్లోనే కరటకశాస్త్రి తన స్వార్థలాభం నిమిత్తం మధురవాణిని ఉపయోగించచూచి పరాజితుడైనాడు. ఆమెను డిప్యూటీ కలెక్టర్ దగ్గరకు పంపి తన స్వార్థసిద్ధి నిమిత్తం డిప్యూటీ కలెక్టర్‌ను వాడుకో సంకల్పిస్తాడు. కాని ఆమె అందుకు లొంగక ఆయనతో స్పష్టంగా చెపుతుంది "వెళ్ళదలచుకోలేదు. ఇటుపైన ఊరకుక్కలనూ, సీమ కుక్కలనూ దూరంగా ఉంచటానికి ఆలోచిస్తున్నాను" ఎంత ఆత్మగౌరవం, ఎంత దాస్యత అభావం ఆమెలో జొచ్చాయో!

మధురవాణి ఒక సుభాషిణి, ఒక చతుర సంభాషిణి, ఒక చమత్కార వాహిని. ఆమెలోని అహంకారాన్నంతా చమత్కారం మ్రింగి వేసింది. ఆమె భావం గహనం, ఆమె భాష మధుమయం; అందుకే ఆమె మధురవాణి అయింది.

---

★ స్త్రీ భిన్నురాలు కావడానికి కారణం- తాను యివ్వగలిగినదానికంటె అధికంగా పురుషుడు తననుంచి వాంఛిస్తున్నాడుకదా అని.... భర్త తెలివితేటలు లేనివాడయినా, అతనికి యింగితజ్ఞానం పూజ్యం. అయినా కూడా అతని మేధాసంపత్తిని భార్య ప్రస్తావించి తీరాలి.

—గురజాడ

గురజాడవారు వేశ్యలను హేయదృష్టితో చూడలేదు, నీచంగా తలచలేదు. అయినా వేశ్యావృత్తిని ఆయన ప్రోత్సహించలేదు, ప్రశంసించలేదు. దాన్ని లేకుండా చేయటమే ఆయన తన సమాజ సంస్కారాల్లో చేర్చిన ముఖ్య ఆచరణల్లో ఒకటి.

అయితే హేయంగా ఎంచబడే వేశ్యల్లో ఎన్నో ఉన్నత లక్షణాలను, లక్ష్యాలను, లాలిత్యాలను, గాంభీర్యాలను, కారుణ్యాలను, ఉన్నత మానవతను చేర్చాలనే ఆయన ఆర్భాటం.

అటువంటి ప్రోజ్వల దీపకాంతులనే మన 'కన్యాశుల్కం'లోని మధురవాణిలో వెలిగించాడు గురజాడ. ఆమె అస్థి చర్మ రక్తమాంస శరీరంలో మేఘాలమీద ఇంద్రధనువులను ప్రత్యక్షపరచాడు గురజాడ.

క్రిందను పైకి మార్చటంలోను, మసకను వెలుగులోకి ప్రకాశవంతం చేయటంలోను, మరీచికను మధురజలంగా రూపొందించడంలోను గురజాడ ప్రాజ్ఞుడు.

తన 'కన్యాశుల్కం'లోని తాను సృష్టించిన మానవపాత్రలన్నీ కూడ నిజానికి మానస శిఖరాలే. వాటిలో మధురవాణి పాత్ర మహోన్నత మానస శిఖరం.

ఇరవయ్యో శతాబ్దాంతంలోని ఆధునిక జగత్తు గురజాడవారి 'కన్యాశుల్కం' నాటి జగత్తుకంటే వైజ్ఞానిక రంగంలో ఎంతో వున్నతంగా పెరిగినాకూడా మానవ రంగంలో ఎంతో దిగజారిపోయి వున్నది. ఆకాశం కాంతితో ఉన్నాకూడ భూమిమీద శాంతి కరువైపోయింది.

నేటి మానవ సమాజంలో మధురవాణి లాంటి మహిళలు తమ మధురవాణిని వినిపిస్తూ తమ శాంతిగానం చేస్తూ తమ కాంతివర్తనను ప్రదర్శించాలి!

---

★ "ఇవాళ గురజాడ అప్పారావును గూర్చి ప్రత్యేకించి చెప్పుకోనక్కర్లేదు. నలగని బాటను తొక్కిన ధరుడు గాబట్టి, అనితర సాధ్యమైన కార్యాల్ని ఆయన కొన్నింటిని సాధించారు. అయితే మనం యింతకూ విస్తుపోవల్సింది ఎక్కడంటే- గిడుగు, గురజాడలు భాషా విషయకంగా ఆశించిన మార్పులు విశ్వవిద్యాలయాల మౌఢ్యకుడ్యాల్నింకా బద్దలు కొట్టనందుకు. ప్రపంచం ముందుకు పోతున్నా, పత్రికలు ముందంజ వేస్తున్నా, విశ్వవిద్యాలయాలు, వాటిని బంధిస్తున్న సాహిత్య దుశ్శాసనులు వెనకున్నా అభ్యుదయం మాదేనంటున్నారు. నిజానికి వాడుక భాషల్ని అంగీకరింప చేయడంలో, నేడున్న ప్రతిష్టంభనను తొలగించటం ఇక విద్యార్థుల చేతుల్లోపనే. ఇప్పటికి యాభై ఆరేండ్ల క్రితం "నవీనాంధ్ర భాషోద్యమాన్ని బలపర్చిన మొనగాళ్ళంతా విద్యార్థులే కావడం, కొన్ని విషయాలు సాధించడం. ఈనాటి చదువుల రాయళ్ళకు కనువిప్పు కలిగించాలి."

— ఎ. బి. కె.

( కె. వి. రమణారెడ్డి 'మహోదయం' పుస్తక సమీక్ష నుండి )

# బంగోరె 'మొట్టమొదటి కన్యాశుల్కం'పై సమీక్షలలోని శకలాలు

"సంపాదకులు ఇచ్చిన వివరణ విషయమై చూద్దాము. చాలా పదాలకు ఆయన కష్టపడి అర్థం తెలుసుకొన్నారు. వారు అభినందనీయులు. ఈ సందర్భంలో నాకు కలిగిన రెండుమూడు సందేహాలు మనవి చేస్తాను.

'అరవ చాకిరీ అంటే అరవలుచేసే చాకిరా?' అన్నారు. అరవ అంటే క్రూరమైన అని అర్థం ఉందికదా. అరవ చాకిరీ అంటే క్రూరమైన చాకిరీ అని అర్థం చెప్పడానికి ఏమిటి అభ్యంతరం? (అరవలు=నిర్దయులు, దుష్టులు; అరవతనము=నిర్దయ)

'చిక్కావురా మిడతంభొట్లు' లాంటి అందరికి తెలిసిన పలుకుబళ్ళకు ఎంతో వివరణ యిచ్చి అందరికి తెలియని కొన్ని పలుకుబళ్ళకు వివరణ ఇవ్వటానికి బద్ధకించారు బంగోరెగారు. ఉదాహరణకు : లుబ్ధావధానులు నాయుణ్ణి 'నీ ఇంట కోడిని కొయ్య' అని తిడతాడు. అది తిట్టు ఎలాగయింది? నీ యింట కోడిని కొయ్య అంటే నీ యింటిలోనుంచి శవం వెళ్ళ అని అర్థం. శూద్రుల ఇళ్ళలో శవాన్ని తీసికెళ్ళి దహనం చేసిన తరువాత, ఇంటికొచ్చి విధిగా కోడిని కొయ్యాలి. ఈ ఆచారం ఇప్పటికీ ఉన్నది.

'పాలుపోకుండా వుంది' అంటే అర్థం చెప్పడానికి సంపాదకులు తికమకలు పడటము ఎందుకూ? 'పాలుపోవు' అంటే 'తోచు' అని అర్థం. నిఘంటువులో ఉండనే ఉంది పాలుపోకుండా ఉంది. అంటే ఏ సంగతీ తోచకుండా ఉంది అని అర్థం చెప్పడానికి వెనుతీయవలసిన అవసరం ఏముందో తెలియలేదు.

'పచ్చపు దొంగ' అనే మాటకు అర్థము సంపాదకులకు తోచలేదో ఏమో- పచ్చపు జాతివాళ్ళు అని ఎవరైనా వున్నారా అని ప్రశ్నించుకొంటారు. 'పచ్చెము' అంటే 'చూచుచుండగా దొంగిలించుట' అనే అర్థం నిఘంటువులో ఉందికదా. అటువంటప్పుడు పచ్చపుదొంగ అంటే చూచుచుండగా దొంగతనము చేయువాడు అని అర్థం చెప్పడానికి అభ్యంతరం ఏమిటో తోచకుండా ఉంది.

ఇట్లాగే 'చవల వకీలు'లో చవల అనే మాటకు ఎదో అర్థం సాధించవలసింది బంగోరెగారు. అది పైవాటి అంత సులభం కాకపోయినా, మా యిండ్లలో తెలివితక్కువ వాడా అంటానికి చెవలవెధవా అనడముకద్దు. చవలవాడా అంటే బాలుడు అనే అర్థం తీయవచ్చు. తద్వారా చవల వకీలు అంటే బాలుడైన అంటే అనుభవములేని వకీలు అనే అర్థం లాగొచ్చుగాని

అది పండితులు చెయ్యాలిసిన పని. ఆ మాట కొరకరాని కొయ్యే.

వాతస్రోతము అనే మాటకు వ్రాయడములో పొరపాటు లాంటిది అని అర్థం సాధించారు. వాతస్రోతము అయితే అట్లే సాధించవచ్చుకాని వాత అని ఉంది కాబట్టి అది సరిపోవడం లేదు. నోటిమాటల్లో పొరపాటు అనే అర్థం అపాధించవచ్చునేమో, వాత అనే మాటకు వాయికి సంబంధము ఉంది కాబట్టి."

— మునిమాణిక్యం నరసింహారావు

"చూసే కళ్ళున్నవారికి, చూడగల మనసున్నవారికీ 'కన్యాశుల్కం' టెక్నీకలర్స్‌లో కనిపిస్తుంది. అది ఒక అక్షయ తూణీరం. అది ఎంతకూ తరగని పంట. ఆ గ్రంథములో ఇన్‌బిట్వీన్ లైన్స్ చాలా గ్రంథం ఉంది. 'కన్యాశుల్కం' రచన యాదృచ్ఛికం కాదు-యాక్సిడెంటు అంతకంటే కాదు. శాసన పరిశోధన చేసి ఆనంద గజపతి మహారాజుగారి వంశ చరిత్రను కట్టుదిట్టం చేయాలనే వృత్తి తాపత్రయంలో జపం విడిచి లొట్టలలో పడినట్లు అతి బాల్య వివాహాలు, కన్యాశుల్కం, పతనావస్థలోనున్న శిధిల సామాజిక వ్యవస్థ, సానులు, సానిమేళాలు - ఈ గొడవలు సబ్జెక్టివ్ దృక్పథంగల అప్పారావుగారిని ఆకర్షించి వివశుల్ని చేసిపారేసాయి.... ఆయన డేర్‌డెవిల్ లాగ వ్యవహారిక భాషను రమ్యాతిరమ్యంగా మలిచి మంచి పాకాన పడేసి పదును పట్టి డైలాగులలోని కెక్కించేసరికి సంఘోద్ధరణను మించి సాహిత్యోద్ధరణకు శంకుస్థాపన జరిగింది."

— పురాణం

"అంధవిశ్వాసాలు ప్రమాదకరమైనవి. అవి వ్యక్తుల కార్యాలను, కార్య విధానాలను తరచు నిర్దేశిస్తూ ఉంటాయి. ప్రశ్నించే స్వభావం లేనపుడు గుడ్డినమ్మకాలు కలుగుతూ ఉంటాయి. మనల్ని ఛాందసత్వం ప్రశ్నించనీయదు. సంశయాలతో ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. అణకువతో పడివుండమంటుంది. ఈ అణకువ పిరికితనానికీ లక్షణం. కార్యకారణ సంబంధ జ్ఞానం శూన్యమైనప్పుడు ఏది జరిగినా అది కాకతాళీయం, వేళావిశేషం, విధికృతం, యాదృచ్ఛికం అని వ్యక్తులు ఊహించి సంతృప్తి పడతారు. ఆలోచనకు చోటివ్వరు."

— గురజాడ

# ఎన్ని నెరజాణలున్నా
# గురజాడకు సాటిరావు(రు)

—డా. చప్ప సూర్యనారాయణ

సంస్కృత రూపకాల్లో మృచ్ఛకటికానికీ, తెలుగు నాటక ప్రపంచంలో కన్యాశుల్కానికీ ఒక విశిష్టమైన స్థానం వుంది. రెండూ కూడా సామాజిక సమస్యనే ఇతివృత్తంగా స్వీకరించాయి. రెంటిలోనూ లోకవృత్తం ప్రతిఫలించింది. సామాన్యులే అందులోని పాత్రలు. అందువల్లే ఆ రెండింటికీ నాటక ప్రపంచంలో సుస్థిరమైన స్థానం లభించింది. అభ్యుదయ కాముకులైనవారికి ఆ రెండు నాటకాలే ఉత్తమ నాటకాలుగా కనిపిస్తాయి. మిగతావి వారి దృష్టిలోకి రావు. అందువల్లే మహాకవి శ్రీశ్రీ కూడా మృచ్ఛకటికం తర్వాత మళ్ళీ కన్యాశుల్కమే అంతటి గొప్ప నాటకం అనగలిగాడు. భావకవి అబ్బూరికి కూడా ఇష్టమైన నాటకాలు ఆ రెండే.

అబ్బూరి రామకృష్ణరావుగారు బహుముఖ ప్రజ్ఞావంతులు. నటుడుగా నాటక ప్రయోక్తగా, నాటక రచయితగా, విమర్శకుడిగా నాటకరంగానికి ఎంతో సేవ చేశారు. ఎన్నోసార్లు కన్యాశుల్కం నాటకాన్ని ప్రదర్శించిన అనుభవం వారికుంది. రామప్పంతులు పాత్రను ఆయన పోషించిన తీరును ప్రఖ్యాత రంగస్థల దర్శకుడు ఏ.ఆర్. కృష్ణ ఎంతగానో శ్లాఘించారు. 'నటాలి' సంస్థ తరపున రెండో ప్రపంచ యుద్ధకాలంలో కన్యాశుల్కాన్ని ఆంధ్రదేశమంతటా పలుమార్లు ప్రదర్శించిన వారాయన. కన్యాశుల్కం నాటకాన్ని పూర్తిగా ప్రదర్శించిన ఘనత అబ్బూరికే దక్కుతుంది. అంతటి అనుభవంతో అబ్బూరి గురజాడ అప్పారావుగారి గురించీ, కన్యాశుల్కం నాటకం గురించీ తెలుగులో నాలుగూ, ఆంగ్లంలో ఒకటీ వ్యాసాలు రాశారు. వాటిని సమీక్షించడమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

**కన్యాశుల్కం :**

ఈ వ్యాసంలో 'కన్యాశుల్కం' ఆవిర్భవించిన నాటికి తెలుగు నాటకరంగ పరిస్థితి ఎలావుందో వివరించారు. అప్పటికి అనుకరణ ప్రాయాలైన నాటకాలే తప్ప

---

★ "తాము గడపవలసిన జీవితం. అనునిత్యం తాము ఎదుర్కోవలసిన పోరాటాలు తమ కళారచనలలో భాగంగా ఉండకపోతే అవి దేశానికి ప్రాతినిధ్యం వహించకపోతే, ఆ ప్రజలలో ఏదో పెద్దలోపం, ఏదో కుళ్ళు వుందన్నమాట." — కట్టమంచి రామలింగారెడ్డి.

జీవకళ పుట్టిపడే నాటకాలు లేవనీ, అందువల్ల ఆ నాటికి నాటకరంగం అధోగతిలో వుందని అన్నారు. ఆ స్థితిలో వచ్చిన 'కన్యాశుల్కం' గురించి 'చదివిన వెంటనే సాష్టాంగపడేంత కావ్యశిల్పం కన్యాశుల్కంలో లేదు. అయినా అందులో అసమాన ప్రతిభా సూచికాలైన సందర్భాలెన్నో వున్నాయి. నాటకకళా విజ్ఞానాన్ని సూచించే మార్గాలెన్నో వున్నాయి. అంటారు. తెనాలి రామవిలాస సభవారు ఈ నాటకాన్ని ప్రదర్శించిన తర్వాత దీనికి విశేష ప్రచారం లభించిందన్నారు. వారి ప్రదర్శనతో 'ఆంధ్రప్రేక్షక లోకాన్ని గిరీశం క్రీగంటి చూపులూ, పరిహాసాలూ, మధురవాణి హాస్యభరితమైన మాటలూ, రామప్పపంతులు ప్రేమ ప్రలాపాలూ, కరటకశాస్త్రి గంభీరమైన నత్తిమాటలూ ఆకట్టుకున్నాయి' అన్నారు. ఈ వ్యాసం 'శారద' పత్రికలో **1924** జూన్ సంచికలో అచ్చయింది.

**అప్పారావూ-కన్యాశుల్కమూ :**

ఇది అసంపూర్ణ వ్యాసం. రచనా కాలం కూడా తెలియదు. ప్రాచ్యపాశ్చాత్య సంప్రదాయాలతో సంబంధాలు కోల్పోయి చైతన్యరహితంగా తయారైన తెలుగు సాహిత్యంలో అప్పారావుగారి కథలూ, కావ్యాలూ సంచలనం కలిగించాయి. భాష లోనూ, ఛందస్సులోనూ కొత్తదారులు చూపాయి. కానీ, వారి అపూర్వమైన మానవత్వం ప్రతిఫలించలేదని అంటూ "ఎన్ని నెరజాడలున్నా గురజాడకు సాటిరారు" అన్నారు.

సమాజం కోసమూ తోటి మానవులకోసమూ కృషిచేసినవారికి జీవితం చాలా చిన్నదిగా కనిపిస్తుందనీ అందువల్లే అలాంటివారు చరమదశలో అసంతృప్తిని వ్యక్తం చేశారని చెబుతూ సోక్రటీసు, గెథే, గిబ్బన్, తిక్కనలాంటి ప్రముఖుల అభిప్రాయాలను ఎత్తిచూపుతూ, గురజాడ కూడ తన అవసానదశలో వ్యక్తం చేసిన అసంతృప్తిని —

"పెరిగి విరిగితి విరిగి పెరిగితి
కష్టసుఖముల పారమెరిగితి
నేటి లోకము చాలుచాలును లంగరెత్తుము"

---

★ "సామాజిక రుగ్మతల్ని రూపు మాపడానికి, సమాజంలో అంతర్భాగమైన సాహిత్యం కూడా విధిగా బాధ్యత పుచ్చుకోవలసి ఉంటుంది. ఇటువంటి దుర్వ్యవస్థవల్ల దాపురిస్తున్న దుష్ఫలితాల్ని ప్రజలకు నచ్చజెప్పి, ఉన్నత నైతికప్రమాణాల్ని నెలకొల్పడంకంటె, ఎప్పటి సాహిత్యానికైనా మేలైన పని వేరేలేదు. సాహిత్యానికి గురజాడ చూపిన దారియిదే. ఈ దారిని తప్పడం, పెడదారులు తొక్కడమే అవుతుంది. సమాజం నుండి సాహిత్యాన్ని వేరుచేయడమూ అవుతుంది." — సెట్టి ఈశ్వరరావు

అని వెల్లడించారు. తర్వాత కన్యాశుల్కంలోని వస్తువైవిధ్యాన్ని వివరించారు. ఆ నాటకంలో పైకి కనిపించే కథని మించిన ప్రయోజనం వుందని ఆయన భావించారు. పైకి కన్యాశుల్క దురాచారాన్ని రూపుమాపటం కోసం రాసినట్లు కనిపించినా, నిద్రాణంగా వున్న మనజాతిని మేలుకొల్పటానికి ఉపకరిస్తుందన్నారు. పరం కంటే ఇహానికి ప్రాధాన్యమిచ్చే సంభాషణల్ని కొన్నిటిని ఎత్తిచూపుతూ, గురజాడ పరలోక భోగాన్ని ఎలా నిరసించారో వివరించారు.

సంఘ సంస్కరణం గురించి గిరీశం చెప్తాడు. దాన్ని గురించి వివరిస్తూ— 'దాన్ని ఆచరించాలంటే లోకస్థితి తెలియాలి. విశాల ప్రపంచాన్ని చూడాలి. అక్కడి ఆచారవ్యవహారాల్ని తెలిసికోవాలి. తీరా తెలిసికొన్నాక మనదేశం వస్తే ఏమవుతుందో ? గిరీశం అన్నట్లు 'మనవాళ్ళు వట్టి వెధవాయ్‌లోయ్. అనిపిస్తుంది' అన్నారు. మనవాళ్ళకు పరాయివాళ్ళమీద వ్యామోహమెక్కువని నిరసించారు. మన గొప్పతనాన్ని కొలవడానికి కూడా పరాయివాళ్ళమీద ఆధారపడవలసి వచ్చినందుకు ఆవేదన చెందారు.

## కన్యాశుల్కం-కథాద్వయ సమ్మేళనము :

ఈ నాటకంలో మొదట నాటక వైశిష్ట్యాన్ని వివరిస్తూ "నాటక ప్రయోగంతో కథావస్తువు ఇంతగా ప్రతిఫలించటం మరెక్కడా మనం చూడలేం. చితికిపోతున్న నాకానొక సామాజిక వ్యవస్థని సమగ్రంగా చిత్రించారు. ఇందులో వాడిన భాష లోకవృత్తానికి సన్నిహితంగా వుంది" అన్నారు. ఈ నాటకం గురించి వున్న రెండు రకాల విమర్శనల్నీ పేర్కొని కన్యాశుల్కాన్ని ఉత్తమ నాటకంగా అంగీకరించని వారిని— "కన్యాశుల్కం నాటకం కాదనే వారెవరైనా వుంటే వారికి నాటకమంటే ఏమిటో తెలీదని మాత్రం గట్టిగా చెప్పొచ్చు." అని విమర్శించారు. తర్వాత నాటకంలో రెండు కథలున్నాయని పేర్కొని వాటిని వివరించారు.

ద్వితీయాంకంలో కృష్ణరాయపురం అగ్రహారమూ, అగ్నిహోత్రావధాన్లు

---

★ నాటకం తిరగరాసిన 1909 నాటికి ఆయన ప్రపంచ నాటక సాహిత్యాధ్యయనం మరింత విస్తృతమూ, గంభీరమూ అయింది. రెండోది. ఆనాటికి మానవ స్వభావం గురించి ఆయనకు మరింత నిశ్చయమూ, సమగ్రమూ అయిన అవగాహన యేర్పడింది. మూడోది. ఆయన ప్రపంచ దృక్పథంలో స్పష్టమైన మార్పు వచ్చింది. నాల్గోది. వాడుకభాష వుపయోగించడంలో ఆయనకు మరింత యెక్కువ ప్రావీణ్యం అలవడింది. చివరిది. నాగరిక తదితర వర్గాలన్నిట్లో తనకెంతో మెప్పును సంపాదిస్తూ వుండిన తన సొంత బాణీ హాస్యాన్ని మరింత విస్తృతంగా వాడాలని ఆయన భావించారు.

—నార్ల వెంకటేశ్వరరావు

టుల్లూ, అక్కడ— "వొద్దువొద్దంటుంటే యీ ఇంగ్లీషు చదువులో పెట్టావ్" అనే వాక్యంతో ఆరంభించి, ఆరో అంకంలో "యీ గాడిదకొడుకు ఇంగ్లీషు చదువు కొంపముంచింది" అనే వాక్యంతో ముగించటం ఒక పద్ధతిగా చెప్పారు. ఇక రెండో పద్ధతిలో అయితే ప్రథమాంకంతోనే నాటకం ఆరంభమవుతుంది. ఇందులో గిరీశం పాత్రకే ప్రాధాన్యం వుంటుంది. మధురవాణిని ఏదో మిషతో విడిచిపెట్టడం, అగ్నిహోత్రావధాన్లు యింటిలో చేరడం, బుచ్చమ్మను మోసగించటం, లుబ్ధావధాన్లు ఆస్తిని కాజెయ్యటానికి ప్రయత్నించడం, చివరికి పరాభూతుడై "డామిట్ కథ అడ్డం తిరిగింది" అనడంతో ముగుస్తుంది.

పై రెండు పద్ధతుల్లో దేన్ని అనుసరించినా రెండో దానిలోని సన్నివేశాల్ని కొన్నిటిని కలుపుకోవాల్సి వుంటుందని, అంటూ తాను మొదటి పద్ధతిలోనే నాటకాన్ని ప్రదర్శించినట్లు పేర్కొన్నారు. తర్వాత అందులోని పాత్రల వైశిష్ట్యాన్ని వివరించారు. ఈ నాటకంలో గిరీశం, మధురవాణి ప్రధాన పాత్రలనీ, అందులో గిరీశం పాత్రలేకపోయినా ఫరవాలేదని అంటూ, మధురవాణి పాత్ర ఆవశ్యకతనూ, ఔన్నత్యాన్నీ వివరించారు. దేశ కాల ప్రభావం వల్ల ఆమె పడుపువృత్తిలో వున్నా మానవత్వం ఆమెలో తొణికిసలాడుతుందన్నారు. ఈ నాటకం గొప్పతనం తెలియాలంటే నాటకమంతా సమగ్రంగా ప్రదర్శించాలన్నారు. ఇబ్సన్ రాసిన 'పిర్‌జింట్' నాటకాన్ని ప్రయోగించిన 'దిల్‌గుష్' లాంటి ప్రయోక్త కన్యాశుల్కానికి కూడా రాబోడా అని ఆశిస్తూ వ్యాసాన్ని ముగించారు. ఈ వ్యాసం విశ్వవీణలో 1959 డిసెంబరు సంచికలో అచ్చయింది.

## కన్యాశుల్క రచన (పూర్వోత్తర ప్రతుల పరిశీలన)

ఈ వ్యాసంలో కన్యాశుల్కం తొలి మలి ప్రతుల తులనాత్మక పరిశీలన గావించారు. కన్యాశుల్కం తొలి ప్రతి **1897**లో వచ్చింది. అందులో అయిదంకాలూ, ముప్పైరెండు రంగాలూ వున్నాయి. రెండో కూర్పు **1909**లో వచ్చింది. అందులో నాటకం దాదాపు నాలుగింతలు పెరిగింది. అందులో ఏడంకాలూ ముప్పైమూడు రంగాలూ వున్నాయి. ఆ రెండు ప్రతుల్నీ పరిశీలించి, మొదటి ప్రతిలోని కొన్ని ఘట్టాల్ని మార్చి, కొత్త సన్నివేశాల్ని చేర్చి తద్వారా గురజాడ సాధించిన విలక్షణతనీ, ప్రయోజనాన్నీ వ్యాసకర్త సోదాహరణంగా చర్చించారు. కరటకశాస్త్రికీ

---

★ "ఆయన అపహాస్యం చేసింది సంస్కరణకు సంబంధించిన నటనను. మతాన్ని నీచత్వానికీ, వంచనకూ ముసుగుగా వుపయోగించుకునే వాళ్ళను ఆయన యేవగించుకున్నారు. మత సాంఘిక సంస్కరణ పేరుతో ఒక ఐహిక లాభం పొందడానికి ప్రయత్నించే వాళ్ళను ఆయన ద్వేషించారు."

—నార్ల వెంకటేశ్వరరావు

శిష్యుడికీ మధ్య జరిగిన సంభాషణలో రెండు ప్రతుల మధ్యగల తారతమ్యాన్ని గురించి—

"మొదటి కూర్పులో జిజ్ఞాసరేకెత్తించే చమత్కృతి గానీ, ఉత్తర ప్రత్యుత్తరాల్లో ధ్వన్యాత్మకమైన ద్రుత గమనంగానీ, నుడికారాల సొంపుగానీ లేకుండా పేలవంగా నడిచింది." "ఆ సన్నివేశమే మాటకూ మాటకూ సామాజికుల మనస్సులో వుత్కంఠను వృద్ధిపింపజేస్తూ మనోరంజకంగా నడిచి పరిణతమైన దృశ్యకావ్య రచనా విధానంలో వొక కొత్త నడకను రూపొందించింది" అని రెండో కూర్పు గురించి అన్నారు. తరువాత మధురవాణి పాత్ర గురించి—

"తొలి కూర్పులో మధురవాణి హేయమైన నడవడిక కలదిగా వుంటుంది. ఆ పాత్రపై వున్న ఆ భావనని తొలగించడానికి మలి ప్రతిలో ప్రయత్నించారు. ఆమె పడుపువృత్తిలో వున్నా సహజంగా ఉత్తమరాలు అనిపించేట్టుగా మలిప్రతిలో మలచబడింది" అన్నారు. అందుకు పబలకంగా మధురవాణి కరటకశాస్త్రితోనూ, సౌజన్యరావుతోనూ అన్నమాటల్ని ఉదహరించేరు. అలాంటి కూర్పులవల్ల నాటకానికి పుష్టి కలిగిందని చెబుతూనే, అందులోని లోపాల్ని కూడా గుర్తించారు.

నాటకకర్త చమత్కారం, పాత్రపోషణ మొదలైనవాటిని దృష్టిలో వుంచుకొని వస్త్వైక్యాన్ని కాపాడుకోలేకపోయారని విమర్శించారు. అందువల్లే ఈ నాటకాన్ని ఎవరు ప్రయోగించినా తమకు నచ్చిన ఘట్టాల్ని మాత్రమే స్వీకరిస్తున్నారని అన్నారు. చివరిగా "ఏది ఏమైనా తెలుగు సాహిత్యంలో దీన్ని మించిన నాటకం యింకోటిలేదు. యిందులో లోకవృత్తం ప్రతిఫలించింది. అందుకే అది ఆడదగిందే చూడదగిందే" అంటూ వ్యాసం ముగించారు. ఇది గురజాడ శతజయంతి సంచికలో (1962) అచ్చయింది.

## అప్పారావూ ఆండ్ హాప్ట్‌మన్ :

ఈ వ్యాసంలో ఇద్దరు మహాకవుల సాహితీమూర్తిమత్వాన్ని రూపు కట్టించారు. ఒకరు గురజాడ కాగా రెండోవారు జర్మన్ కవి హాప్ట్‌మన్‌గారు. ఇద్దరూ ఒకే సంవత్సరం అంటే 1862 లోనే పుట్టారు. అందువల్లే ఇద్దరికీ ఒకే సంవత్సరం జయంత్యుత్సవాలు జరిగాయి.

గురజాడ వెంకటఅప్పారావుగారు విశాఖజిల్లా రాయవరంలో సెప్టెంబర్ 21న పుట్టగా హాప్ట్‌మన్‌గారు నవంబరు 15న జర్మన్‌లో సిలేసియన్ గ్రామంలో పుట్టారు.

---

★ "ఆకులందున అణగిమణగి
కవితకోకిల పలకవలెనోయ్
పలుకులను విని దేశమందలి
మానవులు మొలకలెత్తవలెనోయి" —గురజాడ

అప్పారావుగారికీ హాప్ట్‌మన్‌గారికీ రచయితలుగా కూడా చాలా దగ్గరి సంబంధాలున్నాయి. అప్పారావుగారు కన్యాశుల్కం రాసేనాటికి మన నాటకరంగం ఎలా ఉండేదో, దాదాపు అదే విధంగా జర్మన్ నాటకరంగం కూడా హాప్ట్‌మన్ రాసిన 'ద వీవర్స్' వెలువడే నాటికి వుంది దాని గురించి అబ్బూరి—

"అంతవరకు సామాన్యుడి గురించి ఏ రచయితా పట్టించుకోలేదు. మొట్టమొదటిగా సామాన్యుల జీవన విధానాన్ని పట్టించుకొని, వారి బాధల పల్లవిని నాటకీకరించినవాడు హాప్ట్‌మన్. వెట్టిచాకిరీకి గురయ్యే నేత కార్మికుల గురించి, శ్రమకి తగిన వేతనం పొందలేకపోతున్నవారి కరుణామయ గాధని నాటకీకరించి ప్రజాదరణ పొందినవాడు హాప్ట్‌మన్. అంతవరకూ ఉన్నతవర్గాలకూ మధ్య తరగతి వారికీ మాత్రమే ఉపయోగపడిన నాటకరంగాన్ని సామాన్యుల దగ్గరికి తీసుకుపోయిన వాతాయన. తన నాటకంలో భాషకూడా గ్రామీణ ప్రాంత వ్యావహారికాన్నే వాడాడు. ఆ నాటకంలో నాయకుడంటూ ఎవరూ లేరు. సామాన్య ప్రజలే నాయకులు" అని హాప్ట్‌మన్ గురించీ అతని నాటకం గురించీ వివరించారు.

ఆ విధంగానే కన్యాశుల్కం వచ్చేవరకూ సామాజిక సమస్యల్ని ఎవరూ పట్టించుకోలేదు. దీనికి కూడా నాయకుడంటూ ఎవరూ లేరు. ఇందులోని పాత్రలు కూడా తెల్లవారితే మనకగపడే సామాన్యమైనవి. సమాజంలో దోచుకోబడుతున్న వాళ్ళూ, వ్యసనపరులూ, మోసగాళ్ళు, లుబ్ధులూ, ప్రేమని పెద్దగా పట్టించుకోని గిరీశం లాంటివాళ్ళూ, మధురవాణి లాంటివాళ్ళు. ఇది కూడా వాడుక భాషలో రాయబడిందే. సామాజిక సమస్యనే యిందులో ప్రధానంగా స్వీకరించారు. ఇదీ కూడా అందరి మన్ననలు పొందింది. అందువల్ల "అప్పారావుగారూ హాప్ట్‌మన్‌గారూ ఆధునిక నాటకరంగంలో మరపురాని మహనీయులు. వారి స్థానం సుస్థిరమైంది." అంటూ వ్యాసాన్ని ముగించారు. ఇద్దరు మహాకవుల రచనల్ని తులనాత్మకంగా పరిశీలించడం బాగుంది.

పై అయిదు వ్యాసాల్లోనూ అబ్బూరి కన్యాశుల్కంలోని గొప్పదనాన్ని వివిధ కోణాల్లోంచి దర్శించి వివరించారు. అంతేకాక మృచ్ఛకటికం, కన్యాశుల్కం, సతీదానశూరం మొదలైనవాటిని విస్తృతంగా ప్రదర్శించాల్సిన అవసరం ఎంతైనా

---

★ యెల్లలోకము వొక్కయిల్లై,
వర్ణ భేదము లెల్లకల్లై
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ
మతములన్నీ మాసిపోవును
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును

—గురజాడ

వుందని ఆయన పదేపదే చెప్పేవారట. చెప్పడమే కాక మృచ్ఛకటికం, కన్యాశుల్కం నాటకాల్ని వారు ఎక్కువగా ప్రదర్శింపజేశారు. 1966లో ఈ రెండు నాటకాలు అబ్బూరివారి దర్శకత్వంలో ఢిల్లీలో ప్రదర్శించారు. కన్యాశుల్కం నాటకాన్ని సుమారు వందసార్లయినా ఆయన ధర్శకత్వంలో ప్రదర్శించారు. లోకవృత్తాన్ని ప్రతిఫలించటమే ఉత్తమ సాహిత్య లక్షణమని నమ్మిన అబ్బూరికి కన్యాశుల్కం అభిమాన గ్రంథం కావడం వింతగాదు. వారు తమ అవసానదశలోకూడా కన్యాశుల్కం గురించి—

"అన్నా ఏమన్నా అను
కన్నియశుల్కము నాటకమ్ము తెలుగువా
రెన్నటికి మరువబోరని
విన్నావా ముళ్ళపూడి వెంకటరమణా !"

అని రాశారు. అది అక్షరాలా నిజం. తెలుగుజాతీ, తెలుగుభాషా ఉన్నంతవరకూ కన్యాశుల్కం సజీవంగా వుంటుంది. అది నూరేళ్ళపండగే కాదు వెయ్యేళ్ళ పండగ కూడా చేయించుకుంటుంది,

---

★ "కన్యాశుల్కపు ఆచారం (డబ్బిచ్చి ఆడపిల్లలను కొనడం) ఆంధ్రదేశంలో మధ్యయుగాల నుండి కనిపిస్తుంది. బీదరికంవల్లా, వయసువస్తే తమ కుమార్తెలకు పెండ్లికాదేమో అనే తలిదండ్రుల భయంవల్లా అది పుట్టింది. కానీ, ఆ దురాచారం ప్రధానంగా బ్రాహ్మణులకూ, కొంతవరకు వైశ్యులకూ పరిమితమైంది. బాల్య వివాహాలూ, వాటివెంట ప్రాప్తించే వైధవ్యమూ, భార్యపోయిన పురుషులకు (విధురులకు) పునర్వివాహం అనుమతింప బడడమూ-యివన్నీ కలిసి బాల్యవధువులకు గిరాకీని పెంచాయి. తమ మరణానంతరం తద్దినాలు చేయడానికీ, తమ ఆస్తిని అనుభవించడానికీ మగ సంతానం అవసరమనే నమ్మకం కూడా ముసలివాళ్ళు వధువులను కొనడానికి ప్రేరణ అయింది. ముసలివాళ్ళు చిన్న పిల్లలను పెండ్లాడడం విధిగా బాల వైధవ్యానికి దారి తీసింది."

—డా. వి. రామకృష్ణ
'ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు' నుండి

# పదాలు మళ్ళీ ఊపందుకున్నాయ్

జనపదాల్ని గుండెనిండా పండించుకొని
సూర్యుడు మళ్ళీ పరుగెత్తుతున్నాడు
అడ్డుకోలేవు తప్పుకో
ఛందస్సుల పద బంధాలతోనో
కృతక భాషా సంక్లిష్టతతోనో
అలసిపోయి

సూర్యుడు సేదతీర్చుకున్నంత మాత్రాన
మళ్ళీ ప్రభంజనమై పరుగెత్తకుండావుంటాడా ?
ప్రజల జీవితాల్ని స్పృశించకుండా
ఆలోచనల్ని పదునెక్కించి
పదమై ప్రవహించగలడా?
జనం నిట్టూర్పుల సమూహం సూర్యుడు
జనం డిమాండ్ల డయనమేట్ సూర్యుడు
చారిత్రక అవసరాల్ని గుర్తించిన
ముందుచూపున్న కవి సూర్యుడు
పూల తివాచీలమీద నడచి
శాలువాలు కప్పించుకున్న బూతుకవి!
కాలం చెల్లిపోయింది

అడ్డుకోలేవు తప్పుకో
గిడుగుజాడ గురజాడ
వినీలాకాశంలో అరుణతారయ్యాడని
"అడుగుజాడ గురజాడది" అన్నవాడు గుర్తించాడు
ఆ వెలుగు జాడల్లో
పదాలు మళ్ళీ ఊపందుకున్నాయ్.
అడ్డుకోలేవు తప్పుకో

అల

---

ఆగస్టు 92 సంచిక 'కన్యాశుల్కం' ప్రత్యేక సంచిక కావడం వల్ల, సాధారణ శీర్షికలు ప్రచురించలేకపోతున్నాం. సెప్టెంబరు 92 సంచిక నుంచి శీర్షికలు ఎప్పటిలాగానే ప్రచురిస్తాము. సం॥

# గురజాడ నాటికాలు

—డా॥ యం. ఎ. నరసింహమూర్తి

ఆనంద గజపతి తెలుగు సాహిత్య చరిత్రలో ఒక మహోజ్జ్వల శకానికి నాంది పలికాడని గురజాడ ప్రశంసించేడు. ఇది కేవలం పొగడ్తేనా? కాకపోతే ఆ మహోజ్జ్వల శకమేది? అది గురజాడ శకం అనడానికి ఎవరూ వెనకాడరు. గురజాడకు ముందు అంతా కవిత్వానిదే సామ్రాజ్యం. ఇతర ప్రక్రియలేవీ అప్పటికి తెలుగులో బతికి బట్టకట్టలేదు. ఆ పద్య శకాన్ని, దాని ననుసరించిన ప్రధాన లక్షణాలను విధ్వంసం చేయడం లక్ష్యంగా గురజాడ ఒక నవ్యశకానికి నాందీవాచకం పలికేడు. తెలుగువాడి మేధస్సును క్రుంగదీసిన పాతశకానికి భరతవాక్యమూ పలికేడు గురజాడ ప్రథమంగా నాటక రచయిత. తర్వాత కథకుడు. తర్వాత కవి.

సమకాలీన సమాజంకోసం రాయడం గొప్ప రచయితల మార్గమని గురజాడ తలంపు. అందుకే అనంతమైన గాథలలో నిండిన తన కాలాన్ని దర్శించి రాస్తానని రాజాసాహెబుకు లేఖ రాసేడు. సమాజంలో నిస్సహాయ స్థితిలో ఉన్న స్త్రీజాతి ఉద్ధరణ కోసం, వాడుక భాషలో రాయాలని కంకణం కట్టుకున్నాడు. కన్యాశుల్కం (189 -1909), కొండు భొట్టీయం (1906), బిల్హణీయం (1910-11) అతని నాటకాలు. ఇందులో కన్యాశుల్కం సంపూర్ణ నాటకం. మిగిలిన రెండూ అసంపూర్ణ నాటకాలు. కొందరి దృష్టిలో కన్యాశుల్కం కూడా అసంపూర్ణ నాటకమే. కాని గురజాడ 1892 నుండి 1909 వరకు సుదీర్ఘకాలం మథనపడి ఆ నాటకంలో ఒక క్లిష్టమైన సంవిధానాన్ని సాధించి ఆ నాటకాన్ని పూర్తి చేశాడు. తెలుగులో ఒక రచయిత ఒక నాటకాన్ని గూర్చి ఇంతకాలం ఆలోచించి ఎన్నో మార్పులను చేసి రెండవసారి సమగ్రమైన కూర్పును ప్రకటించడం అరుదైన విషయం. దీనిని బట్టి కన్యాశుల్కం నాటకాన్ని గురజాడ ఎంతటి చిత్తశుద్ధితో రాసాడో తెలుస్తుంది. అందుకే నూరేళ్ళుగా కన్యాశుల్కం ఒక చర్చావేదికగా వుంది.

ఆడపిల్లలను అమ్ముకోవడం. వేశ్యాసమస్య, విధవా వివాహం అనే మూడు ఇతివృత్తాలను ముప్పిరిగా బిగించి గురజాడ కన్యాశుల్కం కథను కూర్చేడు. కొండు భొట్టీయంలో కూడా వేశ్యాసమస్య, విధవావివాహం ఇతివృత్తాలుగా కనిపిస్తాయి. ఈ రెండు నాటకాలలోను ప్రాచీన సంప్రదాయాన్ని గాని, ఆధునిక ఉదారవాదాన్నిగాని అంగీకరించని శిధిల బ్రాహ్మణ కుటుంబాల అజ్ఞానాన్ని, అయోగ్యతను ప్రదర్శించ

---

★ ఏనాడైతే బౌద్ధమతం భారతదేశం నుంచి తుడిచిపెట్టబడిందో, ఆనాడే మత విషయాల్లో భారతదేశం ఆత్మహత్యను కావించుకుంది.

— గురజాడ.

డంతో కథకు కండబట్టించేడు. అసహాయులైన స్త్రీలు సమాజంలోని వివిధ అంతేరు వులలో ఎలా దోపిడికి గురవుతున్నారో తనకు సన్నిహితంగా ఉండే వస్తువు ద్వారా ఎత్తి చూపించేడు. సంఘంలోని కుళ్ళంతా ఒక ద్రావిడ బ్రాహ్మణ కుటుంబాలలోనే వున్నదని చెప్పడం గురజాడ అభిమతంకాదు. ఆ కుటుంబాలలోని స్త్రీల సమస్య ఎత్తి చూపడం ద్వారా సమాజంలోని మిగిలిన వర్గాల స్త్రీల సమస్యలను కూడా పరిశీలించండని చెప్పినట్లయింది. కన్యాశుల్కంలోని బైరాగి మఠం సీనులోను, కోర్టు వ్యవహారాలను-పోలీసు వ్యవస్థను చిత్రించడంలోను సమాజమంతటా కుళ్ళు ఎలా పేరుకుపోయిందో ఆయన వెల్లడించేడు.

కొండు భొట్టీయాన్ని పేరే నాటకంగా రాయదలచుకొన్నప్పుడు గురజాడ లాంటి నాటక కర్త ఇంకొక సమస్యను తీసుకుని వుండవలసింది. ఇందులో విధవా వివాహం జరిపించి చూడాలనుకున్నాడేమో। 'నేటి జీవితం పుష్కలమైన, అనంతమైన గాథలతో నిండివుంది' అన్న గురజాడకు ఇంకొక ఇతివృత్తం లేదా ఇంకొక దృష్టికోణం కరువయిందా? కారణంతెలియదు. కొండుభొట్లు పాత్ర కన్యాశుల్కంలో పేకాట సీను దగ్గర, మాయగుంట పెళ్ళి సందట్లో కనిపిస్తుంది. అక్కాబత్తుణ్ణి కూడా అగ్నిహోత్రావధాన్లు ఒకసారి స్మరిస్తాడు. ఇంగ్లీషు చదువు, సంస్కృతం చదువుల తతంగం కూడా కన్యాశుల్కంలోను, కొండుభొట్టీయంలోను ఒక్క తీరుగానే చిత్రింపబడింది. 'ఏనుగులు దొబ్బేసాయండోయ్' లాంటి సంభాషణల ద్వారా పాత విశ్వాసాల స్థానాన్ని క్రమంగా కొత్త నిజాలు ఆక్రమించుకుంటూన్న సంగతి కూడా రెండింట్లో ఒక్కలాగే వుంది. మధుర వాణికి, మంజువాణికి పేర్లలో సామ్యమున్నట్లే కొన్ని అవస్థలలో కూడా కొట్టొచ్చినట్లు సామ్యం కనిపిస్తుంది. 'ఎవరో కాలుజారిన సత్పురుషుడి సంతానమైవుంటావు' అని సౌజన్యారావు మధుర వాణితో అంటాడు. కొండుభొట్టీయంలో వేశ్యాకులంలో పుట్టని మంజువాణిని తాను ఏ విధంగా వేశ్యను చేశాడో కొండుభొట్లు స్వయంగా చెప్తాడు. ఈ వేశ్యలిద్దరికీ వృత్తిపట్ల ఏవగింపే. కన్యాశుల్కంలోని గిరీశం-రామప్పపంతుళ్ళ లక్షణాలు కొండుభొట్లు, రాజారాంలలో స్ఫుటంగా కనిపిస్తాయి. కన్యాశుల్కంలోని సౌజన్యారావు పంతుల మాటలు కొండుభొట్టీయంలోని ఒక ప్రతిలో గిరీశం మాటలను, ఇంకొక ప్రతిలోని శంకరశాస్త్రి మాటలను పోలి వుంటాయి. కన్యాశుల్కంలోని

---

★ మానవుడు, పరిస్థితులకు కేవలం బానిస అని, తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్సహాయుడని అనుకోవడం పొరపాటు. శారీరక మానసిక ధర్మమును నిర్ణయించడంలో అనువంశిక పరిసరాల ప్రభావము అధికంగా ఉన్నా, వాటిని మానవుని మేధాశక్తి సరిదిద్ద గలుగుతుంది. అతనికి కావలసినది సంకల్ప బలం.

— గురజాడ

మీనాక్షి, కొండుభొట్టీయంలోని. పార్వతి ఇంచుమించుగా ఒకలాగే వుంటారు. ఇంగ్లీషు విషయంలో అగ్నిహోత్రావధాన్లు-కొండుభొట్లు ఒక్కలాగే మాట్లాడతారు. కన్యాశుల్కంలోని పోలిశెట్టి కొండుభొట్టీయంలోని రంగన్న శెట్టి ఒకలాంటివారే. కన్యాశుల్కంలో గిరీశం బుచ్చమ్మను లేవదీసుకుపోయే పథకంలాగే కొండు భొట్టీయంలో వధూవరులను ఊరు దాటించే ఆలోచనలో కనిపిస్తుంది.

కొండుభొట్టీయంలో 'దీని తస్సాగొయ్యా। బంగారపు సరుకు మళ్ళీ తెమ్మంటుంది కాబోలు. తొందర పనివుంది, యిప్పుడే మళ్ళ వస్తాను! అంటూ ఉడాయించే భీమారావు పంతులు అచ్చం రామప్పంతులులాగే కనిపిస్తాడు. కొండు భొట్లుతో మంజువాణి 'మీ పంతులిగారి పెధవ అప్పగారిసాటి ఏ మాత్రము వస్తుందో' అని చెప్పుతుంది. కన్యాశుల్కంలో మధురవాణి గిరీశాన్ని పూటకూళ్ళమ్మ విష యంలో ఇలాగే ప్రవర్తిస్తుంది. కొండుభొట్లు త్రివిక్రమరావుతో 'తమ నాయనగార్ని బాగా యెరుగుదును. నా యందు వారికి చాలాదయ, అంటాడు. గిరీశం బంట్రోతుతో 'నీ తండ్రి యంతటి పెద్దమనిషి' అనడం అచ్చం ఇలాంటిదే. 'డబ్బు పాపిష్ఠిది' అటు రత్నాంగి ఇటు మధురవాణి కూడా పలుకుతారు. కొండుభొట్టీయంలో సెట్టి 'గవురుమెంటు బావుటా యెగురుతుండగా యెవడు పిలకట్టుకునేవాడు' అంటే కన్యా శుల్కంలో పోలిశెట్టి 'తెల్లోడి బావుటా ఎగురుతుండగా నీ జులువేఁటి' అంటాడు. 'సానివాళ్ళకు కర్ణపిశాచం వుంటుందికాబోలు' అన్న సంభాషణ రెండు నాటకాల్లోనూ వుంది. 'నేనే చిన్నతనంలో యింగిలీషు చదివివుంటే జడ్జి యేదుట పెళపెళలాడించు దును' అన్న రామప్ప పంతులు మాట కొండుభొట్లు నోట్లోంచి కూడా వినిపిస్తుంది.

ఇతివృత్తం-కథాగమనం-పాత్ర స్వభావం - సంభాషణలు-ప్రయోజనం ఇలా అన్నీ ఒక తీరుగానే వున్నప్పుడు వీటిని వేరువేరు నాటకాలుగా ఎలాపరిగణించగలం ఒకవేళ అలాచూస్తే గురజాడను ఒక గొప్ప నాటకకర్త అని ఎలా అంగీకరించ గలం? అందుకే గురజాడ కొండుభొట్టీయాన్ని పూర్తిచేయకుండా వదిలిపెట్టి తనను తాను కాపాడుకున్నాడు. ఆ నాటకంలో ఏ సందర్భంలోను, ఏ ఒక్క విషయం లోను ఒక ఉన్నతి లేదు। 1906లో కొండుభొట్టీయాన్ని రాసిన గురజాడ తిరిగి 1909లో కన్యాశుల్కం రెండో ప్రతిని ప్రకటించాడంటే అంతటితో కొండుభొట్టీ

---

★ "నాకు కావలసింది నా దేశభాష. సజీవమైన తెలుగుభాష. ప్రాచ్యప్రపంచపు యిటాలియన్‌గా పేరుపొందిన భాష. ఈ భాషలో మన కష్టసుఖాలు వెళ్ళ బోసుకోడానికి మనం యెవళ్ళమూ సిగ్గుపడం. కానీ దీనిలో బాగా రాయడానికి మనలో కొందరు సిగ్గుపడతారు. దేశభాషలో రచించే సాహిత్యం రైతులకు దగ్గరగా ఉంటుంది. భారతదేశంలోని ఆంగ్లేయులకు దగ్గిరగా ఉంటుంది. దానికుండే అవకాశాలు అపారమైనవి."

— గురజాడ

యాన్ని వదలిపెట్టాడని, కనీసం తనకు దాను మలచిపోయాడని అనుకోవాలి. మనం కూడా అలా చేయడమే మంచిది.

ఇక బిల్హణీయం 1910 లో ప్రథమాంకం, 1911 లో ద్వితీయాంకంగా ప్రచురితమయింది. కన్యాశుల్కం రాసేటప్పుడు గురజాడ సమకాలీన జీవనంలోని అనంత వైవిధ్యాన్ని చూడలేని తెలుగు రచయితలను దుయ్యబట్టాడు. ముత్యాల సరాలు రాస్తూన్నప్పుడు 'ఇతిహాసాన్వత కోష్ఠము లతికామోద్రేక రచన లందరి నృపతుల్' అని పూర్వపు కృతులను, కృతికర్తలను, కృతిభర్తలను దుయ్యబట్టేడు. ప్రాచీన సాహిత్యంలోని 'అతికామోద్రేక రచన'లలో బిల్హణీయం ఒకటి. ఆ వస్తువును తన నాటకానికి ఇతివృత్తంగా గురజాడ ఎందుకు స్వీకరించవలసి వచ్చిందో అర్థంకాదు. 'తాటిచెట్టు ఎందుకెక్కావురా? అంటే దూడ గడ్డికి' అన్నట్టు ఉదాత్త శృంగారాన్ని కూడా వాడుకభాషలో రచించి రక్తికట్టించ వచ్చునని నిరూపించడానికి ఈ కథను నాటకంగా తీర్చిదిద్దడానికి సిద్ధపడ్డాడట! ఒకరిని తృప్తిపరచడం నా ఉద్దేశం కాదని బోరవిరుచుకుని ప్రకటించిన గురజాడకు పండితులను తృప్తిపరచాలని, సమాధానపరచాలని ఎలా అనిపించింది? అలా అనిపిస్తే- సమకాలీన జీవితంలో ఉదాత్త శృంగారం లేదా? దానికోసం కాశ్మీర దేశానికి చెందిన 12వ శతాబ్దపు బిల్హణ కవి ప్రేమగాథను ఎన్నుకోవలసి వచ్చిందా? నాయకుడైన బిల్హణుడు తనను ప్రేమించిన రాజకుమార్తెను తాను స్వీకరించకుండా తన శిష్యుడైన రణసింహుడికి అప్పగించి సోమనాథ్‌లో ఓడనెక్కి వెళ్ళిపోవడం ఏవిధంగా (శాస్త్రీయంగానైనా/లౌకికంగానైనా) ఉదాత్త శృంగారం అయిందో తెలియడంలేదు. 'డామన్‌పితియసు,' 'కన్యక'లాంటి పాత కథలకు సాటిలేని నవ్యతను కూర్చిన గురజాడ ఈ నాటకంలో ఆ విధమైన ప్రయత్నమే చేయకపోవడం ఆశ్చర్యకరమైన విషయం.

బిల్హణీయంలోని కథ, కాలము, స్థలము, పాత్రలు- ఏవీ తెలుగువారికి సన్నిహితమైనవి కావు. ఇంకా చెప్పాలంటే ఎంతోమందికి పరిచితమైనవి కూడా కావు. వాడుకభాష గొప్పతనాన్ని చూపదలచిన గురజాడ ఈ కథను కన్యాశుల్కం భాషలో రాస్తే సరిపోతుందనుకోవడం ఇంకా విడ్డూరంగా వుంది. 'డంగు' (వడవడ వాగుతే ఈ రాజులు డంగైపోతారు) 'అష' (బిల్హణుడిచేత విద్య చెప్పిస్తారష) 'యిసుంటా' (యిసుంటా రండి)- వంటి పదాలతో కూడిన మాండలికం ఈ నాటకం అంతటా కనిపిస్తుంది. 'డంగు' అనే మాటకు- 'Dumb' వుచ్చారణలో 'డమ్' ఈ మాటకు మూలమేమో;' అని కె.వి.ఆర్. గారు కన్యాశుల్కం టీకా టిప్పణిలో అన్నారు.

---

★ "పాటకపు జనుల స్థితిగతులను చక్కబరచి, వారిని అభివృద్ధికి తేవడం ప్రజాస్వామిక లక్షణం. ఇక ఇట్టి స్థితిలో ఉండుట తగదని ప్రజలకు బోధించి, ఉన్నత స్థితికి ఎట్లు రాగలరో వారికి నచ్చచెప్పవలెను."

— గురజాడ.

కాని 'డంగు' అనే తెలుగు మాటకు 'శుభ్రముగా నలిగినది' 'దంచబడినది' అనే అర్థం వుంది. 'డంగుబ్రాలు' అంటే 'తెల్లగా దంచిన బియ్యం' అని అర్థం. ఈ గిరీశం మాటకు పూనాలోని ప్రొఫెసర్లంతా తెల్లముఖాలు వేసేరని అర్థం. ఈ అర్థం ఇప్పటికే శ్రీకాకుళం జిల్లాలో వాడుకలో వుంది. ఇలా ఒక ప్రాంతీయమైన వాడుకలోని పదాలను, వాక్యవిన్యాసాలను, స్వరాలను, ఊనికలను బిల్హణీయంలో చొరగొట్టడం పద్ధతికాదు. ఎందుచేతనంటే ఆ కథ-పాత్రలు ఆంధ్రదేశంలోని ఒక ప్రాంతానికి చెందినవి కావు. అందుచేత అటువంటి రచనలు ఆధునిక ప్రామాణిక భాషలో వుండాలి. గురజాడ కాలానికి ఆధునిక ప్రామాణిక భాష రూపొందలేదనుకుందాం. అలాంటప్పుడు ప్రత్యామ్నాయం ఆలోచించాలి గాని అక్కడ ప్రాంతీయ మాండలికం శోభించదు.

బిల్హణీయంలో నానామంత్రి నడిపిన కుట్ర అంతా అడుగడుగునా కన్యాశుల్కంలోని రామప్పంతులు చర్యలను జ్ఞాపకం చేస్తుంది. 'మీ నాయనగారికీ, మా నాయనగారికీ ఉండే స్నేహమైనా ఆలోచించుకోనా' అని నానామంత్రి అనే సరికి మనకు వెంటనే గిరీశం, కొండిభొట్లు కనిపిస్తారు. అన్ని నాటకాలలోనూ ఒకటే తస్సావా? ఇంతకంటె నిపుణమైన సంభాషణ ఇంకొకదానిని కూర్చడం సాధ్యంకాదా? బిల్హణీయంలో కూడా ఒక వేశ్య ప్రస్తావన కనిపిస్తుంది. కాని దానికి సరియైన నిర్వహణ కనబడదు. అసలు బిల్హణీయంలో నాటకానికి అవసరమైన త్రివిధైక్యాలు, గమనం కొరవడ్డాయనిపిస్తుంది.

జడ్జిమెంటు చెప్పకపోవడం, నాయికలేని నాటకం రాయడం అనే అభిప్రాయాలు కూడా గురజాడకు ఇష్టం కాబోలు. కన్యాశుల్కంలో సుబ్బి రంగం మీదకు రాదు. బిల్హణీయంలో ఉన్నమేరకు యామినీపూర్ణతిలక కనబడదు. కొండుభొట్టీయంలో నాయిక పార్వతి అని అనుకుంటే ఆమె ఒక రంగంలో, వాళ్ళ పరిభాషలో చెప్పాలంటే 'దండుముండ'లా కనిపిస్తుంది. నాయిక లేకుండా రాయడం ఒక టెక్నిక్‌గా ఎంచుకున్న గురజాడ ఈమెను నాయికగా ఊహించలేదో! లేక ఇంకా మార్పు చేయదలచుకున్నాడో తెలియదు. శృంగార గాథలో కూడా నాయికను ప్రవేశపెట్టకుండా శుష్కసంభాషణలతో రంగాలకు రంగాలు నడపడం నాటకశిల్పమనిపించుకోదు. అందుచే నాయికను ప్రవేశపెట్టే ఆలోచన కూడా చేసేడు. కన్యా

---

★ "అప్పారావుగారిని మెచ్చుకోనివారు అభినవాంధ్ర కవులలో నేనెరిగినంత మట్టుకు ఎవరూ లేరు. నేడు కావ్యములు వ్రాసే యువకులందరూ ఆయనను మార్గదర్శిగా అంగీకరించినవారే. కాని ఏ కారణము చేతనో వారు భాషా విషయమునైతేనేమి, రచన విషయమునైతేనేమి అప్పారావుగారికి భిన్నముగానే నడుస్తున్నారని అనకతప్పదు."

— చింతా దీక్షితులు

శుల్కం నాటకంలో ఎంతో సహజమైన హాస్యాన్ని సృష్టించి ఆ నాటకాన్ని నూరేళ్ళకూ నిత్యనూతనంగా కనిపించేలా రచించిన గురజాడ 'బిల్హణీయం'లో ఒక సాంప్రదాయిక విదూషక పాత్రను సృష్టించే ఆలోచనకు ఎలా లోనయ్యాడన్నది ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించే విషయం.

మృచ్ఛకటికం నాటకాన్ని కొల్లగొట్టి కన్యాశుల్కాన్ని సృష్టించిన గురజాడ మధురవాణి కంటితో ఉత్తర కథనంతటినీ నడిపించేడు. అంతటితో సంతృప్తిపడక మంజువాణి నగలతో కొండు భొట్టీయాన్ని, బిల్హణుడు నారాయణభట్టు కిచ్చిన రుద్రాక్షతావళంతో బిల్హణీయాన్ని నడిపించాలని ప్రయత్నించడం నిపుణుడైన నాటకకర్త చేయదగిన పనికాదు.

కన్యాశుల్కంలో ఎన్నో విషయాలతోపాటు మతం విషయం కూడా చర్చిద్దామని బైరాగి మఠం సీనులో గురజాడ ఆ ప్రయత్నం చేసేడు. కొండు భొట్టీయంలో రాజారాం-గిరీశం సంభాషణల్లో చాలావరకు మతవిషయాన్ని చర్చలోకి లాక్కొచ్చేడు. బిల్హణీయంలో బిల్హణ-రణసింహుల గోష్ఠిలో తిరిగి మతవిషయం తలెత్తింది. కాని ఈ మూడు ప్రయత్నాల్లో నాటకశిల్పం దెబ్బతిందని భావించి 'మీ పేరేమిటి?' కథలో అఖండ విజయాన్ని సాధించేడు. కవితల్లో ఇంకా స్వేచ్ఛగా కదను తొక్కాడు.

ఈ విధంగా కొండు భొట్టీయం-బిల్హణీయాలను ప్రారంభించిన గురజాడకు తన అభిరుచికి తగని ఆటంకాలు ఎన్నో ఎదురయ్యాయి. అందుకే ఆ నాటకాలను పూర్తిచెయ్యలేదు. అసలు గురజాడకు కల్పనాశక్తి తక్కువ. అతని నాటకాలన్నిటికీ సామగ్రి ఒకటే అనవలసివస్తుంది. ఎన్నో ఉన్నాయని నమ్మించ ప్రయత్నిస్తే గిడుగు ఇచ్చిన 'Creative genius' అన్న ప్రశంస పొల్లుపోతుంది. కన్యాశుల్కంతో ఆయన సరుకంతా ఖర్చైపోయింది. వాడుకభాష-సంఘ సంస్కారం ఆయన సామాగ్రి - సంచికట్టు. వేశ్యలపట్ల, విధవల పట్ల అతని కారుణ్యం అపారమైనది; అలవిగానిది. అవినీతిపట్ల ఆతని జాలికి అంతులేదు. అతడు ఎంత ఆలోచించినా ఆ విషయాన్ని గూర్చి మాత్రమే ఆలోచించగలిగాడు. వాటి విశ్వరూపాన్ని కన్యాశుల్కంలో చూపించేడు. ఇక ఎంత రాసినా దానినే ఇంకొక రూపంలో రాయడం జరుగుతుంది. అందుకే మిగిలిన నాటకాలు అసంపూర్ణంగా మిగిలిపోయాయి.

★ రచయిత తాను రూపొందించే పాత్రలన్నింటిని జీవితంనుంచి పరిగ్రహించడు. పరిగ్రహించిన పాత్రలను అచ్చంగా పరిగ్రహించినట్లుగానే చిత్రించడు. వెనకటి కవులు నిర్మించిన భావనాత్మకమూర్తుల లక్షణాలు, అతనికి తెలియకుండానే, అతనిలో ద్యోతకమౌతాయి.

— గురజాడ

# కన్యాశుల్కంలో స్త్రీ పాత్ర చిత్రణ

— జి. భవాని

కన్యాశుల్కం స్త్రీని బానిసగా మార్చే అనేకానేక ప్రక్రియలలో ఒక ప్రక్రియ, అనేకానేక దశలలో ఒక దశ. అది ఎందరో స్త్రీలను సాంఘిక అన్యాయానికి, అమానుషత్వానికి బలి చేసిన సాంఘిక దురాచారం.

సతీ సహగమనం, దేవదాసీత్వం, బాల్య వివాహం, వరకట్నం మొదలగు సాంఘిక దురాచారాల కోవకు చెందినదే కన్యాశుల్కం, ఈ దురాచారాలన్నీ పురుషాధిక్య సమాజానికి స్త్రీని ఎరవేసినవే. ఈ దురాచారాలన్నీ స్త్రీకి వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడినవే.

"మహిళా లోకంలోని ఎంతో నిస్సహాయులైన ఒక విభాగంలోని వారిని, సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భర దాస్యం నుండి కాపాడడానికి" తన వంతు కృషిగా చేసిన ప్రయత్నమే గురజాడ 'కన్యాశుల్కం'.

'కన్యాశుల్కం' నాటకం ప్రధానంగా ఈ దురాచారానికి ఎందరు స్త్రీలు ఏవిధంగా బలయ్యేరో, ఆనాటి మన సమాజంలో ఎందరు బాలికలు కాటికి కాళ్ళు చాచిన ముసలాళ్ళను కూడా వివాహమాడ వలసివచ్చి ఎలా బాల వితంతువులుగా మిగిలేవారో, వరుడిచ్చే 'శుల్కం' మీద మమకారంతో కన్న తండ్రులే కసాయి వాళ్ళుగా మారి, పాల బుగ్గల చిన్నారులకి కూడా వివాహం పేరుతో గొంతుకి వురి బిగించి వారి జీవితాలని ఎలా సర్వనాశనం చేసేవారో మనకి కళ్ళకి కట్టినట్లు చూపుతుంది.

ఈ నాటకంలో గురజాడ వివిధ ప్రవృత్తుల స్త్రీ పాత్రలని సృష్టించినా చదివేటప్పుడు, చదివేక మనకి తెలిసేది, గుర్తుండేది ఆ పాత్రల ప్రవృత్తులు కాదు. ఆనాటి సమాజంలో స్త్రీకి జరిగిన అన్యాయం, ఆనాటి ఘోర దురాచారం ప్రతి పాత్ర ఏదో ఒక సాంఘిక దురాచారానికో, అనేకానేక సాంఘిక దురాచారాలకో, దుష్ట శక్తులకో బలయినవారే. వారు వంచితలు. వారు నిస్సహాయులు. వారు అణచి వేయ బడ్డవారు. వారు పురుషాధిక్యతని మౌనంగా, కిమ్మనకుండా సహించినవారు, భరించినవారు.

కన్యాశుల్కంలో ప్రధాన స్త్రీ పాత్రలు మధురవాణి, బుచ్చమ్మ, మధురవాణి

---

★ మానవ జీవితంలో కాని, లేదా సారస్వత కల్పనలోకాని, ఎందులోనైనా స్త్రీ పురుష శారీరకానుభవాలూ, ఆనందాలూ, వాటి వర్ణనలూ తత్తదుచిత స్థానంలో ఉండాలి.

— గురజాడ.

వేశ్య. బుచ్చమ్మ బాల వితంతువు. బుచ్చమ్మ తల్లి వెంకమ్మ భర్త అధికారానికి తలవంచిన స్త్రీ. అతని డబ్బు కాపీనాన్ని, దుష్ట పన్నాగాలని ఎదిరించలేని స్త్రీ. బుచ్చమ్మ చెల్లి సుబ్బమ్మ బుచ్చమ్మలాగే 'కన్యాశుల్కం' దురాచారానికి బలి అవ బోయిన మరో బాలిక. ఈ నాటకంలో మరి రెండు పాత్రలు మీనాక్షి, పూట కూళ్ళమ్మ బాల వితంతువులు. వీరంతా సంఘంలో దురాచారాలకి, దుష్టశక్తులకి బలయినవారే.

మధురవాణి వేశ్య ఎందుకు కావలసివచ్చిందంటే, ఆనాటి సమాజంలో వేశ్య కూతురికి వేశ్యగా కాక మరే విధంగా బ్రతికే అవకాశం లేదు. కొన్ని కుటుంబాలు దేవదాసీ కుటుంబాలుగా, కొన్ని స్థలాలు వేశ్యావాటికలుగా సమాజంచే మార్చబడినపుడు ఆ కుటుంబ స్త్రీలు దేవదాసీలుగా, వేశ్యావాటికలలో స్త్రీలు వేశ్యా వృత్తినే జీవనోపాధిగా అనుసరించవలసిన దైన్యస్థితి ఆనాటి సమాజంలో వేశ్యలది.

తనని తాను రకరకాల మగవాళ్ళకి, విభిన్న వయస్సుల వాళ్ళకి అమ్ముకుంటే తప్ప, వాళ్ళనే నమ్ముకుంటే తప్ప బతుకు గడవని దైన్యత మధురవాణిది. అందం. తెలివితేటలు, సమయస్ఫూర్తి, విద్య, మాటకారితనం-అన్నీ ఉన్నా సాంఘికంగా చెడిన ఆడది. ఆర్థిక భద్రత లేని, ఏ సాంఘిక గౌరవానికి నోచుకోని ఓ పతిత.

ఒక సందర్భంలో మధురవాణి రామప్పంతులు అనబడే 'పెద్ద మనిషి'తో నేను డబ్బిక్కడ దాచుకుంటే మా తల్లక్కడ కాలక్షేపం చెయ్యడవెలాగ" అంటుంది. దీనిని బట్టి ఆమె తనని తాను పోషించు కోవడానికి, తన తల్లిని పోషించడానికి, తన వృత్తిమీదే ఆధారపడిందని తెలుస్తుంది. అయితే ఆమె వృత్తిచేత చెయ్యవలసిన చోట్ల ద్రవ్యాకర్షణ చేస్తుంది. కాని "మధురవాణికి దయాదాక్షిణ్యాలు సున్న అని తలచారా? మీ తోడబుట్టుకి ప్రమాదం వొచ్చినపుడు నేను డబ్బుకి ఆశిస్తానా?" అని కరటక శాస్త్రికి తన చెల్లెలి కూతురు వివాహం అరవయేళ్ళ పైబడ్డ లుబ్ధావధానులతో జరగకుండా ఆపడంలో సాయం చేస్తుంది. చివరకి లుబ్ధావధానులుకి చేయని నేరానికి శిక్ష పడకుండా కాపాడడానికి వకీలు, 'యాంటినాచి' అయిన సౌజన్యారావు పంతులుని మారు వేషంలో కలిసి జరిగిన విషయం తెలియచేసి లుబ్ధావధానులుకి శిక్ష పడకుండా, బుచ్చమ్మ గిరీశం వలలో చిక్కకుండా కాపాడుతుంది. లుబ్ధావధానులుని కాపాడటానికి తన ఫీజుగా ఒక చిన్న ముద్దు ఇవ్వాలని చిలిపితనంతో షరతు పెట్టినా చివరకి సౌజన్యరావు పంతులు వ్రతభంగం కానీయ కూడదని "చెడని వారిని చెడగొట్టవద్దని మా అమ్మ చెప్పింది" అని అతనిని వారిస్తుంది.

కరటక శాస్త్రి ఆమె విద్యా సౌందర్యాల పెంపుని ప్రశంసిస్తే "అంతకన్నా కాపు మనిషినై పుట్టి మొగుడి పొలంలో వంగ మొక్కలకూ, మిరప మొక్కలకూ

---

★ వివాహ సంస్థ పురోగతికి దోహదం చేసినదన్నమాట నిజమే: అయితే ఆ బంధాన్ని తెంచుకోరాదనే నియమం చెప్పనలవికాని కన్నీటి గాథలకు కారణం.
— గురజాడ.

ద్రోహదం చేస్తే, యావజ్జీవనం కాపాడే తన వాళ్ళన్న వారు వుందురేమో" అని తన వృత్తి తనకి కల్పించలేని భద్రతని గుర్తు చేస్తుంది.

ఆనాటి, ఈనాటి, సమాజంలో పర స్త్రీల పొందుకోరే మగాడు, పర స్త్రీలతో 'అక్రమ సంబంధాలు పెట్టుకునే పురుషుడు సరసులు, రసికుడు. సమాజంలో అతని పరువుప్రతిష్ఠలకు ఏ ప్రమాదం లేదు. ఆనాటి సమాజంలో వేశ్యని 'ఉంచుకోవడం' ఓ స్టేటస్ సింబల్. అదే ఓ స్త్రీ తన జీవనోపాధి కోసం తన శరీరాన్ని అమ్ముకున్నా నలుగురితో మాట్లాడినా, చనువుగా ఉన్నా ఆమె పతిత, చెడినది, సమాజంలో చీడ పురుగు. ఆమె చీడ పురుగయితే, ఆమెను చీడ పురుగుగా తయారు చేసినవారు, ఆమె జీవితంతో ఆటలాడుకునే పురుష పుంగవులు సమాజానికి ఏమవుతారు ? పెళ్ళయి భార్య ఉన్నా, పిల్లలున్నా, పర స్త్రీల చుట్టూ తిరగడం, వాళ్ళని తమ సుఖాల కోసం వాడుకోవడం పురుషుల పెడ బుద్ధి కాకపోతే, పెళ్ళికాక, తమకంటూ ఓ తోడు లేక, ఆర్థిక భద్రతగాని, సామాజిక భద్రతగాని లేని స్త్రీలు తమ వృత్తిగా, అవసరంగా ఆ రసికులని ఆకర్షిస్తే, అదే జీవనోపాదిగా కొనసాగిస్తే అది 'తప్పుడు పని' ఎలా అవుతుంది ?

సమాజంలో ఈ వర్గంవారి జీవితాలను గూర్చి, వారి దౌర్భాగ్యం గురించి ఆలోచింపచేస్తూ, సౌజన్యారావు పంతులు వంటి సహృదయులు కూడా వేశ్యలను పెళ్ళి చేసుకోవడానికి గాని, తమ జీవితభాగస్వాములుగా చేసుకోవడానికి గాని, సమాజంలో సముచిత స్థానాన్ని కల్పించడానికి గాని ఎలా వెనకాడతారో మధురవాణి, సౌజన్యారావు పంతులు మధ్య జరిగిన సంభాషణని బట్టి చూపిస్తారు గురజాడ. అవసరంలో కరటక శాస్త్రిని ఆదుకోవడంలో, రామప్పపంతులుని మీనాక్షిని వివాహమాడమని కోరడంలో ఒక గొప్ప మనసున్న మగువగా దర్శన మిస్తుంది మధురవాణి.

నాటకంలో మరో ప్రధాన పాత్ర బుచ్చమ్మ. 'మంచం మీంచి దించెయ్యడానికి సిద్ధంగా ఉన్నవాడికి, పదిహేను వందల రూపాయలకి 'వధువు' పేరుతో అమ్మబడింది. ఈ నాటకంలోనే పాత్రలైన మీనాక్షి, పూటకూళ్ళమ్మ లాగే, ఆనాటి సమాజంలో అసంఖ్యాకంగా ఉన్న మరెందరిలాగానో తనూ ఓ బాల్య వితంతువు.

---

★ "అవినీతి పరురాలైన వొక భార్యా లేక వ్యభిచారి అయిన వొక భర్తా లేదా వీరిద్దరితోనూ కూడిన సమాజమూ ఏ రీత్యా వొక సానిపిల్లకంటె మిన్న? వ్యభిచారమే తన వృత్తిగా 'లేబిల్' వేయబడ్డ భోగం పడుచు సమాజాన్ని మోసగించడంలేదు. ఆమెకువున్న లేబిల్ దృష్ట్యా ఆమె జీవితం సరియైన తోవనే సాగుతున్నది, ఆమె యే వివాహ బంధనాలను, వైవాహిక సూత్రాలనూ ఉల్లంఘించడం లేదు."

—గురజాడ

నాలుగు మాటలు ఇంగ్లీషులో అనగానే ఆ వ్యక్తి పండితుడని, నాలుగు ఉపన్యాసాలు ఇచ్చేసరికి అతనో పెద్ద సంస్కారని నమ్మేసే పల్లెటూరి అమాయకత్వం, ముగ్ధత్వం ఆమె సొంతం. బాల్య వివాహం దుష్పరిణామంగా బాల వితంతువుగా మారితే 'వితంతు వివాహం' పేరు చెప్పి గిరీశంలాంటి మోసగాడు, వేటగాడు పన్నిన వలలో చిక్కి మరోసారి 'విధివంచిత' కాకుండా మధురవాణి, సౌజన్యరావు పంతులు సహాయంతో బయట పడగలిగింది. తండ్రితో "తమ్ముడికి పెళ్ళి చేయాలంటే నా సొమ్ము పెట్టి చేయండి కాని దాని కొంపముంచి లుబ్ధావధానులుకి ఇవ్వద్ద"ని తనకి జరిగిన అన్యాయం తన చెల్లెలి విషయంలో పునరావృత్తం కాకుండా చేయడానికి ప్రయత్నిస్తుంది. పెళ్ళి పేరుతో జరుగుతున్న చెల్లెలిబలిని ఆపడానికి గిరీశం చెప్పిన పరిష్కార సాధనంగా చివరికి అతనితో లేచి వెళ్ళి అతనిని పెళ్ళి చేసుకోవడానికి కూడా సంసిద్ధమవుతుంది.

బుచ్చమ్మ పాత్రలో మనకి కనిపించేది అంతా ఆమె అమాయకత్వం, మంచితనమే. అలాటి అమాయకత్వాన్ని, మంచితనాన్ని నమ్మించి నట్టేట్లో ముంచడం గిరీశం లాంటి ప్రబుద్ధులకి ఎంత సునాయాసమైన పని!

కన్యాశుల్కంలో సానుభూతి కలిగించే మరో స్త్రీ పాత్ర వెంకమ్మ. పెద్దమ్మాయి బుచ్చమ్మని పదిహేను వందల రూపాయల కోసం ఓ ముసలాడికి కట్టబెట్టి ఆ అల్లుడు హరీమన్నాక, అల్లుడు చచ్చిపోవడం వల్ల అతని ఆస్తిలో కూతురి వాటా కోసం దావా వేయడం వల్ల ఎంత ఆస్తి కలుస్తుందనే -లెక్కల ఆలోచనలు తప్ప కూతురి నిండు జీవితం నాశనం చేసానన్న ఆలోచన కాని, పశ్చాత్తాపం కాని లేని ఓ డబ్బు కాపీనం మనిషికి అర్ధాంగి. పెద్ద కూతురి బతుకు అలా బుగ్గయితే తిరిగి రెండవ కూతురిని పద్దెనిమిది వందల రూపాయలకి మరో ముసలాడికి అమ్మడానికి నిశ్చయించుకుంటే ఏ 'కన్న' తల్లి భరించగలదు ? ఆ

---

★ అజ్ఞానంలో అణగద్రొక్కబడి తమ అభిప్రాయాలకు అభిరుచులకు విలువ నివ్వని భర్తల నియంతృత్వంలో నలిగిపోయే వర్గానికి ఉదాహరణ 'వెంకమ్మ' కాగా, పెళ్ళి పేరుతో కూతుళ్ళను అమ్మి డబ్బుచేసుకుందామనే తండ్రుల సంకుచితత్వానికి బలి అయిన యువతుల ప్రతిబింబాలు బుచ్చమ్మ, మీనాక్షిలుకాగా, పురుషుల నీచమైన వాంఛలను తీర్చడానికి సంఘం చేతిలో మరబొమ్మలై 'వేశ్య, సాని, కులట, పతిత' అని సమాజం చేత వేలెత్తి చూపించుకుంటూ, కోర్కెలను చంపుకుంటూ, మనసు రాయిచేసుకొని భవిష్యత్తును తలచుకొనేందుకు భయపడుతూ, రక్షణ అనేది లేక శరీరాల నమ్ముకొని బ్రతకవలసిన అధోగతికి తరమబడిన స్త్రీల దీనాతి దీనమైన చరిత్రలకు అద్దంపట్టింది మధురవాణి.

—చావలి మణిశాస్త్రి

సంబంధం చేస్తే తను ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటానని బెదిరించినా భర్త ఆ నిర్ణయాన్ని మార్చుకోకపోతే జరగబోయే ఘోరాన్ని ఆపుదామనో నిజంగానే నూతిలోకి దూకేస్తుంది ఆ వెర్రితల్లి. మాటలతో బోల్తా కొట్టించే గిరీశం బుట్టలో ఇట్టే పడిపోవడానికి అమాయకత్వంలో ఆమె బుచ్చమ్మకి సరిపోయేదే. చండ కోపిష్ఠి అయిన తన భర్త ఎలా తిట్టినా, తన కోపాన్ని ఎలా ప్రదర్శించినా, ఏ దుష్ట నిర్ణయాలు తీసుకున్నా నోరెత్తకుండా పడి ఉండాల్సిన బానిసబతుకు ఆమెది.

నాటకంలో మరో పాత్ర మీనాక్షి. ఆమె కూడా బాల వితంతువు. ఆమె ప్రవర్తన మంచిది కాదని రామప్పంతులు మధురవాణికి, గిరీశం బుచ్చమ్మకి చెప్తారు. బాల వితంతువులు 'చెడి' పోతే దానికి కారణం బాలవైధవ్యం. వితంతు వివాహానికి సమాజంలో ఆస్కారం లేకపోవడం. బుచ్చమ్మలాటి ఏ కొందరు బాల వితంతులో కట్టుబడి ఉండవచ్చు కాని వయస్సులో ఉండి శారీరక వాంఛలు తీరే అవకాశం లేని మీనాక్షి వంటి, పూటకూళ్ళమ్మ వంటి వితంతువులు కట్టుదాటి ప్రవర్తించినా, కట్లు తెంచుకొని ప్రవర్తించినా ఆశ్చర్యం లేదు. మీనాక్షితో అక్రమ సంబంధం పెట్టుకోవడానికి అభ్యంతరం లేని రామప్పంతులుకి ఆమెను వివాహ మాడడానికి మాత్రం అభ్యంతరమే.

స్త్రీలకి ప్రత్యేక నైతిక నియమావళిని రూపొందించి, దానిని అమలు చేయడానికి ప్రయాస పడే సమాజానికి బాల్య వివాహాల వల్ల బాల వితంతువులు తయారయితే, వితంతు వివాహాలకు ఆస్కారం లేకపోవడం వల్ల వారు సహజం గానే సమాజం రూపొందించే నీతినియమాలను ఉల్లంఘించి, అదుపాజ్ఞలను దాటి ప్రవర్తించడానికి అవకాశ మెక్కువ అనే విషయం స్పష్టం చేయడానికే మీనాక్షి, పూటకూళ్ళమ్మ పాత్రలను ఆవిధంగానే చిత్రించినట్లు తెలుస్తుంది. అక్రమ సంబంధాలు ఏర్పరచుకున్న ఆడవారికి 'చెడిన' వాళ్ళగా ముద్ర వేసే సమాజం, వాళ్ళని 'చెడు' మార్గంలోకి మళ్ళించే గిరీశం, రామప్పంతులు వంటి వారిని 'చెడిన' వాళ్ళని గుర్తించాలి. ఆ బాల వితంతువులు చెడిపోవడానికి గల అసలు కారణాలను అన్వేషించి వాటిని నివారించాలి.

కన్యాశుల్కంలో చిత్రించిన వందేళ్ళనాటి మన సమాజాన్ని, మన నేటి సమాజంతో, ఈ నాటకంలోని స్త్రీ పాత్రలని ఈనాటి స్త్రీల స్థితిగతులతో పోల్చి చూస్తే రెండింటికి తేడా ఎంత వరకు ? ఆనాడు కన్యాశుల్కం ప్రబల దురాచారం అయితే ఈ నా డు వరకట్నం అంతకంటే ఘోర దురన్యాయం. ఆనాడు ఈనాడు కూడా ఎందరో స్త్రీలు జీవనోపాధిగా పడుపు వృత్తిని కొనసాగించక తప్పలేదు. కట్టుకున్న భార్యమీద, కన్నకూతుళ్ళ మీద అగ్గిమీద గుగ్గిలంలా లేచే 'అగ్నిహోత్రావధాను'లని కిమ్మనకుండా భరించే, భరించవలసి వచ్చే వెంకమ్మలు, బుచ్చమ్మలు ఎందరో వితంతు వివాహం చేసుకుంటానని, చెల్లెలి వివాహం కాటికి

కాళ్ళు చాచిన వృద్ధుడితో జరగకుండా చక్రం అడ్డు వేస్తానని హామీ ఇచ్చే గిరీశం ఆనాటి వాడయితే, ప్రేమ వివాహం చేసుకుంటానని, వరకట్నం ప్రసక్తే ఉండదని కన్న తల్లి తండ్రులకు భారం కానక్కర లేదులే అని హామీ ఇచ్చి నమ్మించి, మోసంచేసే ,లేవనెత్తుకు వెళ్ళి నష్టేటముంచే గిరీశాలు ఈనాడు ఎంతమందో.

'కన్యాశుల్కం' తొలిసారిగా ప్రదర్శించబడి వందేళ్ళు కావస్తోంది. నాటికీ, నేటికీ స్త్రీల దైన్యంలో, అసహాయత్వంలో, సాంఘిక దురాచారాలకి బలి అవడంలో, ఎక్కడ తేడా ? ఆనాడు ఎందరో 'ఘనులకు', ఘనాపాటీలకు ఉంపుడు కత్తెలుగా, ఈనాడు కూడా జీవనోపాధి కోసం తమ కన్న తల్లిదండ్రుల కోసమో, తోడబుట్టిన వారి కోసమో, కన్న బిడ్డల కోసమో 'పతితులు'గా పడుపువృత్తిలో ఆనాడు వితంతు వివాహం లుబ్ధావధానులు వంటి మత ఛాంధసులకు ఓ పాప కార్యమైతే గిరీశం లాటి ఆదర్శవాదులకి ఓ సాంఘిక గుర్తింపుని, సాంఘిక ప్రయోజనాన్ని ఇచ్చే 'చిట్కా'. అయితే ఈనాడు వరకట్నాల 'గిరాకీ' బేరాల్లో వితంతు వివాహాల ప్రస్తావనే లేదు. అదే సమాజం, అదే సామాజిక 'న్యాయం'. అవే సాంఘిక దురాచారాలు-అదే కొనసాగింపు. అదే వంచన. అదే బానిసత్వం. ఈబానిసత్వశృంఖలాలు తెంచుకునేది ఎప్పుడో? ఈ సాంఘికదురాచారాల్ని, దురన్యాయాన్ని, దుష్కృత్యాలని ఎదిరించేది ఎప్పుడో. వీటికి ఎదురు నిలిచి పోరాడేది ఎప్పుడో?

ఈనాడు కూడా విద్యావంతులైన స్త్రీలు, కుటుంబంలో ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్నా లేకపోయినా ఉద్యోగాలు చేసుకుంటున్న స్త్రీలు, ఉపాధి వెతుక్కున్న స్త్రీలు కూడా ఇంకా ఈ సాంఘిక దురాచారాల సెగలలో మాడి మసి అవుతున్నారంటే, స్త్రీకి ముఖ్యంగా కావలసింది చదువూ కాదు, ఉద్యోగమూ కాదు-ఆత్మస్థయిర్యం, కుటుంబంలో, సమాజంలో తన స్థానమేమిటో, తనకి జరుగుతున్న అన్యాయ మేమిటో తెలుసుకోగలిగే'స్పృహ' ఎదిరించిపోరాడవలసిన ఆవశ్యకతనిగుర్తించడం. కన్యాశుల్కం అమలులో ఉన్నప్పుడు వరుడిచ్చే శుల్కానికి ఆశపడి కన్నతండ్రులే, తమని 'పండుముసలి'కి కట్టబెట్టినప్పుడు, వరకట్నం, వరుడుకి వరుడి తల్లిదండ్రులకి సమర్పించు కున్నాక అత్తవారింట్లో అడుగు పెట్టాక కూడా నానా యాతనలకి, చిత్రహింసలకి, వరకట్న చావులకి బలిఅయినపుడు-ఆనాడూ ఈనాడు కూడా స్త్రీలదే బానిస బతుకు. వివాహం తంతుకి స్త్రీలే బలి పశువు. డబ్బుకి అమ్ముడుపోయినపుడు, డబ్బుకి వరుణ్ని కొనుక్కోవలసిన నికృష్టస్థితిలో ఉన్నప్పుడు స్త్రీ స్థాయికి, హోదాకి తేడా లేదంటే ఇదే సమాజంలో పురుషాధిపత్యానికి, స్త్రీ బానిసతత్వానికి ఖచ్చితమైన సాక్ష్యం. ○

---

★ మానవుని ప్రేమించడమన్నది అతిసాధారణమైన జీవిత సూత్రం. ఇతరులను ప్రేమించడంవల్ల అతనికి నిరవధికానందం సిద్ధిస్తుంది.

— గురజాడ

# కన్యాశుల్కము రచన : ప్రదర్శన : ప్రశంస

(1892 ఆగస్టు 13వ జగన్నాథ విలాసినీ నాటక సమాజం వారు కన్యాశుల్కాన్ని విజయనగరంలో ప్రదర్శించారు. అది తొలి ప్రదర్శనం. నాటక ప్రదర్శనాన్ని ప్రస్తావిస్తూ 1892 ఆగస్టు 26వ తేదీన విజయనగరం నుంచి వెలువడుతూ వుండే "ది తెలుగు హార్ప్" అనే ఆంధ్రాంగ్ల పత్రిక ఒక సమీక్షను ఆంగ్లంలో ప్రచురించింది. ఇది దాని తెలుగు అనువాదం... సం॥)

మన స్థానిక నాటక సమాజం వారిచే గత శనివారం రాత్రి కన్యాశుల్కమనే స్వతంత్ర నాటకం హృదయంగమముగా ప్రదర్శింపబడింది. ప్రదర్శనశాల ప్రేక్షకులతో కిటకిటలాడుతూ వుండెను. డబ్బు కాశపడి తల్లితండ్రులు తమ కుమార్తెలను ముసలివాళ్ళకైనా సరే యిచ్చి వివాహం చేసి తమకు కాబోయే అల్లుళ్ళవద్ద నుంచి ధనాన్ని పొందే కన్యాశుల్కమనే దురాచారం ఎట్టి దుష్ఫలితాలకు దారి తీయగలదో చూపడమే ఈ నాటక లక్ష్యం. ఇలాంటి దురాచారాన్ని మాన్పించి సంస్కరించవలెనని మన మహారాజావారు ఎంతకాలం నుంచో హృదయ పూర్వకంగా వాంఛిస్తున్నారని సంస్కరణోద్యమానికి ప్రధాన వ్యక్తులుగా వున్నారని మన కందరికీ తెలిసిన విషయమే.

నాటకం ఆద్యంతమూ మనోరంజకం. హృదయోల్లాసకరమైన సంభాషణలు ఛలోక్తులు లెక్కకు మించినన్ని. నాటకంలో ఛలోక్తులు చమత్కారాలు మాటిమాటికీ మెరుపులవలె మెరుస్తూ ఆదినుంచి అంతం వరకూ ఉత్తమ హాస్యాన్ని కలిగిస్తూ ప్రేక్షకులను విస్మయ చకితులనూ, తన్మయులనూ కావించాయి.

---

★ "మానవ సమాజంలోని లోపాలోపాలను సానుభూతితో పరిశీలించి, సమాజాభివృద్ధికి తోడ్పడాలని సంకల్పించి, సంస్కరణలకు ఎందరెన్ని ఆటంకాలు ఎలా కలిగిస్తారో అనుభవపూర్వకంగా తెలుసుకొని వర్ణించి, తన సూచనలు మనసులను విరవటానికి కాక ఆర్ద్రం చేయటానికి హాస్యమయంగా, నర్మగర్భంగా, అర్థమయ్యే భాషలో వివరించి, తెలుగు సాహిత్యంలో వెదికితేగాని కనబడని రూపకప్రక్రియలో అందించిన మహనీయుడు గురజాడ."

— బూదరాజు రాధాకృష్ణ

కన్యాశుల్కం రచనతో ఆంధ్ర నాటక సాహిత్యంలో ఒక సరికొత్త పద్ధతి, ఒక నూత్న పంథా ప్రారంభమయింది. దేవుళ్ళనూ, దయ్యాలనూ, దేవతలనూ, రాక్షసులనూ కథా పాత్రలుగ స్వీకరించి రచించబడిన పాత నాటకాలవలె కాక తద్భిన్నమైన వర్తమానకాల యితివృత్తంతో మన కళ్ళ ఎదుట మసలే ఆధునిక స్త్రీ, పురుషుల జీవిత చిత్రీకరణతో ఈ నాటకం అలరారుతోంది. సన్నివేశ కల్పన, హాస్యరస పోషణలతో పాటు పాత నాటకాలలో సాధారణంగా మృగ్యమైవుండే పాత్రీకరణమనే ప్రధాన లక్షణంతో కన్యాశుల్కం విరాజిల్లుతోంది.

దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పకోకోయ్
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్

—గురజాడ

ఈ నాటకాన్ని రచించినవారు సుపరిచితులైన మన నగర వాస్తవ్యులు మహారాజా వారి కళాశాలాధ్యాపకులు శ్రీ జి.వి. అప్పారావు పంతులు, బి.ఏ; ఇంతకు పూర్వమే ఆయన ఇతర రంగాలలో నేర్పుకలవారని పేరుపొందిన వ్యక్తి. ఆయన, ప్రత్యేకించి పేర్కొనదగిన ఎంతో సాహిత్య కృషిని కావించారు. ఆంగ్లములో గద్య పద్యాలను అనేకం రచించి పత్రికలకు ఆయన సమర్పించారు. పురావస్తు తత్వ శాస్త్రరంగంలో ఆయన అమిత శ్రద్ధాసక్తులతో కృషిచేస్తున్న పరిశోధకులు. తొలి ప్రయత్నంలోనే విజయాన్ని సాధించిన రచయితగా అభినందిస్తూ ఆయనకు ఉజ్జ్వల భవిష్యత్తు చేకూరాలని మేం కాంక్షిస్తున్నాం.

తెలుగు హార్ప్, 26 అగస్టు 1892

"గ్రంథకర్తగారు గురజాడవారి ముత్యాల సరాలను రాయప్రోలు సుబ్బారావు గారి తృణకంకణంతో పోల్చి రెండోదే నవ్యకవిత్వానికి ప్రమాణమని వ్రాశారు. (145వ పేజీ) ఈ పోలిక రచయితకు సుబ్బారావుగారి యెడల అభిమానాన్నీ, గురజాడ చూపిన విప్లవ పంథాను అంచనా వేయడంలో సంకుచిత భావాలను మాత్రమే చూపుతుందిగాని సరియైన అంచనాను తెలుపదు."

— మద్దుకూరి చంద్రశేఖరరావు
'నవ్యాంధ్ర సాహిత్యవీధులు' - గ్రంథసమీక్ష నుంచి.

(కవరు 4వ పేజీ తరువాయి)

ఆకులన్ని కుప్పవోసి - పిల్లజెల్ల ముసలి ముతక
దీపం బెట్టేదాక - కట్టలన్ని గట్టుకొని
కోసుపెట్ట దూరమన్న - కల్లం కాడికి బోతే
నువు జేసిన కట్టమంత - పట్టపగలె దోచెటోల్లు ॥మల॥

కల్లంలో ముల్లెదించి - లైనుమీద బెట్టాలె
కట్టలెంచుకునేదాక - గుండెలోన భయం భయమె
కల్లె దార్న బాంచెనంటు - కట్టలెంచు కొమ్మనాలె
కాళ్ళ ఏళ్ళ మొక్కిన గాని - కనికరమే సూపడాడు ॥మల్ల॥

పడు సోల్లను ఒక్కదిక్కు - ముసలోల్లను ఒక్కదిక్కు
లైనుగట్ట మని జెప్పి - జెలాసాగ దిరుగుతాడు
పడుసోల్లా లైనుదిక్కె - మొట్టమొదలు వోతాడు
పడుసోల్లను జూసుకుంట - పరాసికాలాడుతాడు ॥మల్ల॥

ముల్లె కాడి కొచ్చెనంక - ముల్లెలోన సేతు లెట్టి
అట్టడుగున ఉన్న కట్ట - నొక దాన్నె తీస్తాడు
కట్టకుండె నడినిడిసే - ఆకులన్నీ సూస్తాడు
ఆకు కొనలు బట్టి దులిపి - అవతల కిసిరేత్తాడు ॥మల్ల॥

కొన్ని లేతగున్నాయని - కొన్ని ముదిరిపోయినాయని
కొన్ని సిన్నగున్నాయని - బీడి కూడ గాదనీ
పోళమ్మా ఆకులని - మచ్చలున్న ఆకులనీ
ఏదేదో వంకబెట్టి - కట్టలన్ని ఇసిరేసీ
మనమంతా బోయినంక - మల్ల ఏరుకుంటాడు ॥మల్ల॥

గుల్లకట్ట మిత్తికట్ట - గాలికట్ట దేవుని కట్ట
కల్లెదారు కట్టలంటు - ఎన్నెన్నో ఏసుకొని
తప్పులెక్క బెట్టుకుంటు - కట్టలెన్నొ దొబ్బుతాడు ॥మల॥

"ఈనాడు గురజాడవారు నవల రాయకుండానే వెళ్ళిపోయినా, తెలుగులో వస్తున్న వచన సాహిత్యం అంతా వారి మార్గాన్ని అనుసరిస్తున్నదే. ఏ పుస్తకం చదివినా, ఏ పత్రిక చదివినా, రేడియో విన్నా, టి.వి. చూసినా, సినిమా చూసినా గురజాడవారి ప్రమేయమే మనకి కనబడుతుంది; సాహిత్యానికి మూలం ప్రజా జీవితం. దీనిని మొట్టమొదట ప్రతిఫలింప చేసినది గురజాడ, కృతకృత్యుడు గురజాడ."

—చాసో

ఇంత కష్టపడ్డా మనకు - రోజు రోజు సీటీలే
వారం కొకసారి మనకు - పైస లిచ్చేటప్పుడాడు
రూపాయలె ఇస్తాడు - చిల్లరంత మింగుతాడు
పొరపాటున సీటీపోతె - పైసలు ఎగపెడుతాడు ॥మల్ల॥

నూరాకులు కట్టమనీ - సర్కారే జెప్పింది
నూరాకుల కట్టకైతే - ఐదు పైసలియ్యమంది
నూటాయాభై ఆకులను - వీడు గట్టుమంటాడు
ఇంత పెద్ద కట్ట కడితె - ఐదు పైసలన్నియ్యడు ॥మల్ల॥

కల్లేదారు గుత్తేదారు - పెద్ద పెద్ద భూసాములు
సర్కారుతో వీళ్ళంతా - మిలాఖతై పోయిర్రూ
రెండు నెలల్లో పలీల్లు - లచ్చలు సంపాదిస్తారు
ఈ లచ్చలు అన్నిగూడ - మన నెత్తురు పిండినయ్ ॥మల్ల॥

ఇంత దోపిడీని మనమూ - సూసుకుంట ఉండొద్దు
మన నెత్తురు తాగెటోళ్ళ - ఆటలింక సాగద్దు
సంగపోల్లతో కలిసి - దోపిడి నెదిరించాలి
మనకు కూల్లు పెరుగాలని - పోరాటం జేయాలె ॥మల్ల॥

ఖమ్మం వరంగల్లూ - శ్రీకాకుళ మదిలబాదు
గోదావరి లోయలోన - తునికాకును దింపెటోల్లు
మాకు కూలి పెరగాలని - పోరాటం జేసిర్రూ
పదారు పైసల కొక్క - కట్ట జేసుకున్నారు ॥మల్ల॥

కరీంనగరు జిల్లాలో - మనమంతా పోరాడి
నూరాకుల కట్టొకటికి - ఎనిమిది పైసలియ్యాలని
కూల్లు పెరిగెటంత వరకు - మనము సమ్మె జేయాలె
మన బలమును సూపిస్తే - మన కూల్లూ పెరుగుతాయి ॥మల్ల॥

కూలి పెంచుకొందాము - కూడి పోరు సేద్దాము
దొరతనాన్ని కూలదోయ - దండుగానూ ఎల్దాము
లాఠీలకు తూటాలకు - దడవకుండి నిలవడ్డం
దోపిడీకి తావులేని - కార్మిక రాజ్యం తేద్దం ॥మల॥

[అమరవీరుడు 'నూతన్' రాసిన ఈ పాట - మే 1979' నూతన' నవతరం మాసపత్రిక సౌజన్యంతో]

---

నా ది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోను. — గురజాడ

# దేశము మనుషులోయ్

— చిత్ర

ఫాక్టరీ 'బొ౦య్' మంటూ కూసింది. అంతవరకూ గబగబా ఆదరా బాదరాగా మాటాడుతున్న జనమంతా, ఎవరి ఆత్మ శాంతికోసమో మౌనం పాటిస్తున్నట్టు ఆ రెండు నిముషాలూ నిశ్శబ్దం అయిపోయేరు. ఆ సైరను విన్నప్పుడల్లా అందరికీ చావు సంగీతం గుర్తుకొస్తుంది. జింకల్ని తిన్న పులి త్రేవున తేన్చినట్టనిపిస్తుంది.

ఎవరో సగం తిని పారేసిన మామిడి పండుని చీక్కుంటూ వొచ్చేడు ఓ నాలుగేళ్ళవాడు. వాడ్ని - తల్లి కాబోలు -దబదబా బాదుతుంటే వాడు ఏడుపు లంకించుకున్నాడు.

"ఓలె. ఒల్లకోయే. గుంటడ్ని సంపిత్తావేటే" అని ఒక గిరజాలజుట్టు ముసలాయన కేకలేస్తున్నాడు.

వూరంతా నిద్రోయేవేళ. అయినా ఆ రోజు మెళకువగానేవుంది. పున్నమి రాత్రేమో వెన్నెల విరగ కాస్తోంది. ఎక్కడో ఒకఆవు, ఏంరోగమొచ్చిందో "అంబా" అని ఏడుస్తోంది - దూరంగా ఫాక్టరీ మిషన్లచప్పుడు రొదగా భయపెడ్తోంది. రోడ్డుకీ ఫాక్టరికీ లారీలు ఝుమ్మంటూ తిరుగుతున్నాయి-

"ఏటి తిన్నన్ని మావిడిపల్లు. ఇలానీకి అలా పారీసీవోరు గుంటలు- వూరుకి

"విశేష సారస్యం తెలిసినవాళ్ళు విచక్షణతో చూస్తే ఒక శాశ్వత గ్రంథ పరంపరను జనింప చెయ్యగలగడానికి ఉండవలసిన ఉన్నత లక్షణాలుగల అపూర్వ రచనలలో 'కన్యాశుల్కం' ఒకటి సుమా అని పరిష్కరించగలరు. 'ఆంధ్రులు కన్యాశుల్కం' చూడకపోతే ఎట్లా!"

—భమిడిపాటి కామేశ్వరరావు

ఎటుకేసి చూసినా మావిడిచెట్లు తెరిపినేకుంటుండాయి. ఇగో ఈపాత్రీవొచ్చింది" నత్తి అప్పయ్య మాటలకి తడుముకుంటున్నాడు.

"తస్సా జెక్కా ! బతుకు బాగుపడుద్దనుకున్నాంగానీ- కంట్లో దుమ్ముకొడతాదనుకోలేదురా" అన్నాడు పైడితల్లి.

"కలోగంజో తాగి బతికేవోల్లం. బతుకు బుగ్గి జేస్సింది గదరా ఈ పాత్రీ వొచ్చి" అరిపోయిన చుట్టతీసి తుపుక్కున వూస్తూ అన్నాడు సింహాచలం.

కంపేరు కుంటే కయిదంట. ఆకు లేరుకుంటే అరెస్టంటన్నారు. ఇంకేంబెట్టి వొండాల బువ్వ. ఈల్లబుగ్గెత్తి పొయ్య" కసిగా తిడుతోంది అప్పలకొండ.

ప్రవేట్లో కాబోలు -

"తిండి కలిగితే కండ కలదోయ్, కండకలవాడేను మనిషోయ్" అంటున్నాడు ఆకలి తేన్పులు ఆపుకుంటూ అర

ఇంత కష్టపడ్డా మనకు - రోజు రోజు సీటీలే
వారం కొకసారి మనకు - పైస లిచ్చేటప్పుడాడు
రూపాయలె ఇస్తాడు - చిల్లరంత మింగుతాడు
పొరపాటున సీటిపోతె - పైసలు ఎగబెడుతాడు ॥మల్ల॥

నూరాకులు కట్టమనీ - సర్కారే జెప్పింది
నూరాకుల కట్టకై తే - ఐదు పైసలియ్యమంది
నూటాయాభై ఆకులను - వీడు గట్టుమంటాడు
ఇంత పెద్ద కట్ట కడితె - ఐదు పైసలన్నియ్యడు ॥మల్ల॥

కల్లేదారు గుత్తేదారు - పెద్ద పెద్ద భూసాములు
సర్కారుతో వీళ్ళంతా - మిలాఖతై పోయిర్రూ
రెండు నెలల్లో పలీల్లు - లచ్చలు సంపాదిస్తారు
ఈ లచ్చలు అన్నిగూడ - మన నెత్తురు పిండినయ్ ॥మల్ల॥

ఇంత దోపిడీని మనమూ - సూసుకుంట ఉండొద్దు
మన నెత్తురు తాగెటోళ్ళ - ఆటలింక సాగద్దు
సంగపోల్లతో కలిసి - దోపిడి నెదిరించాలి
మనకు కూల్లు పెరుగాలని - పోరాటం జేయాలె ॥మల్ల॥

ఖమ్మం వరంగల్లూ - శ్రీకాకుళ మదిలబాదు
గోదావరి లోయలోన - తునికాకును దింపెటోల్లు
మాకు కూలి పెరగాలని - పోరాటం జేసిర్రూ
పదారు పైసల కొక్క - కట్ట జేసుకున్నారు ॥మల్ల॥

కరీంనగరు జిల్లాలో - మనమంతా పోరాడి
నూరాకుల కట్టొకటికి - ఎనిమిది పైసలియ్యాలని
కూల్లు పెరిగెటంత వరకు - మనము సమ్మె జేయాలె
మన బలమును సూపిస్తే - మన కూల్లూ పెరుగుతాయి ॥మల్ల॥

కూలి పెంచుకొందాము - కూడి పోరు సేద్దాము
దొరతనాన్ని కూలదోయ - దండుగానూ ఎల్దాము
లాఠీలకు తూటాలకు - దడవకుండి నిలవద్దం
దోపిడీకి తావులేని - కార్మిక రాజ్యం తేద్దం ॥మల॥

[అమరవీరుడు 'నూతన్' రాసిన ఈ పాట - మే 1979 'నూతన' నవతరం మాసపత్రిక సౌజన్యంతో]

---

నా ది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోను. — గురజాడ

సెర్లో కలిసి సెర్లోని సేపలు సచ్చిపో త
న్నాయి. గొడ్డూ గోదా ఆ నీరు తాగి తే
అలివికాని రోగాలొచ్చి అరిసరిసి స
పోతున్నాయి. తాగడానికి సరే గొ
కడగడానికి పనికి రానేదు ఆ నీ
ఇయ్యాళ్టికీగతి పట్టింది. ఈ ఎదవలేె
యివరం తెలీక కోడిపుంజుల్లాగా కల
పోతున్నారు" అన్నాడు.

అప్పటి దాకా అగ్గిపుల్లతో చెవు
'గెలుక్కుంటున్న' మార్తాండం —

"అసలు వీళ్ళకి వొక్కవిషయం తె
దండీ - ఈ వూరు అసలు మనుషులు
డానికి పనికిరాదు. పంటలు పండవు.
ఇక్కడ గాల్లో యిసం కలిసింది. సెర్లో
సెత్త కలిసింది. కాబట్టి కాళీ చేసేమని
గవర్నమెంటు ఎప్పుడో ప్రకటించీసిం
దండి బాబు" అన్నాడో లేదో —

"ఒరెే్రా. నీకే సెన్నయినా సెప్తావు.
సావుకోరివి. ఈ వూర్లె కాకపోతే మరో
ఊల్లో నమ్ముకుంటావు. ఏటిక్కడ బూమీ
పుట్రా, గొడ్డూ, గోదం వొగ్గేసి మమ్మ
ల్నెక్కడికి పొమ్మంటావురా ? ఎటు
పోవాల ? పోయి ఎలా బతకాల ? ఇప్ప
డికే రైతుల్లాంటోలం కూలోల్ల వయి
పోనాం. సిమ్మెంటు పీల్చి, ఇనుము బుగ్గి
మెక్కి రోగాల్తో పీనుగులై పోనాం.
ఇంకా వూరొగ్గేసి దొమ్మరోల్ల నాగ
ఊరూరూ తిరగమంటావేట్రా ? అసలా
డెవుడ్రా? ఏ ఊర్రా అడిది? ఇక్కడి
కొచ్చి కడుపులోన గుండ పెట్టినట్టు
వూల్లోన ప్యాక్ట్రీ ఎట్టి మమ్మల్ని పొమ్మం
డాకి ఆడెవుడ్రా ? గవుర్మెంటోడెవుడ్రా ?
అ

జాతి మత వర్ణ వ్యక్తి భేదాలూ చెడు
గులూ గురించి నవ్వేసి, పెక్కులొకటిగ
చూచినవాడే ప్రాజ్ఞుడనీ, మంచి చెడ్డ
భేదాలు తప్ప ఇతర భేదాలు మానవుల్లో
లేవనీ ఘోషించిన కుటుంబి

—గురజాడ అప్పారావు

అని పైడయ్య ఆవేశ పడుతుంటే
బాబు అడ్డుకుని -

"పైడయ్యా! ఆగాగు. చూడు. ఇలాటి
సమయాల్లో మనకి కావాల్సింది ఆవేశం
కాదు. నిదానం. దుంప లోపలొదిలీసి
దర్పలెంత నరికితే మాత్రమేంటి?" అం
టుండగా -

"ఇది మూడోపంట. నాబం నేకపోతే
పోయింది. మదుపులన్నా రాకపోతే ఎవ
సాయంసేసి నాబమేటి ?" అన్నాడు
పైడయ్య.

"వొర్సాల్లేకపోతే దేవున్ని తిడ్తారి.
మదుపుల్లేకపోతే మన పుటకని తిడ్తారి.
అన్నీవుండీ పంటసేతికిరాకపోతే ఎవుల్ని
అనాల? ఎలా బతకాల?"

"బాబూ! ఇదిగిలాగ ఈ ప్యాక్ట్రీ
మురుగంతా పొలాల్లోంచి పారితేమాత్రం
ఇకను మనం పంటల ఆశవొదిలీసి,
ఎవసాయాలు ఎత్తిపెట్టేసి అడుక్కోడమే
గతి. నా మాట నమ్ము" కరాఖండీగా
తేల్చేసేడు కనకయ్య.

బాబు మెల్లిగా లేచి నిలబడ్డాడు.

"చూడండి. ఎరువుల ధర పెంచుతా
మన్నప్పుడు అందరం కలిసి కదిలేగానీ
ధరలు తగ్గలేదు. శిస్తులు తగ్గడానికైనా
అప్పులు ఆపడానికైనా, మనం పండించిన

అందరు కలిసి నడిస్తేనే పనౌతుందని తెలుసుకున్నాం- అవునా?" అని ఆగేడు.

"ఆమాట నిబద్దే"జనంలోంచి ఎవరో అరిచేరు.

"అందుకే ఈ కాలుష్యం విషయం మీదకూడా మనం కలిసే వుండాలి.మనలో మనం తన్నుకోకూడదు. దీనికందరూ సమ్మతమేనా ?"

"అవును. మాం సిద్దమే"

"అయితే వినండి. మూనేడు కాయితాలిచ్చేం. అవతల పారీసేరు. పోయిన పంటకి తాశీల్దారుకి చెప్పేం. పనవ్వలేదు. అందుకే మనం అందరం ఆలోచించి గట్టి ప్రయత్నం చేద్దాం. మనం మళ్ళీ కలుద్దాం.ఈలోగా మీరూ ఆలోచించండి" అని బయల్దేరేడు. దూరంగా మేష్టరు నిద్రకళ్ళతో కాబోలు -

"పరుల మేలుకు సంతసిస్తూ-ఐక్యమత్యం నేర్చనోయ్."

దుమ్ములగూడెం రోడ్డుకి రెండుమైళ్ళ దూరంలో వుంది. పీచువలస దగ్గర దిగి అడ్డంగా నడిచివెళ్తే తప్ప ఆ వూరికి చేరలేం. బస్సులూ, ఆటోలూ పక్కన పెడితే రిక్షాలుకూడా నడవ్వు. రోడ్డుదిగేక నలభై ఎకరాల మావిడితోట, 'నాయుడు తోటంటారు. దాన్ని' అందులోంచి అర గంట నడవాలి. వర్షాకాలం వొచ్చిందంటే పంచెలెగ్గట్టాలి. షరాయిలు మడతెట్టాలి. పేంట్లయితే యిప్పి బుజాన్నేయ్యాలి. అంత బురద. ఆ వూరు వెనకనించికాలవొకటి పారుతోంది. అందులో నాలుగు నెలలు నీళ్ళుంటే ఎనిమిదినెలలు ఎండిపోతుంది. అరకొరగా తడిపితే అరొంద లెకరం అట్టట్టా పండుతుంది.

అలాంటూళ్లోరెండెకరాల చిన్నరైతు పెంకయ్య. ఇద్దరు పిల్లల్తోనూ నలుగురు మనవల్తోనూ కాలక్షేపం చేస్తున్నాడు. అప్పుల్లో మునిగి తేలాలేక - ఈదాలేక ఛస్తూ బతుకుతున్నాడు. 'బతుకు బాగు లేదు, బాగులేదు' అనుకుంటూనే బండి లాగించేస్తున్నాడు. భాగ్యాల్లేక పోయినా బంధాలు బావున్నందువల్ల 'అప్పా! బావా! దద్దా! కక్కా' అనుకుంటూనే ఈడ్చేస్తున్నాడు. పెద్దాడీమధ్యనే పట్నంలోబతుకుతానని వెళ్ళిపోయేడు. వారానికోసారి పిల్లలకోసం ఒస్తాడు.

ఆ వూరి కొక స్కూలుంది. అందులో మేష్టారు అరవిందం. అతనే మొదటగా పద్యం నేర్పేడు పిల్లలకి -

"దేశమును ప్రేమించుమన్నా- మంచి అన్నది పెంచుమన్నా" అని.

ఆవూరు చేసిన - అది పుణ్యమో పాపమోగానీ- అదేంటంటే ఆ వూరు మహానగరానికి ఇరవైమైళ్ళ దూరంలో వుంది. పెంకన్న చిన్నప్పు డైతే —

"ఇప్పుడంతే బస్సులొచ్చినాయిగానీ నా సిన్నతనంలో ఏకువజామున నెగిసి

---

"నాటకంలో ప్రతీది స్వభావ సిద్ధంగా ప్రత్యక్ష పరిస్థితులకు సాక్షీభూతంగా వాస్తవికంగావుంది. ఎడతెరపిలేని ఎదురు దెబ్బలతో, సునిశిత హాస్య చమత్కృతులతో ఈ నాటకం మనల్ని పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్విస్తుంది....నాటకం నిర్మితిలో ఎక్కడా బిగి సడలలేదు."

—వంగోలు మునిసుబ్రహ్మణ్యం గురజాడకు 1909 మే 10న రాసిన లేఖ.

---

ఎడ్లబండి తూసి బయిదెల్తే, డాబాలకాడ ఆగి సల్దులు తినీవోల్లం. సుట్టముక్క కాల్సుకుని ఎడ్లకి నీల్లెట్టి మల్లీ తూస్తే సుక్కలు పొడిసేయి పట్నం సేరేసరికి."

"ఇప్పుడు పట్నం, కంపెనీ కామా చ్చమ్మ నాగ తెగ తూరిపోయింది. అదీ వాపో, బలుపో తెల్దుగానీ దోరబందాలు పట్టేన్నదు. పట్నం సేరితే కల్లువాసన సంపేత్తది - 'ఎదవకి ఒల్లంతా పుల్లే వున్నట్టు" పట్నం నిండా రొచ్చూ, ఈగ లూను. ఏమైతేనేం అది కట్టిన సీరలోని జలతారునాగ రోడ్లు మిలమిలలాడుతాయి. దాని జేసరి పొడినాగా లైట్లు చమక్ చమక్‌లాడతాయి. 'ఇక తినకేసస్తావు' అని దాని సేత తిండి మానిపించీసి బల వడం ఆపీసేదో డాట్టరు."

'అమ్మో! ఇంకా పెరిగిపోతే ఇంక దీన్ని భరించడం కష్టం' అని నగరం నెత్తిన మేకు కొట్టింది గివర్నమెంటు. అందుకే ఏ ఫాక్టరీ పెట్టుకోవాలన్నా నగరానికి దూరంగా పెట్టుకోమంది.

పట్నంలోకాలుష్యం పెరిగిపోయింది. ప్రజలు బతకలేరు.నేను ప్రజలెన్నుకున్న ప్రజా ప్రభుత్వాన్ని కదా! 'అంచేత మీరు దూరంగా పొండంది. కావాలంటే సబ్సిడీలు ఇస్తానం'ది.

వెంకయ్య వెర్రోడుగానీ వాల్‌చంద్ వెర్రోడా? వాడియూ వెర్రోడా? ఒక్కొక్కడి జేబులోనూ పదేసి మంది ఎం.పీ.లూ- నలుగురేసి మంత్రులూ వున్నారు. అసలు పట్నంలో స్థలం ఎక్కడుంది? గల్లీ దాదాల నుండి ఢిల్లీ బాబాలవరకూ అందరూ ఆక్రమించేసేరు గదాఅందుకే-

"నదుల నోళ్ళను నలిగి ఉండిన
నాజెప్పైన పదాల లోపల
ఆడుచుండును ప్రకృతి యంతా
అందరికి తెలిపితివి గదరా"

— గరిమెళ్ళ సత్యనారాయణ

"ఫర్లేదు. ఫర్లేదు. అలాగే పోతాం. మేం గూడా ప్రజాస్వాములులంగదా! మరి ఆ సబ్సిడీ లేనోపారీ?" అనేసి చప్పట్లు కొట్టించేసి బిల్లు పాస్ చేయించేసేరు. పార్లమెంట్లో - వాళ్ళకి - గాలరీలో అయినా ఎక్కువసేపు కూచోడమంటే మాచెడ్డ చిరాకు. 'పెధవ పందుల దొడ్డి వాసన' అని చిరాకు పడతారు.

* * *

వెంకయ్య చుట్ట వెలిగించి దవడలు లోపలికి పీలుస్తూ పొగవొదుల్తున్నాడు. జనం అంతా మెల్లిగా జారుకుంటున్నారు. బాబూ, వెంకయ్య న డు చు కు ం టూ వెంకయ్య పాకకి చేరేరు. నులకమంచం దుప్పటి వేసి బాబుకి పక్కవేసి, తను పక్కన చాపేసుకున్నాడు వెంకయ్య. పిచ్చివాడేసిన బొమ్మలా, వెన్నెల చారలు చారలుగా పీలికలు పీలికలుగా చిక్కడు పాదుమీద పరుచుకుంది. వెంకయ్యభార్య చెంబుతో మంచినీళ్ళు తెచ్చిచ్చి-

"ఇంటన్నావా? గుంట (పిల్లలు) లియ్యాల బడికి పోలేదంట. మేట్టగారు సెప్పేరు.'

"ఎందుకో కనుక్కోనేక పోనావా?"

"ఏటి కనుక్కోవాల? పాత్రీకోటర్సు లల్ల ఎవరో పెద్దబాబు బార్యట. ఈలు పుత్తకాలు పట్టుకుని బరికిపోతంటే పిల్సిందట. పిల్సి, ఒరే ఎంకా ఇట్రా అనిఇన్ని

మారీలు సేతిలపోసి ఒరే! ఇల్లంతా దులిపీసి, కడిగీసి సరుదుతావేట్రా ? సాయింత్రం అడివిరాముడు సినిమా సూపెడతానసేసరికి, ఈ ఎదవ గుంటడు కదా- సినిమాపిచ్చి, అయిసైపోయి, ఆ పనులన్నీ సేత్తా కూకుండిపోనాడట"

"అయినా ఈ ఎదవలకి సినిమాపిచ్చేంటే! పిలు రెండుతగల్నిత్తా" అనేసరికి-

"ఓర్నాయినో నువ్వు కదలక• యిప్పటికే గుంటడు సచ్చిపోనాడు. ఆలమ్మకీ సంగతి తెల్చి రోకలితోటీ వీపంతా కుల్లపొడిసీసింది సూడు. నిద్దట్లకూడ ఎలా బెక్కుతున్నాడో" అని మనవడ్ని చూపించింది.

వెంకయ్య పొడుగ్గా వూపిరిపీల్చి "అయినా బలిసినోల్లకి, వుద్యోగత్తులికీ, పట్నపోల్లకీగానీ కట్టం సేసీ వోడికి టీ. వీ లేవే? ఏటది కూడా? గుడ్డా?" అని సణుక్కుంటుండగానే అందరికీ నిద్రలు పడ్డాయి.

మర్నాడు రైతుల్ని కలిసొద్దామని వూర్లోకి బయల్దేరేడు బాబు. మాటల్లో సోడా తాగుదామనిపిస్తే "ఫ్యాక్ట్రీకాసెల్దామా? రోడ్డు కెల్దామా" అనడిగేరు.

"రోడ్డుకే వెల్దాం పదండి" అని దారితీస్తూ "మనవూరుచూస్తే దేశానికి మైక్రోఫిల్ములా వుంటుందయ్యా వూర్లో ఫాక్టరీ వుంది. సిమ్మెంటు, కెమికల్సు ఇన్ని సప్లయి చేస్తోంది. రెండు ఫర్లాంగుల దూరంలో వూర్లో సోడా దొరకదు. అందరూ డెవలప్మెంటు అని పాఠాలు చెప్తారు" అన్నాడు బాబు.

"అంతేను బాబూ! అయ్యాల ఆబాబూ ఇలాగే అన్నాడు"

"వేరే బాబా? ఎవరాయన?" అని ప్రశ్నిస్తే-

"అదేను బాబూ? అప్పుడప్పు డొచ్చి పిల్లల్ని కనకండి. కంటే వుద్యోగాలు దొరకవు. సీల్లు తాగికండి. పొదుపు సెయ్యండి అని సినిమాలు సూపిత్తాడు సూడు. అదేను బాబూ- ఎవ్వ్రాఆయన"

"డీ. పీ. ఆర్వోయ్"

"ఆఁ డీ. పీ. అర్ సారు. సినిమా కూడా తీత్తానన్నాడు" అని చంద్రయ్య చెప్తుంటే-

"నువ్వేనెయ్ అయాల సెడగొట్టింది" తమ ఊరు సినిమాలో పడే ఛాన్సు పోయిందన్న బాధ రంగయ్య గొంతులో బలంగా ఉంది.

"వోరెల్లెస్" నక్కుప్పుట్టి మూడాదివా రాలైంది, కోమటోడ్ని సొంటి అప్పులడిగిందని, నీకేటితెల్సురా. వూరుచూసినపుడ మాలపిల్లి సూడొద్దేట్రా - అందుకే సూపించినాను. మీకేటి తెల్సును గుంట ఎధవలు" అని రంగయ్యమీద విసుక్కున్నాడు.

ఒకనాడు ఆ ఊరికి డీ. పీ. ఆరో వచ్చి ఫాక్టరీ, రోడ్డు అన్నీ చూసేడు ఆయనకి పాత దుమ్ములగూడెం తెల్సు అక్కడి విశేషాల్చూసి ఎంతో సంబర పడిపోయి —

"గురజాడ అప్పారావుగారు 1915 లో చనిపోయినా, 1915 తర్వాతనే జీవించడం ప్రారంభించారు."

— దేవులపల్లి కృష్ణశాస్త్రి

"ఆహా! దుమ్ములగూడెం.ఎ రిమోట్ ప్లేస్! ఎంతగా డెవలప్ అయ్యిందీ- నో! నేనొదల్ను- ఇదంతా సిన్మాతీసి, అభివృద్ధీ అంటే ఇదనీ- దేశం ఎంత అభివృద్ధి చెందిందో చూడమనీ అందరికీ చెప్తాను" అంటే చంద్రయ్య డీపీఆర్వో దగ్గరకెళ్ళి-

"రండిబాబూ! కాస్త మజ్జిగపుచ్చుకుని వూరుకూడ సూద్దురుగానీ" అని లాక్కొచ్చేడు.

డీపీఆర్వో వస్తున్న దారిలో ఇళ్ళ మధ్యలోంచి మురుగునీరు కాలవలాగా పారుతోంది. స్థలం తగ్గిపోవడంవల్ల అసలే ఇరుకైన ఇల్లు మరింత ఇరుకైపోయేయి. ఈగలూ, దోమలూ ఝుంమని ముసురుతున్నాయి. ఇదంతాచూసి -

"అబ్బా! ఏంటోయ్ ఇది! పట్నంలో స్లమ్స్ కంటె అధ్వాన్నంగా వుంది.నేను రాలేను" అని వెనక్కెళ్ళి పోయేడు. మరి రాలేదు."

"మంచిపని చేసేవు చంద్రయ్యా ? దేశమంటే తొమ్మిది కుటుంబాలే అనుకునే వాళ్ళని మెత్తని చెప్పుతోకొట్టేవు" అని ఏదోమాట్లాడబోయి రోడ్డుచేరడంతో ఆపేసేడు.

"యీసురోమని మనుషులుంటే-దేశమేగతి బాగుపడునోయ్" దూరంగా స్కూల్లోంచి పద్యం విన్పిస్తోంది.

రోడ్డు దగ్గర పెద్ద భవంతి వుంది. దానికి 'ప్రజాహితా బార్ ఎండ్ రెస్టారెంట్' అనే బోర్డుంది.అందులోలోపాయికారీగా కాటసే డాన్సుంది. పట్టపగలు అక్కడ జనసమ్మర్దం వుంది.

"జీవితంలో సమస్యలు వచ్చినపుడు వాటిని ఎదుర్కొనేందుకు కొందరికి భయం. వాటిని తప్పించుకు తిరిగినంత మాత్రాన అవి తొలగిపోవు. కష్టాలను ధైర్యంతో ఎదుర్కొన్నప్పుడు ఆనందం కలుగుతుంది.

— గురజాడ

---

సోడా తాగి వచ్చేస్తుంటే అక్కడ బంగారయ్యకి తన మనవడు కనబడ్డాడు. వాడు తాతని చూసి దాక్కోబోయాడు కానీ బంగారయ్య చూడనే చూసేడు. వాడ్ని పట్టుకుని "ఎదవా బడికెళ్ళా అని పంపిత్తే బడికెల్లకంట ఇక్కడేటి సేత్తన్నావురా నువ్వు" అని వాడి వల్లు హూనం చేసేందుకు సిద్ధమైపోయాడు.

అప్పుడింకొకాయన బంగారయ్యను ఆపి కుర్రాణ్ణి బుజ్జగిస్తూ —

"ఏరా!ఇక్కడేం చేస్తున్నావు నువ్వు?"

"మరేమో. బార్లో అందరికీసిగరెట్టూ అగ్గిపెట్టె, సోడాలా అయ్యా అందిస్తే పావలా, అర్దరూపాయి ఇత్తారండీ."

"ఆ! ఇస్తే ఆడబ్బుల్తో ఏం చేస్తున్నావు?"

"సాయంత్రం సినిమా కెల్తాగా" అన్నాడు వాడు హుషారుగా—

"ఎదవా? నీకు సినీమాలు గావాల్రా. మీ అయ్యకానీ" అని బంగారయ్య దూకబోతుంటే ఆపి -

"రేపట్నుంచి ఈ పనలన్నీ మానేసి చక్కగా స్కూలు కెళ్తావా" అంటే —

"పావలా యిత్తే ఎల్తా" అన్నాడు వాడు.

"ఎదవా" అంటూ బంగారయ్య

తేచేడు. ఎంత గొడవవునోగానీ ఏడ్చుకుంటూవొస్తున్న పోలయ్యవల్ల కుర్రాడు బతికిపోయేడు —

పోలి నాయుడు మనవడికి జ్వరం. పట్నం తీసుకెళ్తే డాక్టరు బాబు చూసి మందులు రాసిచ్చేడు.

"చూడు నాయుడూ నీమనవడికి టీ.బీ, అంటే తెలుసా ? క్షయ. ఊపిరి తిత్తులు బాగా పాడయిపోయేయి. మంచిమందులు వాడాలి. బలమైన తిండిపెట్టు. చేప, మాంసం, గుడ్డు, పప్పు, పళ్ళు-అన్నీ పెట్టు" అన్నాడు. పోలయ్య గుండె గుభేలుమంది.

"అదేటి బాబూ! యింత సిన్నగుంటడికి భయ అంటావు. ఆడు సుట్టేనా కాల్చడు."

"చుట్ట కాల్చక్కర్లేదోయ్. అంతకి వెయ్యిరెట్లు, లక్షరెట్లు ఎక్కువ ఫాక్టరీ పొగ పీల్చడం లేదూ! అదిచాలు. ఇపుడు మీ వూళ్ళో అందరికీ వుంది. అదుగో దగ్గుతున్నావు. పరీక్ష చేయించు. నీకూ వొచ్చినట్టేవుంది. ఫర్వాలేదులే. మంచి తిండి, బలమైన తిండి తిను. మందులు వాడు. తగ్గిపోతుంది"అని పంపించేసేడు.

"బలమైన తిండెక్కడ సుబ్బరమన్నెం బాబూ!"అని కొత్తవ్యక్తికి నమస్కారం పెడ్తూ - "బాబూ! పాత్రీవోడిచ్చిన కూల్డబ్బులు తిండికే సాల్టంలేదు. బియ్యం కొన్నింటి కొనుక్కోవాలా. వుప్పు, వుల్లిపాయ, చింతపండు, మిరపగాయ అన్నీ కొనాలగదా! ఆసాముల భూముల్లోకూలికిపోతేఅడుక్కుంటే ఇంత పచ్చడిబద్దన్నా నంచుకు పెట్టేవోరు. ఈ పాత్రీవోడుపచ్చగడ్డికూడాతీసుకుపోకుండా గేటుకాడ జేబుల్డువుతాడు, దొంగలమైపోనాం బాబూ! ఇకను దెయ్యాలవడం ఒకటే తక్కువ" అంటూ ఏడ్చుకుంటూ వెళ్ళిపోయేడు.

అక్కడ అందరి హృదయాలూ బండబారినట్లయింది.

బాబు నడుస్తూ సుబ్రమణ్యంవేపుతిరిగి "ఏంటివ్వాళ తీరుబడిగా వున్నారు ?" అన్నాడు.

"తీరుబడి లేదండీ. ఫాక్టరీలో సమ్మె జరుగుతోంది.తెలుసుకదా! కొంతమందిని సమ్మెలో పాల్గోకుండా బెదిరిస్తోందియాజమాన్యం. ఆ విషయమై కొందర్ని కలవాలని వొచ్చా."

"ఓర్వలేమి పిశాచి-దేశంమూలుగులు పీల్చేసెనోయ్" గాలిలో పద్యం తేలివొస్తోంది.

"నవస్కారం సుబ్రమన్నెంబాబూ" అని ఎదురొచ్చిన మనిషితో ఏదో మాట్లాడుతూ వుండిపోయేడు సుబ్రమణ్యం.

ఫాక్టరీలో ఏదో ప్రమాదంజరిగిందట ఒకతనికి బాగా దెబ్బలు తగిలేయట. దారిఖర్చులేనా ఇవ్వకుండా పట్నంపొమ్మన్నాట్ట జీ. ఎం. అందుకే సుబ్రమణ్యం దగ్గర కొచ్చేరు వాళ్ళు.

"మళ్ళీ కలుస్తాను. మీరు నడవండి" అని అతన్తో వెళ్ళిపోయేడు సుబ్రమణ్యం.

* * *

వాల్‌చంద్‌కీ, సుబ్బిరెడ్డికీ, పరమ

---

మందగించక ముందు అడుగేయ్
వెనకపడితే వెనకేనోయ్

— గురజాడ

హంసకి లైసెన్సులిచ్చింది ప్రభుత్వం. వాళ్ళు పట్నంమీద వాలేరు. అందరికీ ఫాక్టరీలకి భూములు కావాలి. అంతభూమి కొనాలంటే ఆరిపోతారు. చదివిన ఎం. బి. ఏ. లు చంకనాకనా? ఎకరం కొంటే హెక్టారు కలిసిరావాలి. బంజరంటే బంగారం అన్నమాట. బంజరు ఎక్కడుందీ అని రికార్డులు తిరగేస్తే -

"దుమ్ములగూడెం"

ఆపూరంతా ప్రభుత్వ లెక్కల్లో బంజరే. అంతా మావిడితోటలూ,సపోటా చెట్లూను.

అందుకే ఆ పూరు మీద దాడిప్రారంభమైంది.

"పూసు స్పర్ధసువిద్యలందే-పైరములు వాణిజ్యంమదే" అని మేష్టారు చెప్తుంటే పిల్లలు అప్ప జెప్తున్నారు.

ఫక్కున నవ్వేడు పరమహంస ! ! వాణిజ్యంలో పైరాలేంట్రా బాబూ? పాత పద్యం.ఇప్పుడంతాసిండికేట్లు,'ఫిక్కీలు', ఎగ్రిమెంట్లు. పిచ్చిపంతులూ. పంచేసుకున్నాం మేం పూళ్ళు.అందుకే ఈపూరు నాది. ఇంకెవ్వడూరాడు."

నాయుడుతోట నలభై ఎకరాలూబంజర్లాగే పడుంది· అన్నదమ్ములు అల్లర్లుపడి అలాగే వొదిలేసేరు. సంరక్షణలేక కాపు ఆపేసింది. నా యు డు సంతతంతా పట్నాలు పట్టుకుపోయేరు. పూరోళ్ళంతా కాయూ, కంపా ఏరేసుకుంటున్నారనీ, చెట్టూ చేమా కొట్టేసుకుంటున్నారనీ తెగ ఇదై పోతున్నారు. అందుకేవాళ్ళు పరమహంసని కలిసి "తీస్కుకో, తీస్కుకో మా తోటలు తీసుకో."

"ఒకరిమేల్ తనమేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయ్"

—గురజాడ

"ఛస్. డబ్బులెట్టి భూములు కొంటే నేనేం కడతాను బుగ్గి. ఛో-పొమ్మన్నాడు మొత్తానికి ఎలాగైతేనేం ఒప్పందం కుదిరింది. నాయుడు తోటకి నలభై లక్షలు ఇవ్వడానికి, పక్కనున్న కాలవని కలిపి నలభై ఎకరాల బంజరూ ఆక్రమించడానికీ, పూరోళ్ళ భూములు చవగ్గాకొని పరమహంసకి అప్పజెప్పాలి.

చానాళ్ళకి నాయుడి కొ డు కు లు వూర్లోకి దిగేరు. ఒకడు లాయరు. ఒకరు కంట్రాక్టు.

బంగారయ్య, వెంకయ్య సొంత అన్నదమ్ములే. ఇద్దరికీ కలిపి నాయుడు తోటకి ఆనుకుని నాలుగెకరాలు భూముంది. ఒకనాడు నాయుడి కొడుకులిద్దరికీ కబురెట్టి -

"మావాఁ ! నా మాటినండి. చిన్నప్పట్నించీ దున్నుతున్నారీ భూమిని. ఏంబావుకున్నారు?కట్టుకోడానికి సరైన గుడ్డుందా? కడుపునిండా కూడుందా"

"నిజమే నాయుడా. కానీ బూవమ్మేసి ఎటుబోవాల? ఎలా బతకాల?"

"మావా ! ఏటినీపిచ్చిగానీ డబ్బు సేత లుండాల. గానీ దేనికిలోటు? మీకున్న రెండేసెకరాలూ పండితే మాత్రం కూలి బతుకు తప్పడం లేదుగదా!"

"నిజవే అనుకో"

"మరి ఇంకాలోసించకండి. ఎకరం పదివేలంటే కొనేవాడు లేడు పసూర్లో. అలాటిది ఎకరాని కిరపై వేలిస్తానంటు

"స్వంత లాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్"
—గురజాడ

న్నాడు. అంటే నలభై వేలు. బాంకులో ఏసుకున్నా నెలకి అయివొందలు వడ్డీ వొస్తుంది. హాయిగా బతకొచ్చు."

"సరే మనోల్తో ఆలోసించి సెప్తాం."

"ఓ. ఎస్. అలాగే చెయ్యండి. కాని ఏవో- ముక్కలో ముక్క కలిసిందనీ, మనోళ్ళనీ ఆరేటెట్టాను. అందరికీ ఆ రేటు మాత్రం పెట్టకండీ సుమీ"

"అలాగలాగే" అంటూ కదిలారిద్దరూ

* * *

బాబూ రైతులూ నడుస్తూంటే వెనక నించి కారొకటి సర్రున దూసుకుపోయి ఆగింది. అందులోంచి బిలబిలా మనుషులు దిగేరు. ఒకతను ఏవో మేపులూ అదీ చూపించి ఏవో చెప్తుంటే ఏమిటో చూద్దామని దగ్గరకెళ్ళేరు.

అక్కడ పొలాలన్నీ బీడు పడి వున్నాయి.

"చూడండి సార్! ఇవే ప్లాట్లు. కారు చవక. గజం నూటయాభై. టౌనుకి చాలా దగ్గర. అరగంట ప్రయాణం. ప్రశాంతమైన వాతావరణం. చూసుకోండి వాయిదాల పద్ధతి కూడా వుంది. తర్వాత మీరు యిళ్ళు కట్టుకోవాలనుకుంటే మేం లోన్లుకూడా యిప్పిస్తాం. చూసుకోండి."

అతను 'జనక్షేమా రియల్ ఎస్టేట్స్' తాలూకు మనిషట. ఫాక్టరీకి పోగా మిగిలిన భూమిని ప్లాట్లువేసి అమ్ముతున్నార్ట. అది పరమహంస అల్లుడిదేట. మాటలు అయినట్టున్నాయి. కారు బర్రున పోయింది,

"మావిడి చెట్టూ. చిలకలతోటీ ఏమని
పలికిందీ.
చిలకల్లారా చిలకల్లారా రండీ రం
డండందీ"

పిల్లలు చిలకల్లాగా ఎంత బాగా పాడుతున్నారు !!!

బాబూ, బంగారయ్యా కాళ్ళు కడుక్కుని చింతచెట్టు కింద మంచమేసుకూర్చున్నారు.

ఇంతలో "కక్కా" అనుకుంటూ వొక యువకుడొచ్చేడు.

"ఓహో! అయ్యా. వొచ్చినావా. కూకో" అని బంగారయ్య అతన్ని కుశలప్రశ్నలు వేసేడు.

"ఎక్కడా వుండడం?" అని ప్రశ్నిచేడు.

"చావులరేవుకి దగ్గరగా" అని అతను సమాధానం చెప్పేడు.

బంగారయ్య బాబువేపు తిరిగి -

"ఈడు మావోడేను బాబూ! ఈలకి ఒక ఎకరం ముక్కుండేది. పొలంలోనే సిన్నపా కేసుకుని అలావడుండీ వోరు పాక్టరీకి భూములమ్మేసినాక ముందుగా యిల్లునేకంటయ్యింది. అద్దిలకిల్లు దొరికీ వూరుకాదు. పోనీ ఎక్కడన్నా పాకేసుకుందావని సూస్తే జాగా అమిరిందికాదు. వునోళ్లల్లకే సాల్నేదు. మాలపిల్లి కాడ మనవనేక, సాకలి కొంపలకాడ సవ్వనేక మరిక నెలాగా ఇక్కడ బతుకునేదని పట్నం పోనాడు. ఆ బూమి డబ్బులు బేంకులేసేసి ఆ వొడ్డీతోనీ, పైనొచ్చిన కూస్త డబ్బులతోనీ కాలచ్చేపం సేత్తన్నాడు

అని ఆ యువకుడివైపు తిరిగి -

"పోనీ మళ్లీ ఓ ఎకరం ముక్క కొనీసుకోకూడదురా?" అన్నాడు.

"ఏటి కక్కా. నీ పిచ్చిగాని ఆ డబ్బులింకా కూకుడున్నాయంతా వేటి? పిల్లల కొంట్లో బాగోనేకపోతే ఎయ్యి రూపాయలయి పోనాయి. పాకేసుకోనాకి, ఎక్కడనుకుంటున్నావు? - మురికాక్కలువ మీద కాళీజాగాలో పాకేసుకోడానికి- ఎయ్యి రూపాయ లొదిలిపోనాయి. ఆ జాగాకి, ఆ పాక జాగాకి అద్దీ - నెలకి రెండొందలు కట్టాల. తీరామాసి కక్కా కూలిపని రోజూ దొరకదురా. ఇక్కణ్ణాక్కాదు. దానికి మేస్త్రీ వుంటాడు. ఆడికి మొక్కాల. ఆడికి వోటా యియ్యాల. అయన్నీ రాజకీయాలు. ఇకను ఇయ్యన్నీ పడనేవని నీ కోడలు నాలుగిల్లల్ల అంట్లు తోముతంది."

"అంట్లు తోము తందా. ఓరేమిగతొచ్చిందిరా? అయితేటీ డబ్బులేపాటీ మిగల్నేవేట్రా?"

"మానవాభ్యుదయంతో కూడిన సమాజాభివృద్ధిని వాంఛిస్తూ, అందుకు సాధనంగా విమర్శనాత్మక దృక్పథంతో సాహిత్యాన్ని మలచిన గురజాడ ప్రభావం, మొత్తం సమాజాన్ని దాని పునాదియైన ఆర్థిక వ్యవస్థ నుండి విప్లవాత్మకంగా మార్చుకోవటం మీదనే సకల జనాభ్యుదయం ఆధారపడి వుందన్న అవగాహనతో ఉపరితల సాహిత్యాంశాలను విప్లవీకరించి రచనలు సాగిస్తున్న నేటి రచయితల మీద అనివార్యంగా వుంది."

—కాత్యాయనీ విద్మహే

"ఏటి. ఏపాటున్నాయిగానీ కక్కా ఇక్కడమాత్రం సులువుగున్నాయేట్రా భూములు? ఎవుల్నడిగినా భూముల కిందమ్మితే ఏటొస్తాదిరా బుగ్గి - మన వూరు బలే దెవలప్పయి పోయింది. ఇల్లస్థలాలోల్ల కమ్ముతాం. నచ్చరూపాయి లిస్తారు అంటన్నారు" అని నిట్టూర్చాడు.

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పు కోకోయ్,
పూని ఏదైనాను గట్టిమేల్
కూర్చిజనులకు చూపవోయ్."

పిల్లలు గెంతుకుంటూ పాడుకుంటున్నారు.

o o o

రైతుల్ని భూములమ్మడానికి ఒప్పించడం అయ్యింది. కొత్తలయ్యేయి. పత్రాలయ్యేయి.

"ఎదో దేశానికింత చేద్దామని కానీ లేకపోతే ఈ కొండల్లో కోట్లు గుమ్మరించే ఖర్మ నాకేంటండీ" అంటాడు పరమహంస.

ఫాక్టరీ ప్రారంభానికి మంత్రిగారొచ్చేరు. పెద్ద వుపన్యాసం యిచ్చేరు. "మా పాలనలో దేశం ఎంతో అభివృద్ధి చెందింది. ఆహార ధాన్యాల వుత్పత్తి పదిరెట్లు పెరిగింది. బంజరు భూములన్నిటినీ వినియోగంలోకి తెస్తున్నాం. గ్రామాలు అభివృద్ధి అవుతున్నాయి. కొన్నాళ్ళకి గ్రామాలెంత స్వర్గాలవుతాయంటే ప్రజలంతా పట్టణాలు వొదిలి పల్లెలకే వొచ్చేస్తారు. బాబూ! మర్చిపోకండి! మళ్ళి మాకే వోట్లెయ్యండి. దేశం అప్పుల్లో వుంది."

"నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్."
పిల్లల పాటతో సభ ముగిసింది.

దుమ్ములగూడెంలో తోటల్లేవు. మడులన్నీ గదులయ్యేయి. గట్లన్నీ గోడలయ్యేయి. గెడ్డేమో రోడ్డయ్యింది. తాటిచెట్లు కొట్టేసి అంతపొడుగు పొగగొట్టాలు పెట్టేరు.

పిల్లలందరూ ఒక రోజు గుంటేబిళ్ళ ఆడుకుంటుంటే, ఫాక్టరీ క్వార్టర్సు దగ్గర బాబూల పిల్లలు చూస్తూ నించున్నారు.

"అలా సుత్తారేటి? రండి. ఆడుకుందారి" చనువుగా పిల్చేడు జనాలు.

"ఛీ! మట్టిలో ఆడుకోడవేంటి? బట్టలు మాసిపోతాయి" అన్నారు వాళ్ళు.

జనాలుకి ఆశ్చర్యం వేసింది. "అయితే మీరు ఆడుకోరా? మరి సాయింకాలం బడొగ్గిసినాక ఏటి సేత్తారు?" అని కుతూహలంగా ప్రశ్నించేడు.

"టీ. వీ. చూస్తాం. లేదంటే వీడియో గేమ్సు ఆడతాం" చెప్పేరు వాళ్ళు. అదేంటో చూడాలనిపించింది వాళ్ళకి. "మాకూ చూపించరా ప్లీజ్. ప్లీజ్" అని అరపై సార్లు బతిమాలించుకుని "సరే రండి" అని తీస్కెళ్ళి అందరికీ టీ.వీ. చూపించేరు. అది పట్టుకొంది పిల్లల్ని-

ఇప్పుడు-

ఎర్రటి ఎండలో బచ్చాలు ఆడేపిల్లలు, కబాడీ ఆడే పిల్లలు. కోకో ఆడే పిల్లలు, గోళీలాడే పిల్లలు, ఎగిరిదూకే పిల్లలు, కాలవల్లో ఈతలుకొట్టే పిల్లలు అందరూ టీ. వీ.ల దగ్గర చేరిపోతున్నారు. పెద్ద బాబులు విసుక్కుంటూ 'ఇదేం సంత'ని తలుపులు వేసేసుకుంటున్నారు.

పట్టాలు కొడుకు నర్సిగాడు 'ఆడొద్దురో నాయినా' అంటే వినక చెట్లమీదే వుండేవాడు. ఇప్పుడు టీ. వీ. కోసం అలా కిటికీకి అతుక్కుపోయి దాంట్లోలాగ సిగరెట్లు కాలుస్తాడు.

భూములు పోయిన వాళ్ళందరూ వుద్యోగాల కోసం గొడవ మొదలెట్టేరు.

"నాకంతా టెక్నికల్ వాళ్ళే కావాలి. ఎవరైనా వుంటే రండి. అర్హతని బట్టి ఇస్తా.లేదాఅవతలి ఫొండ"ని గెంటేసేడు పరమహంస.

బడే లేని వూళ్ళో టెక్నికల్ ఎక్కడ? అర్హత ఎక్కడని అల్లరిచేస్తే నాయుడి మనవడు, జనరల్ మేనేజర్ట-

"చూడు వెంకయ్యా! అందరికీ వుద్యోగాలివ్వడాని కిదేవన్నా ధర్మ సత్రమా? అర్హతలున్న వాడికిస్తానన్నాడు గదా! ముందు మీ పిల్లల్ని బాగా చదివించండి. అప్పుడు రండి. నా మాట విను. ప్రస్తుతానికి నువ్వు కూలీగా చేరు. గొడవ చేసేవనుకో, అదుగో చూడు పోలీసులు" అన్నాడు.

అప్పుడు పుట్టిందది 'ఫాక్టరీ వర్కర్సు యూనియన్.'

o o o

చుక్కలు పొడిచేయి. పనులు పూర్తి చేసుకుని ఒకరూ ఒకరూ చేరుతున్నారు.

బాబు పేరు పేరునా పల్కరించి కూచో బెడుతున్నాడు.

ఒక గంట గడిచేక-

అందరూ వచ్చేరని తీర్మానించుకుని, మీటింగ్ మొదలుపెట్ట బోతుంటే-

"స్వంతలాభం కొంతమానుక పొరుగు వారికి తోడుపడవోయ్" అనుకుంటూ వచ్చేడు అరవిందం మాష్టారు. బాబు మేష్టారుకి నమస్కారం చేసి కూర్చొ మన్నాడు.

"ఏంటి మేష్టారూ విశేషాలు?" అంటే-

"పిల్లలెవరూ చదువులకి రావడం లేదు" అన్నాడు.

"ఏవయ్యా! ఎందుకు పిల్లల్ని బడికి పంపటంలేదు" జనాంతికంగా అడిగేడు బాబు. ఎవరూ మాటాళ్ళేదు. గట్టిగా గద్దించేసరికి అక్కడ రణగొణ ధ్వనులు ప్రారంభమయ్యేయి. అంతా వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకోవడం మొదలు పెట్టేరు.

"ఏం? ఎవరూ మాట్లాడరేం?" అని మరోసారి అడిగేసరికి-

సింహాచలం లేచి విడిపోయిన జుట్టుని ముడేసుకుంది.

"బాబూ! ఇక్కడందరూ మొగోళ్ళున్నారు. పెద్దలున్నారు. ఆడదాని మాట అని కొట్టి పారీకండి. నాన్నెప్పేదినండి." అనేసరికి అందరూ సింహాచలం వైపు ఆశ్చర్యంగా తిరిగేరు.

"బడికి ఎందుకు పంపట్లేదని అడుగుతున్నారు. ఎలాగ పంపడం బాబూ! ఇన్నాల్లా-వుడుపుకో, నూర్పులకో, గాబు తీతలకో, పంట కోతలకో కూలికి పోతే పాలుతాగే పిల్లల్ని సంక నేసుకు పోయే వారుం. ఈప్యాక్టరీకూల్చొచ్చినాక పిల్లల్ని కాదుకదా పూచిక పుల్లయినా అటుదిటు, ఇటుదటు పోనీడు. బాబూ! సంటిపిల్లల్ని

అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలె నోయ్
—గురజాడ

సూసుకోడానికి ఒక పిల్ల యింట్లో వుండి పోవాలగదా! అయ్యా, ఇదివరుకు ముసిలీ, ముతకా ఇంట్లుండి జేపిలొచ్చి సట్టిల మూతెట్టేకండా సూసేవోరు. అంతేగానీ ఆలు దొంగల్ని కాయనేరు బాబూ!"

"ఈ ప్యాక్టరీ వొచ్చినాక పట్టపగలు దొంగతనాలు పెరిగిపోయేయి. అందుకని ఒక పిల్ల ఇంటికి కాపలా వుండిపోవాల కదా బాబూ! ఇన్నాలా కూలి పనికెళ్తే సల్దులు తినేసి, అంబల్లొట్టుకు పోయే వోరుమి. ఒక సిటం ఆల్చమైనా నవ్వుతానో, కోపంగానో రెండు తిట్టేవోరు కానీ కడుపు కొట్టేవోరుకాదు. ఇప్పుడు ప్యాక్టరీ కూర్చొచ్చినాక ఏడో గంటకి-అది 'బొఁయ్'మని కూసేసరికి గేటు కాడుండాల. ఒక చణం ఆల్చమైతే. 'అవ్వీంటు ఏస్సేం పొమ్మంటన్నారు. 'సల్దులేలా - అంబలేలా' అనితప్పితే గంటులెక్క మాకు తెల్దు. మావే తిళ్ళు తిండం నేదు. ఇక గుంటల కేపెడతాం? ఆలు తిని బడికెల్తారు బాబూ? ఇగను మొగ్గుంట లున్నారంతే- ఇన్నాళ్ళు మొగోళ్ళ ఆళ్ళని బరిలోన వొదిలేసి వొచ్చేవోరు. ఇప్పుడు మొగోలూ మాతోనే వొచ్చేస్తే, స్కూలేమో ఎనిమిదికి. ఆల్లని ఎవురు పంపుతారు బాబూ? పోనీ ఎల్దామన్నా ఈ టీ. వీ. లొచ్చి సినిమాలమీద సినిమాలు - ఇక నాలేపెల్తారు బాబూ!"

అని కురిసిన మేఘం అలిసినట్టుగా ఆగి చుట్టూ చూసి "పోనీ పొద్దోయొచ్చి

మతం వేరైతేను ఏమోయ్
మనసులొకటై మనుషులుంటే -
— గురజాడ

నాక ఈలు బరిశేళ్ళినరో నేదో అడిగే ఓపిక వుండక్కేదు బాబూ!" ఇన్నాలా పొలంలోన ఎర్రెండలోన పనిచేసినా సాలొచ్చేదికాదు. పనీపాటా అన్నట్టు సర్దాగా పాడుకుంటా, నవ్వుకుంటా సేసే వోరిమి. ఆసాములు కూడా అర్ధా,పావలా ఇచ్చి మాచేత పాడించీవోరు బాబూ! పని సురగ్గా అయిపోద్దని. అద్దిగటు సూడండి, ఆ మరిడమ్మా ఇప్పుడంటి లాగయిపోనాది గానీ,అది'తుమ్మిదా'అన్ని ఎత్తిందంటే వచ్చులు ఆగి సూసేయి బాబూ! ఈ ప్యాక్టరీలోన ఒక ఆటలేదు, పాటలేదు, మాటలేదు. 'వూఁవూఁ' అని అరిగోస. ఆ గోసలోన వుండే, ఆ వేడిలోన వుడికీ, వుడికీ ఇంటికొచ్చే సరికి పానం సాలొస్తంది బాబూ! దెయ్యాల్లాగ రాత్తుర్లు పనిచేసి పగలు పడుకునేసరికి, జీవు దెగిరిపోయినట్టు, రక్తం ఆర్సుకు పోయినట్టు కాల్లు పీకే త్తుంటే ఇక నేటడగమంతారు బాబూ!" అని బతుకులోని రొష్టంతా ముప్పిరిగొని వుక్కిరి బిక్కిరి చేస్తే, మరి మాట్లాడలేక కళ్ళు తుడుచుకుంటూ కూర్చుండి పోయింది.

వురుములు మెరుపుల్తో వర్షం పడ్డ తర్వాతలా అక్కడ నిశ్శబ్ద బీభత్సం. మొదటగా తేరుకున్న బాబ్జే, ఇది సమయం కాదని "ఆలస్యం అయిపోయింది. రేపు మాట్లాడదాం" అని లేచాడు.

రేడియోలో వార్తలు -

"దేశం ఎంతో అభివృద్ధి చెందిందని ప్రధానమంత్రి చెప్పేరు. ఆహార ధాన్యాల వుత్పత్తి ఇన్నిరెట్లు పెరిగిందనీ, పరిశ్రమల సంఖ్య గణనీయంగా పెరిగిందనీ, పారిశ్రామికోత్పత్తి మరిన్నిరెట్లు పెరిగిందనీ చెప్పేరు. పరిశ్రమల స్థాపనవల్ల ఎన్నో లక్షలమందికి వుపాధి దొరికిందన్నారు. ఇవన్నీ మన మట్టిలో మాణిక్యాలని చెప్తూ ఆయన దేశం ఇంత అభివృద్ధి చెందడానికి కారణం తమ విధానాలే నన్నారు...."

"దేశం సంగతేమో గానీ మేపై తే దుంపనాశనమైనామయ్యా" అన్నాడు బంగారయ్య.

"దేశమంటే మట్టికాదోయ్-దేశమంటే మనుషులోయ్" మెల్లిగా సణక్కోకుండా బోయి గట్టిగా అరిచేడు అరవిందం.

"దేశమంటే మనుసులోయ్. దేశమంటే మనుసులోయ్" చుట్టూ వున్న ప్రజలు ఒక్కరిగా పలికేరు నినాదంలా.

o o o

ఆ రోజు ఫాక్టరీలో అందరికీ స్వీట్లు పంచుతూంటే ఎందుకనడిగేరు. ఫాక్టరీకి బోలెడు లాభాలొచ్చేయిట.

"ఈ ఫాక్టరీ యింత తొందరగా ఇంత దెవలప్పవుతుందనుకోలేదు"ట.

"అందుకే పక్కనే మరో కెమికల్సు ఫాక్టరీ కూడా పెడతారు"ట.

"అయితేటి మా జీతాలు పెరుగుతాయా?" అనడిగేడు వెంకయ్య. దానికి ఒక వెర్రినవ్వు నవ్వి చేతిలో మరో స్వీటు పెట్టి పొమ్మనీసేరు.

సాయంత్రం కార్మికులంతా సుబ్రి

మహ్యాన్ని చుట్టుముట్టేరు.

"పాట్రీకి లాబాలొచ్చినాయంట- మా జీతాలు పెరగవా?"

"పెరగవు".

"కట్టుకోడానికి ఓ జత గుడ్డముక్క లన్నియ్యిరా?!"

"ఇయ్యరు".

"మమ్మల్ని పర్మినింటు సేత్తారా" ?

"చెయ్యరు. చెయ్యరు".

"ఇదేం గోరం బాబూ! పాట్రీకి అన్ని లాబాలు వొచ్చేయంటున్నారు. అందులో పట్టెసేవోల్లమి. మాకియ్య కంట ఏటి సేత్తారు?"

"ఆ ఫాక్టరీ యజమాన్లు - అదే పరమహంసా - అమెరికా వాడూ పంచుకుంటారు" సుబ్రమణ్యం వివరించేడు.

మధ్యలో అమెరికా వాడెవడో అర్థం కాలేదు షేక్ చిన్న మీరాకి. అదే టంటే-

"మీరా - అసలు మీరు పనిచేసే ఫ్యాక్టరీలోనున్న మిషన్లు ఎక్కడివో మీకు తెలుసా?" అనడిగేడు సుబ్రమణ్యం. ఇనుము వేడెక్కుతోంది, రెండు దెబ్బలేస్తే కక్కులు కోయ్యొచ్చు అనుకుంటూ-

"మాకేటి తెల్సు బాబూ! సదువు రానోల్లం".

"వూ. ఆ మిషన్లు అమెరికా నించీ, ఇటలీ నించీ తెచ్చేరు. అంటే వాళ్ళు పెట్టుబడిగా ఇచ్చేరన్నమాట. మరి పెట్టుబడి పెట్టిన వాడికి లాభాల్లో వాటా ఇయ్యాలి కదా" సాలోచనగా ఆగేడు సుబ్రమణ్యం.

"అయితేటి ఇక్కడొచ్చిన లాబాలు

---

దేవుడెవడో దాగెనంటూ
కొండా కోనల వెతుకులాడేదేలా ?
కన్ను తెరచిన కనబడదో ?
మనిషి మాత్రుడియందు లేడో?"

—గురజాడ

---

అమిరికావోడు ఎగరేసుకుపోడమే?!"

సుబ్రమణ్యం తలూపుతుండగానే-

"అయితేటండి. ఇక్కడి నేల. ఇక్కడి సున్నం. ఇక్కడి నీల్లు. ఇక్కడి మడుసులు. ఇయ్యన్నీ కలిసి-లాబాలొత్తే అయ్యి ఆడెవుడో అమిరికా వోడొచ్చి ఎగరేసుకుపోతాడా? తినీ తినకా పొద్దిటి కాడ్నించి మాపిటిదాకా మాఁవ్ పాటొడ్డవేటి? బూములమ్మిసి బికారులమై పోడవేటి? ఆడు చివార్నొచ్చి సంచులు సంకనెట్టు కెలిపోడవేటి? కాదు. ఏటండిదీ...." వెంకన్న ఆవేశాన్ని సుబ్రమణ్యం పోగుచేస్తున్నాడు.

o o o

అప్పల్నాయుడికి వూపిరాడక లేచి కూర్చున్నాడు. ఎగూపిరే కాని, దిగూపిరి లేక బాధ పడుతున్నాడు.

సామ్యూల్‌కి మెదడంతా బిరుపెక్కినట్టుంది.

కొండయ్యకి ఖళ్ళున కక్కడంతో తెల్లవారింది.

"అబ్బా! మళ్ళీ పొగొదిలీసినట్టు గున్నాడు మాయదారి పాటీవోడు" అనుకుంటూ మండిపోతున్న ముక్కునీ, నీళ్ళ ధార కడుతున్న కళ్ళనీ తుడుచుకుంటూ బయటికొస్తే, బయట నల్లగా వుంది. వేడిగా వుంది. అగ్గిలాగ మంటగావుంది.

వూరంతా కకావికలుగా పరిగెడు

తోంది' "పారిపో, పారిపో, "దారియ్యేస్. అమ్మ - కాలిరిగి పోయిందిరా." కేకల్తో భీభత్సంగా వుంది.

పోలయ్య మనవడికి వూపిరాడ్డం లేదుట. పది నిముషాలకోసారి భళ్ళున కక్కుతున్నాడు. పావుగంటకోసారి విరోచనం అయిపోతోంది.

డాక్టరు దగ్గరకి పరిగెట్టేరు - ఆసుపత్రిలో మందులు లేవు.

"బాబూ! నా కొడుకుని బతికిచ్చు బాబూ" ఖళ్ ఖళ్న దగ్గుతూ తల్లి వేడుకుంటోంది.

సెలైన్లూ, ఆక్సిజన్లూ పెట్టేరు. "నాకు చేతనైంది చేస్తున్నాను. మాట మాత్రం దక్కదు" అని డాక్టరు, కుండ బద్దలు కొట్టేసేడు.

ఆసుపత్రి నిండా వరదలా మనుషులే. కళ్ళు మంటలు, నీళ్ళు కారడం, వాంతులు, విరోచనాలు, కడుపు నెప్పి.

సన్నాసమ్మ-తొమ్మిదినెల్ల గర్భిణీ-స్పృహ తప్పింది - వూపిరందడం లేదు.

అరగంటలో ఆసుపత్రి రణరంగమైతే, డాక్టరుకి ఎవర్ని చూడ్డానికి ఖాళీయే దొరకడంలేదు.

ఊపిరందక, కాలూ చెయ్యీ కదలక, కళ్ళలోంచి నీళ్ళు ఆగక, 'ముక్కులో మంట' అని ఏడుపు ఆపక,

వాంతుల్తో పేగులు చుట్టుకుని,

విరోచనాల్తో కడుపు గోకేసి,

కెమికల్సు నిండిన వూపిరితిత్తులు పని చెయ్యక,

కాలూ కాలూ మెలి తిరిగిపోయి, డొక్కలు ఎగరెయ్యలేక,

'వొద్దురా బాబూ ఈ యాతన, ఇంత కంటె చావు నయం' అనుకుంటున్నప్పుడు-

పిల్లాడిక యుద్ధం చెయ్యలేక అలిసిపోయేడు. తల్లి ఘొల్లుమంది.

"అయ్యా నిప్పురా అంటే వొట్టు కొచ్చీవోడ్రా" అని తండ్రీ,

"తాతా! పావలా ఇయ్యరా పప్పుండ కొనుక్కుంటా అని నన్నెవలడుగుతార్రా?" అని తాత,

బతుకునించి ఏవీ ఆశించనివాడు, స్ట్రయికు చెయ్యనివాడు, నినాదాలివ్వనివాడు, హక్కులడగని వాడు, ఏ పార్టీలోనూ సభ్యుడు కానివాడు-

గాలి పీల్చి-గాలిలో కలిసిపోతే, అక్కడందరూ కదిలిపోయేరు.

వల్లకాడవ్వబోతున్న ఆసుపత్రిని చూసి అందరి గుండెలూ భగ్గుమన్నాయి.

"అమ్మ నా కొడకల్లారా! దేశబత్తులం అన్నారు. దేశం కోసం ప్యాక్టరీలన్నారు. బూములమ్మండి అని అమ్మించీసుకుని, మమ్మల్ని బూముల్లేని బికారుల్ని సేసి, గూడులేని పచ్చుల్ని సేసి, కూలీల్ని సేసి, దొంగల్ని సేసి, పకీరుల్ని సేసి: మీరు మేడల్లేపేసేరు. సరే! వొల్లకున్నాం. మెల్లిగా ఓర్చుకున్నాం. ఎప్పుడు మా పొలాల్లోకి మీ మురుగంతా వొగ్గీసి, పొలాల్ని వొల్లకాడు సేయిస్సి, సివరికి

---

మతం వేరైతేను ఏమోయ్
మనసు లొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయ్

—గురజాడ

గాల్లోకి యిసం వొదిలీసి, మీ మైలంతా మా మొకం మీద బోస్సీ మా పేణాలు తీసేత్తార్రా - వారే ఇకను మిమ్ముల్నొద లమురా...."

పోలయ్య అరుచుకుంటూనే జనాన్ని కూడగడుతున్నాడు. పైడయ్య కర్రలు పోగుచేస్తున్నాడు. బాబు జెండా పట్టు కున్నాడు.

"మురుగునీరు అరికట్టాలి"!

"పంటల్ని రక్షించాలి"!

"కాలుష్యం నివారించాలి"!

"పంటలు పోయిన వాళ్ళకీ, ప్రాణాలు పోయిన వాళ్ళకీ పరిహారం చెల్లించాలి!"

"మంచి గతమున కొంచెమేనోయ్ మందగించక ముందుకడుగెయ్!"

అంటూ అరవిందం మేష్టారు పరిగెడుతూ వస్తున్నాడు.

o o o

ఫాక్టరీగేటు దగ్గరకార్మికులునిశ్శబ్దంగా కూర్చుని వున్నారు. వాళ్ళ నోళ్ళకి గుడ్డలు కట్టుకున్నారు.

"దెబ్బలు తగిలిన తంగవేలుకి వైద్య సహాయం అందించాలి!"

"ప్రమాదాల్లో మరణించిన కార్మికుల కుటుంబాలకు పరిహారం యివ్వాలి"!

"జీతాలు పెంచాలి"!

అని రాసిన అట్టలు పట్టుకుని కూచు న్నారు.

అక్కడ సముద్రం నిద్రోతున్నట్టుగా వుంది. నిశ్శబ్దంగా వుంది.

ఇంతట్లో ముందు నుంచి పోలీసు లొచ్చేరు. వెనక నించి గూండాలొచ్చి పడ్డారు.

"వొట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్" —గురజాడ

---

వురుములేని పిడుగులాగ, గాలిలేని వానలాగ కార్మికుల వొంటిమీద లాఠీలు విరిగేయి. కడుపుల్లో కత్తులు దిగేయి. మీరా చెయ్యి విరిగింది. నారాయణకి నడుం విరిగింది. శామ్యూల్‌కి పేగులు బయటికొచ్చేయి.

శబ్దాన్ని శాసించేరు సరే- నిశ్శబ్దం
మీద నిఘా వేసేరా!?
నినాదాన్ని నిషేధించేరు సరే,
నిప్పుల మీద వుచ్చ పోసేరు సరే,
బయళ్ళు జెయిళ్ళు జేసేరు సరే,
మీ చట్టాలు మీరే కాల్చుకుంటారా!

ఇప్పుడక్కడ బీభత్సంగా వుంది. సముద్రం గ్రామాల్ని మింగేసినట్టుంది- అమ్మాయి ఇంటిముందు ముగ్గేసుకుం టుంటే, పశువులొచ్చి కుమ్మేసినట్టుంది-

బీడీలు కాల్చుకుంటూ పోలీసులు వెళ్ళి పోతే, కారా కిళ్ళీలు వుమ్ముకుంటూ గూండాలు పారిపోయేరు-

రక్తం మడుగులోంచి తేల్తున్నట్టు యాదగిరి కింద నించి లేచొచ్చి - వెన కాల నిలబడి చూస్తున్న జీ. ఎం. నీ, పరమహంసనీ పట్టుకున్నాడు, సుబ్ర మణ్యం, యాదగిరే అడ్డంపడి దెబ్బలు కాయకపోతే

సుబ్రమణ్యం ఈ సరికి శవమై యుండును - ఈ కథ కిక్కడ కామా వుండును.

(వసీరా, అరణ్యకృష్ణలకి కృతజ్ఞతలతో)

# విద్యార్థుల ఆందోళనను బలపర్చండి

## అవినీతి, ఆశ్రిత పక్షపాత, నిరంకుశ జనార్దన్‌రెడ్డి ప్రభుత్వ విధానాలను ఖండించండి !

**- అరుణోదయ పిలుపు**

ఐ.యం.ఎఫ్, వరల్డ్ బ్యాంక్ ఆదేశాల ప్రకారం రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు పేద, మధ్య తరగతి వర్గాలను ఉన్నత విద్యనుండి దూరం చేసేవిగా ఉంటున్నాయి. దాని పరాకాష్టగా కాపిటేషన్ ఫీజులతో వైద్య, ఇంజనీరింగ్ కళాశాలలను సారా కాంట్రాక్టర్లకూ, రాజకీయ దళారీలకూ, పెద్ద వ్యాపారులకూ ప్రభుత్వం అప్ప చెబుతోంది. రాష్ట్ర ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా వైద్య విద్యార్థులతో ప్రారంభమై మొత్తం విద్యార్థి లోకానికి విస్తరిస్తున్న ఉద్యమాన్ని "అరుణోదయ" సంపూర్ణంగా, మనస్ఫూర్తిగా బలపరుస్తోంది.

జనార్దనరెడ్డి ప్రభుత్వం గెలాక్సీ గ్రానైట్ దగ్గరనుండి తీరప్రాంత భూములు సంపన్న పెత్తందారీ వర్గాలకు కట్టబెట్టడం దాకా; రోజువారీ లాటరీలకు అనుమతినిచ్చి జూద మనస్తత్వాన్ని పెంచడం దగ్గరనుండి అశ్లీల, హింసాత్మక సినిమాలూ, సాహిత్యాలకు పూర్తి అవకాశాలను కల్పించడం దాకా అవినీతి, ఆశ్రిత పక్షపాతాలతో ప్రజా వ్యతిరేక విధానాలను అమలు జరుపుతోంది. దళితులను హత్య చేసిన వారిని కాపాడుతోంది.

న్యాయమైన ప్రజాపోరాటాలను క్రూరంగా అణచివేయటానికి పోలీసు, సాయుధ దళాలపై ఆధారపడుతున్నదీ ప్రభుత్వం. పీపుల్స్ వార్‌ను నిషేధించిన దగ్గరనుండి రోజుకొక్కటైనా తగ్గకుండా బూటకపు ఎన్‌కౌంటర్ చేసి, కనీస పౌర హక్కులను కూడా క్రూరంగా అణచివేస్తున్నది. నక్సలైట్ల సాకుతో సామాన్య ప్రజలపై ఇనుప బూట్లతో, సన్నీలు బుల్లెట్లతో విరుచుకు పడుతోంది. రాష్ట్ర ప్రభుత్వ అణచివేత-అవినీతి విధానాలకు వ్యతిరేకంగా వివిధ వర్గాల ప్రజానీకం సాగిస్తున్న ఆందోళననూ, పోరాటాలనూ "అరుణోదయ" బలపరుస్తోంది.

"మరో మార్కోస్" జనార్దనరెడ్డి ప్రభుత్వం పరిపాలించే అర్హతను కోల్పోయి, ప్రజల యొక్క నిరసనను ఎదుర్కొంటోంది. రాష్ట్ర ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా సాగుతున్న విద్యార్థుల, కార్మిక, కర్షక, మేధావుల నిరసననూ, ఆందోళననూ తీవ్రతరం గావించడానికి విప్లవ సాంస్కృతిక శక్తులూ, కళాకారులు చురుకుగా కదిలి రంగంలోకి రావల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

రామారావు,
రాష్ట్ర ప్రధాన కార్యదర్శి,

అరుణోదయ
(సాంస్కృతిక సంస్థ)

దివికుమార్,
రాష్ట్ర అధ్యక్షులు.

# గురజాడ(కన్యాశుల్కం) - జాతీయోద్యమం

— వి. రామకృష్ణ

"నేనమితమైన మితవాదిని, మితమైన తీవ్రవాదిని" అని గురజాడ తన గురించి చెప్పుకొన్నాడు. మద్రాసులో 1903 లో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభలకు స్వయంగా హాజరయిన గురజాడ ఆ తర్వాత రాసిన వ్యాసంలోని వాక్యం యిది. దీన్నిబట్టి గురజాడ ఖచ్చితంగా జాతీయవాదే. అయితే ఎలాంటి జాతీయవాది ? జాతీయోద్యమం, జాతీయవాదులు, అంతా అవిభాజ్యమైన అఖండ విషయాలు కావు. జాతీయోద్యమంలో ఎన్ని దశలున్నాయో, జాతీయవాదుల్లోనూ అన్ని శాఖలున్నాయి. నిజానికి, 1885 కు ముందే జాతీయోద్యమ బీజాలు భారత దేశంలో మొలకలెత్తాయి. ఇది ప్రారంభదశ అనుకొన్నా, ఆ తర్వాత స్థూలంగా మితవాద, అతివాద, ప్రజాయుగ దశల్లో జాతీయోద్యమం కొనసాగింది. ఈ దశలు అప్పటి ఉద్యమ లక్ష్యాలు, పోరాట పద్ధతులు, సామాజిక పునాదిపై ఆధారపడి నిర్ణయించినవి. మితవాద దశలో అతివాదులున్నారు. అలాగే అతివాద దశలోనూ మితవాదులున్నారు. అంతేకాక 1908 నుండి ప్రారంభమైన విప్లవ (Terrorist) దశకు అంకురార్పణ మహారాష్ట్రలో 19 వ శతాబ్దపు ఆఖరి దశకంలో జరిగింది.

చాపేకర్ సోదరులు ఆంగ్లేయ అధికారులను చంపడం దీనికి దృష్టాంతం. అందువల్ల గురజాడ అతి జాతీయవాదా లేక మిత జాతీయవాదా అన్నది ముఖ్యమైన చర్చనీయాంశం కాబోదు.

అసలు ప్రశ్న, యింతవరకు అనేక చర్చల్లో లేవనెత్తినది, గురజాడ జాతీయవాదేనా ? అన్నది. చరిత్ర రచనలో ఘటనలను, వ్యక్తులను, వారి భావజాలాన్ని, విధానాలను విశ్లేషిస్తున్నపుడు నేడు మనకున్న చారిత్రక దృష్టితో, పద్ధతులలో, పనిముట్లతో బేరీజు వేస్తాం. ఇది సరైందే! కానీ, వీటితోపాటు, చరిత్రకారుడికి ఉండాల్సిన మరో ముఖ్య దృష్టి, ఆనాటి చారిత్రక, ఆర్థిక, సామాజిక, నేపథ్యాన్ని గమనంలో ఉంచుకోడం. ఆ నేపథ్యంలోనే అప్పటి ఘటనలను, వ్యక్తులను అంచనా వేయాలి. అప్పటి సామాజికస్థాయి, స్థితిగతులు, చైతన్యం, ముఖ్యంగా గణించుకోవాల్సిన అంశాలు. ఇవే చరిత్ర రచనకు ఊపిరి. గురజాడ జాతీయోద్యమ పాత్రను ఈ దృష్టితోనే చర్చించాలి.

గురజాడ 19 వ శతాబ్దం ఉత్తరార్థంలో (1862) పుట్టి పెరిగాడు. అప్పటికీ జాతీయోద్యమం అంటూ లేదు. ముందే చెప్పినట్టు జాతీయభావాలు, బీజమాత్రంగా సమాజంలో వ్యాపించి ఉన్నాయి. 1857 వరకు కేవలం బ్రిటిషు వ్యతిరేక పోరాటాలుగానే ఉన్న పరిస్థితి, క్రమేపి వలసవాద వ్యతిరేకతగా మారుతూ వచ్చింది. దీనికి కారణాలు ఎన్నో ఉన్నా, ముఖ్యంగా చెప్పుకోవాల్సినవి రెండు. 1857 తర్వాత వలసవాదపు పెట్టుబడిదారీ దోపిడీ సామ్రాజ్యవాదంగా మారింది. మన

దేశంలో వారి దోపిడీ విధానం యిబ్బడిముబ్బడిగా పెరిగింది. భారతీయుల ఆర్థిక ప్రయోజనాలకు, బ్రిటిషువారి అవే ప్రయోజనాలకు మధ్య వైరుధ్యం పదునైంది. మరో ముఖ్య కారణం, అతి కీలకమైన ఈ వైరుధ్యాన్ని, అప్పటికే తలెత్తిన మధ్యతరగతి విద్యాధికవర్గం గుర్తించింది. సమాజంలో జరుగుతున్న దోపిడీ, దాని గుర్తింపు (**Objective and Subjective factors**), ఈ రెండూ జాతీయభావాలకు రూపునిచ్చి ఉద్యమంగా తీర్చిదిద్దాయి. సరిగ్గా యిదే కాలంలో గురజాడ పరిణత మనస్కుడవుతున్నాడు. కవిగా, నాటకకర్తగా అప్పుడప్పుడే గుర్తింపు పొందుతున్నాడు. తాను స్వయంగా సంస్కర్త కాకున్నా, సంస్కరణోద్యమ లక్ష్యాలకు మద్దతు యిచ్చి తన రచనల ద్వారా వాటికి తోడ్పడ్డాడు. 19 వ శతాబ్దంలో భారతీయ మేధావులు చేసిన గొప్ప కృషి యిది.

దేశంలోని అన్ని ప్రాంతాల మేధావులు అప్పటి 'సాంస్కృతిక పునరుజ్జీవనం'లో భాగస్వాములై భారతీయ సమాజాన్ని ఆధునిక యుగంవైపు నడిపించారు. దేశభాషల్లో సాహిత్యం అనేక కొత్త ప్రక్రియల్లో సృష్టింపబడింది. ఈ పెనుమార్పుకు సామాజిక చట్రంలో వచ్చిన పరిణామాలే కాక, ఆంగ్ల విద్యా, పాశ్చాత్య సంస్కృతీ ప్రభావం ఎంతో ఉంది. దీన్నే గురజాడ "ముత్యాల సరములు" అన్న గేయంలో 'చదల చీకటి కదలబారెను', 'మేలుకొలుపులు కోడి కూసెను', అని చెప్పడమే కాక, ఆంగ్ల విద్యా ప్రభావం 'పుట్టకిట్లు' కదల్చినట్టుగా చెప్పాడు. దీని అర్థం ఫ్యూడల్ నాగరికత స్థానంలో బూర్జువా ప్రజాస్వామ్య నాగరకతను గురజాడ ఆహ్వానిస్తున్నాడు. కొత్త నాగరకత అప్పటి కాలానికి అభ్యుదయకరమైన మార్పే. ముందడుగే. ప్రజాస్వామ్య, ఉదారవాద భావాలు అందులో ఉన్నాయి. అయితే, ఆ నాగరికత లోనూ క్రమేపీ వైరుధ్యాలు ఆరంభమై తర్వాత దశమైన సామ్యవాద ప్రజా సంస్కృతి లేక శ్రామిక వర్గ సంస్కృతికి దారితీస్తుంది. వలసవాద పెత్తనం ఆంగ్ల విద్యాధికులు నిర్మించే ఉద్యమం అంతమొందిస్తుందన్న విషయాన్ని గురజాడ సూత్రప్రాయంగా "జాతి బంధములన్న గొలుసులు జారి"పోతాయన్నట్లు చెప్పాడు. ఆంగ్ల విద్యచే ప్రభావితమైనవారే జాతీయోద్యమానికి ప్రేరణ కల్గిస్తారు. అనేక వలస దేశాల్లో జరిగిందిదే. ఆంగ్ల విద్యా ప్రభావాన్ని అతిగా అంచనా వేయడం ఎంత పొరపాటో, తక్కువ అంచనా వేయడం కూడా సరైంది కాదు. 19 వ శతాబ్దపు మేధావులందరూ దేశభాషల అభివృద్ధికి తోడ్పడేటట్లు కృషి చేశారు. రచనలు గావించారు. అయినా వీరందరూ భారతీయ సమాజంపై ఆంగ్ల విద్యా ప్రభావాన్ని నొక్కి వక్కాణించినవారే. జాతీయభావ ప్రచార కర్తవ్యాన్ని, భాషా పరంగా తమ రచనల్లో గావించి, సంస్కర్తలూ, మేధావులూ జాతీయోద్యమానికి పునాది వేశారు. జాతీయోద్యమ ఆవిర్భావంలో యిదొక కీలకదశ. ఏ ప్రజాస్వామ్యానికైనా భావపునాది భావ విప్లవం అవసరం. ఈ చారిత్రక కర్తవ్యాన్ని చాలమటుకు 19 వ శతాబ్దపు మత, సాంఘికోద్యమాలు నిర్వహించాయి. జాతీయోద్య

మానికి పూర్వ రంగంగా నిల్చాయి.

గురజాడలాంటి సృజనాత్మక రచయితలు, అటు సాంస్కృతికోద్యమంలో భాగంగానూ, యిటు జాతీయోద్యమంలో కూడా పాలుపంచుకొని, తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించారు. ప్రధానంగా వారి కార్యరంగం రచనావ్యాసంగమైనా, వారి ప్రాపంచిక దృక్పథం మాత్రం విశాలమైంది. ఈ దృక్పథంలో భాగంగానే అనేక రచనలు చేశారు. దేశాన్ని గూర్చి, సమాజాన్ని గూర్చి కొన్ని నిర్దుష్ట అభిప్రాయాలు వారికున్నాయి. ఇది అప్పటి కాలప్రభావం కావచ్చు. లేదా, వారి మొత్తం దృష్టిలో ఒక భాగం కావచ్చు. వీరేశలింగం, విద్యాసాగర్ లాంటి సంస్కర్తలు తమ కార్యాచరణ పరిధిని ఖచ్చితంగా ఎన్నుకొని ఆ గిరిలోనే ఉండి పోయారు. సంస్కరణలను దాటి వెళ్ళడానికి యిష్టపడలేదు. అది ఉద్యమాలను దెబ్బతీస్తుందని వారి నిశ్చితాభిప్రాయం. చిలకమర్తి లాంటి కవులు, రచయితలు ఒక దశలో 1905 తర్వాత, ప్రత్యక్షంగా రాజకీయాల్లో పాల్గొన్నారు. వందేమాతరం ఉద్యమంలోనే కాక, కాకినాడ కాంగ్రెస్ మహాసభలతోపాటు, జాతీయోద్యమంలో మిళితమైనారు. అలాగే ఉన్నవ కూడ. దీనికి మరో కారణం, వీళ్ళిద్దరూ 1919 తర్వాత జీవించి ఉండడం. కందుకూరి, గురజాడలు అప్పటికే మరణించారు.

జాతీయోద్యమ ప్రారంభంలోనే, 1889 లో, విజయనగరంలో జరిగిన స్థానిక కాంగ్రెస్ సభలో పాల్గొని ఉద్యమ ఆశయాలను గూర్చి గురజాడ ఉపన్యసించారు. అప్పటినుండి జాతీయోద్యమ ప్రగతిని, ఆటుపోట్లను గమనిస్తూ, ఉద్యమ ఆరాధకుడుగా గాక సానుభూతితో కూడిన విమర్శకుడయ్యాడు.

కన్యాశుల్కంలో జాతీయోద్యమాన్ని గూర్చిన ప్రస్తావనలు చాలా కొద్ది మాత్రమే ఉన్నాయి. అప్పటి సీనియర్ నాయకుడు సురేంద్రనాధ్ బెనర్జీ ఉపన్యాస ధాటిని తెలియచెప్పే అంశం ఒకటి. ఇందులో ప్రత్యేకత ఏమీ లేదు. జాతీయోద్యమ మూలపురుషుల్లో బెనర్జీ ఒకడు. అనర్గళంగా ఉపన్యసించగల దిట్ట. దేశం నలుమూలలా తిరిగి, ప్రజల్ని ఉత్తేజపరచి, కాంగ్రెస్‌ను జాతీయ సంస్థగా చేయడంలో కృషి చేశాడు. అందువల్ల, ఆయన ప్రస్తావన అభిమానం కొద్దీ చేసిన ప్రశంస. ఇంతకంటే ముఖ్యమైన మరో ప్రస్తావన బండివాడికి సంబంధించింది. ఇందులో గురజాడ నిశితదృష్టి, వ్యంగ్యంతో కూడిన విమర్శ వ్యక్తమౌతాయి. గిరీశం అంత సేపూ కాంగ్రెస్‌ను గూర్చి బండివాడికి అనర్గళంగాచెప్పాక, వాడు తమ స్థానిక పోలీసు అధికారి దురుసు ప్రవర్తన గుర్తు తెచ్చుకొని, ఆ అధికారిని కాంగ్రెస్ వాళ్ళు ఎప్పుడు బదిలీ చేస్తారని అడుగుతాడు. జాతీయోద్యమంపట్ల, ప్రజల కానాటికున్న అభిప్రాయాన్ని యిది సూచిస్తుంది. ఉద్యమపు మహోన్నత లక్ష్యాలు, దేశ స్వాతంత్ర్యం, ప్రజలకు స్వేచ్ఛ, సామాజిక దోపిడి, యివన్నీ ఎవరికి పట్టినట్టు ? ఇవి పెద్ద విషయాలు. బండివాడు తన స్థాయిలో స్వాతంత్ర్యానికి చెప్పుకొన్న భాష్యం ఈ వ్యాఖ్య. మరోచోట కాంగ్రెస్ అంటే "దివాన్గిరి" చెలాయించడం

అంటాడు. ఈ వ్యాఖ్యల వల్ల రెండు విషయాలు మనకు స్పష్టంగా అర్థమౌతాయి. ఒకటి, జాతీయోద్యమం యింకా ప్రజలకు చేరువ కాలేదని, దాన్ని వాళ్ళు సరైన రీతిలో అర్థం చేసుకోలేదని. జాతీయోద్యమ తొలి దశలో ఉద్యమం కేవలం సమాజంలోని ఉన్నత, విద్యాధిక మధ్యతరగతి వర్గాలకే పరిమితమైంది. రెండు, అప్పటికే జాతీయోద్యమం ప్రజల్లో సృష్టిస్తున్న భ్రమలు. ఒక కోణంనుండి చూస్తే గురజాడ నిజమే చెప్పాడనిపిస్తుంది. దేశ స్వాతంత్ర్యాన్ని, తద్వారా పొందిన రాజకీయాధికారాన్ని నేడు మన పాలకులు చెలాయిస్తున్న తీరు వ్యాఖ్యల కంటే భిన్నంగా లేదు. "దివాన్గిరీ చెలాయించడం" కూడ యిదే అర్థంలో వాడింది. విమర్శ, ముందుచూపు, అప్పటికే జాతీయోద్యమం నడుసున్న దిక్కు దీనివల్ల అర్థమౌతాయి. విద్యాధిక మధ్యతరగతి వర్గం కాంగ్రెస్‌కు ప్రాతినిధ్యం, నాయకత్వం వహించింది. ఈ వర్గం బ్రిటిష్‌వారి పరిపాలనా విధానాలవల్ల వచ్చిందే. దీనికి రెండు రకాల ప్రవృత్తులున్నట్టే ఈ వర్గం కూడ అఖండమైంది కాదు. అభివృద్ధి కాముకులతోపాటు యిందులో అభివృద్ధి నిరోధకులూ ఉన్నారు. అభివృద్ధి కాముకుల్లో, నయవంచకులూ(గిరీశంలాంటివాళ్ళు ఆధునికతను వల్లెవేస్తూనే ఆచరణకు దూరమైనవాళ్ళు), నిజాయితీపరులూ ఉన్నారు. మతంలో, కులంలో, ఆచారాల్లో నమ్మకం ఉన్నవాళ్ళు ఉన్నారు. అందుకే గురజాడ కాంగ్రెస్‌పై చేసిన విమర్శను ఈ వైపు నుండి చూడాలి.

మరో కోణం నుండి చూసినపుడు. కన్యాశుల్క నాటకం మొత్తం వలస పాలనను సరిగ్గా అంచనావేసి, నిశిత దృష్టితో విమర్శించినట్టుగా తోస్తుంది. ఇలాంటి విమర్శ ఉద్యమ పుట్టుకకే గాక దాని పెంపుదలకూ ఎంతగానో తోడ్పడుతుందన్నది యిక్కడ మనం ముఖ్యంగా గమనించాలి. అయితే దార్శనికుడూ, సూక్ష్మబుద్ధిగల గురజాడ ధ్వనించిన విమర్శ సామాన్య ప్రజల కంతగా అర్థం కాకున్నా, విద్యావంతులకిది ఉపయోగపడింది. గురజాడ కొలువు చేసిన విజయనగరం జమీందారీ కల్పించిన వాతావరణం దీని కొక కారణం. అక్కడొక సాంస్కృతిక వాతావరణం ఉండేది. విద్యావ్యాప్తికి, అందులోనూ స్త్రీల విద్యాభివృద్ధికి తోడ్పాటు జరిగింది. కన్యాశుల్క నాటక రచనకు ప్రేరకమైన బాల్య వివాహాల సర్వే జరిగింది. తర్వాత అది చట్టంగా మారడానికి విజయనగర జమీందార్లు కృషి చేశారు. సురేంద్రనాథ్ బెనర్జీలాంటి జాతీయ నాయకులకు ధన సహాయం చేశారు. కాంగ్రెస్ రాజకీయాల్లో ప్రత్యక్షంగా పాల్గొనకపోయినా దాని కార్యక్రమాలను యితర జమీందార్ల లాగ అడ్డుకోలేదు. బ్రిటిష్‌వాళ్ళ తొత్తులుగా మారనూలేదు. వారి అనుకూల రాజకీయాల్లోనూ తలదూర్చలేదు. ఇదంతా చెప్పడం విజయనగర జమీందార్ల గుణగణాలను గుణించడానికి కాదు. గురజాడకు ఉదార వాతావరణం తోడ్పడిందని చెప్పడానికే! ప్రధానంగా భావుకుడు, మేధావి, సృజనాత్మక రచయిత కావడంవల్ల, గురజాడ ఒకవైపు వలస పాలన వరాలుగా చెప్పబడిన విద్యావిధానాన్ని, న్యాయ వ్యవస్థనూ, పరిపాలనా

యంత్రాంగాన్నీ, చివరకు మధ్యతరగతి వర్గంలోని డొల్లతనాన్ని ఎండగట్టాడు. సమూల వలసవాద విమర్శను ఆ విధంగా ప్రవేశపెట్టగలిగాడు. అయితే యివే విషయాల్ని కాంగ్రెస్‌కు నాయకత్వం వహిస్తున్న మధ్యతరగతి వర్గం గుర్తించలేక పోయినందుకు, పైగా వారే నాయకులుగా చలామణి అవుతున్నందుకూ సహించలేక పోయాడు. అందువల్లనే జాతీయోద్యమాన్ని అభిమానిస్తూనే, దాని ప్రగతిని ఆకాంక్షిస్తూనే, జాతీయోద్యమ వ్యతిరేకినన్నంతగా, ఉద్యమంలోకి ప్రవేశిస్తున్న చెడు ధోరణులను ఎత్తి చూపాడు. అప్పటికే ఆయన దృష్టిలో నేషనల్ కాంగ్రెస్ ఒక పీఠంగా మారిందనుకొన్నాడు. ఆయన రాసిన పారడీలో తిరునాళ్ళగా జరిగే కాంగ్రెస్ సభల్ని హేళన చేశాడు. మితవాదుల ఉపన్యాసాలను కంఠశోషలుగా పేర్కొన్నాడు. వాచ్యంగా మితవాదుల 'రాజభక్తి'ని తూలనాడాడు. మితవాద రాజకీయ విధానాలపట్ల ఆయన ఏవగింపు స్పష్టంగా కన్పిస్తుంది. 'భజన సమాజం'గా కాంగ్రెస్‌ను వర్ణించింది ఈ దృష్టితోనే! కాంగ్రెస్ కేవలం రాజకీయాలపైనే దృష్టి సారించి, ప్రజల నిత్య ఆర్థిక, సామాజిక సమస్యలను పట్టించుకోడం లేదన్నది ముందే పేర్కొన్న కన్యాశుల్కంలో చేసిన ప్రస్తావనలో స్పష్టంగా కన్పిస్తుంది. అన్నిరకాల అభిప్రాయాలనూ, మనుష్యులనూ, భిన్న ఆశయాలతో ఉద్దేశాలతో ఉద్యమంలోకి ప్రవేశించి, కాంగ్రెస్ చైతన్యం లోపించిన ఒక మదగజంలా, కన్పించిందాయనకు. చిత్తశుద్ధీ, కార్యాచరణా, ఆశయసాధనకు కావల్సిన పట్టుదలా కార్యకర్తల్లో లేవన్నదే ఆయన తపన. ఈ తపన, ఆవేదన గురజాడకు కల్గడం ఆయనలో ఉన్న అమితమైన దేశభక్తీ, జాతీయతే కారణం. అప్పట్లో, అంటే యింకా జాతీయోద్యమం పాతికేళ్ళు నిండనపుడే, చేసిన ఈ విమర్శ గురజాడ ద్రష్టతకు నిదర్శనం. ఇదే పైఖరి, గురజాడ సంస్కరణోద్యమాలపట్లా కల్గి ఉండడం మనం గుర్తుంచుకోవాలి.

మరో ముఖ్యాంశాన్ని గురజాడలో మనం గమనిస్తాం. కాంగ్రెస్ రాజకీయ విధానాలను విమర్శించడానికి కారణం అప్పట్లో ఆ సంస్థకు సరైన సామాజిక అవగాహన లేకపోవడం. మానవత్వాన్నీ, సోదరత్వాన్నీ, అత్యుత్తమ విలువలుగా భావించిన గురజాడ, సంకుచిత రాజకీయ దృష్టిని అభిలషించలేకపోయాడు. 'ఎల్లలోకము వొక్క యిల్లై', 'వర్ణ భేదములెల్ల కల్లై', మతములన్నీ మాసిపోయి జ్ఞానమొక్కటే నిలిచి వెలుగుతుందన్న అంతర్జాతీయ తత్త్వాన్ని, వసుధైక కుటుంబాన్ని ఆకాంక్షించిన గురజాడ సహజంగానే కాంగ్రెస్ విధానాలను సంపూర్ణంగా హర్షించలేకపోయాడు.

ఆంగ్లేయుల 'ధర్మరాజ్యం'పై గురజాడ కున్న భావాల గూర్చి వివరణ అవసరం. గురజాడ లాగే, 19వ శతాబ్దపు మేధావులంతా, ఆంగ్ల ప్రభుత్వాన్నీ, భారతదేశానికి అది చేసిన మేళ్ళను గూర్చి ప్రశంసించినవారే! ఈ ప్రశంసలో ఆర్థిక ప్రయోజన ప్రస్తావన లేకపోవడం గమనించాలి. దీనికి కారణం, వీరిలో

అనేకమందికి - ముఖ్యంగా సాహితీపరులకు, సంస్కర్తలకు - వలస దోపిడీ గురించి, ఆ మాటకొస్తే అసలు వలసవాద నిజస్వభావం గూర్చి సరైన అవగాహన లేకపోవడమే! మరోటేమిటంటే, వలసపాలన రాజకీయ ఐకమత్యాన్ని సాధించి, దేశాన్ని ఏకంచేసి, రాజకీయ సుస్థిరతను, శాంతినీ (Pan-Brittanica) ప్రసాదించడమేగాక, రవాణా, వార్తా సౌకర్యాలు కలిగించి, పిండారీల, థగ్గుల బెడదను నిర్మూలించి, విద్యావ్యాప్తికీ, పాశ్చాత్య భావ ప్రచారానికి తోడ్పడి, సంఘంలోని దురాచారాలను, మూఢ నమ్మకాలను నిర్మూలించడంలో కృషిచేసిందని వారు గట్టిగా నమ్మారు. ఇందులో అసత్యం లేకపోయినా, యివన్నీ, వారి పరిపాలనను సుస్థిరపరచేందుకే చేశారన్న విషయాన్ని విస్మరించారు. కారల్ మార్క్స్ వలస పాలనలోని ద్వంద్వ పాత్రను వర్ణించడంలో, ఆంగ్లేయుల విధ్వంసక పాత్రతోపాటు, పునర్వికాస (regenerative) కర్తవ్యాన్ని కూడ నిర్వహిస్తారని రాసివున్నాడు. అంతేగాక, ముందున్న ప్రభుత్వాలకంటె [దీన్ని ముస్లిం (Muslim tyranny) నిరంకుశత్వంగా కొందరు బెంగాల్ మేధావులు, సంస్కర్తలు పేర్కొన్నారు], బ్రిటీష్ ప్రభుత్వం సాపేక్షంగా చూసినపుడు, వీరికిది మెరుగనిపించింది. దీన్నే నేటి చరిత్రకారులు తప్పుడు అవగాహన (false consciousness)గా విశ్లేషించారు. సాంఘికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా మౌలిక హక్కుల్ని కలగచేయడం, స్థానికంగానైనా రిప్పన్‌లాంటి వైస్రాయీలు స్వపరిపాలనా పద్ధతిని ప్రవేశపెట్టినవాళ్ళే, దేశానిక్కావల్సిన స్వాతంత్ర్యాన్నీ, ప్రజలకు స్వేచ్ఛనూ ప్రసాదిస్తారని నమ్మారు. వీరేశలింగం మరో అడుగు ముందుకెళ్ళి, ఆంగ్లేయుల, భారతీయుల సంబంధాన్ని 'తల్లీ బిడ్డల అనుబంధం'గా వర్ణించాడు. పిల్లలకు కావల్సింది, ఎప్పుడు, ఎలా, యే మోతాదులో యివ్వాలో తల్లికి తెలుసునన్నది దీనిలో సారాంశం.

తప్పుడు అవగాహనంటే యిదే! గురజాడకు సంబంధించి అప్పట్లో జాతీయోద్యమంలో తలెత్తుతున్న (ముఖ్యంగా అతివాద దశలో) మతభావాలు ప్రతీకలు, పదజాలం నచ్చలేదు. దీన్ని పూర్తిగా నిరసించి, యిది దేశాన్ని ఆధునికతా మార్గం నుండి తప్పించి, తిరిగి మధ్యయుగాల భూస్వామ్య సంస్కృతి పరిధిలోకి తీసికెళుతుందని ఉద్దేశించాడు. అందుకే దేశభక్తి గేయంలో, కేపిటలిస్టు సమాజంలో అతి ముఖ్యభాగమైన ఆర్థిక సూత్రం, 'ప్రొటెస్టెంట్ ఎథిక్'ను, ప్రవేశపెట్టాడు. కష్టపడి పనిచేయడం, సంపదను సృష్టించడం లాంటి భావాలు యివే. అంతేగాక, 'దేశభక్తి' గేయంలో దేశానికిచ్చిన నిర్వచనం భిన్నమైంది. దేశమంటే నదులూ, కొండలూ, అరణ్యాలూ మాత్రమేగాక, ముఖ్యంగా మనుషులన్నాడు. బిపిన్‌చంద్రపాల్, బంకించంద్ర, అరవిందోలాంటివారు దేశానికి మాతృస్వరూపాన్ని, దాని స్వరూపాన్ని ఆపాదించారు. గురజాడ తద్భిన్నంగా మనిషిని కేంద్రబిందువుగా చేసుకొన్నాడు. అందుకనే, సమాజ సర్వతోముఖాభివృద్ధిని

కాంక్షించాడు. ఈ క్రమంలోనే, 19 వ శతాబ్దపు భారతీయ మేధావుల భూస్వామ్య సంస్కృతి వ్యతిరేకత, వారిని బ్రిటిష్ వలసవాద సంస్కృతి ముద్దుబిడ్డలుగా మార్చి వేసింది. పైగా ఆంగ్లేయ ప్రభువులపై వీరికున్న 'రాజభక్తి', స్వలాభాన్ని ఆశించి వారి మెప్పులు పొందడానికి ఉద్దేశించింది కాదు. 'అంగిలేయుల ధర్మరాజ్యం' జ్ఞానాన్ని, స్వాతంత్ర్యాన్ని యిస్తుందని ఆశించాడు గురజాడ. ఈ విధమైన తప్పుడు అవగాహనతో కూడిన ఆలోచనకు ఆనాటి మేధావివర్గం గురైంది. వలసపాలన సృష్టించిన ఆర్థిక వినాశనాన్ని గుర్తించడంలో విఫలమైనందువల్ల కల్గిన అనర్థం యిది. అయితే యిది కేవలం మేధావులకూ, సంస్కర్తలకూ మాత్రమే పరిమిత మైంది కాదు. మితవాద దశలో, (దాదాపు 1900 వరకు), ఏటా జరిగే ప్రతి కాంగ్రెస్ సభలో చేసిన మొదట తీర్మానం బ్రిటిష్ చక్రవర్తికి విధేయత ప్రకటించడం. అలాగే 1929 దాక కాంగ్రెస్ తన తీర్మానాల్లో సంపూర్ణ స్వతంత్ర ప్రస్తావన తీసుకురాలేదు. అంతెందుకు, గాంధీ మొదటి సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభమయ్యే వరకూ, భారతదేశంతో బ్రిటిష్‌వారి సంబంధం శాశ్వతంగా ఉండిపోవాలన్నాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్‌వారిది న్యాయపక్షమని నమ్మి యుద్ధానికి వాలంటీర్లను సేకరించి, చందాలు వసూలుచేశాడు కూడ. గురజాడ తన గేయంలో బ్రిటిష్‌వారిని 'ధర్మపక్షం'గా భావించింది ఈ క్రమంలోనేనని గ్రహించాలి.

అందువల్ల, వలస సంస్కృతి ప్రభావానికిలోనై రాజభక్తి గూర్చి రాసినంత మాత్రాన వారిని తమను వలసవాదానికి పూర్తిగా అమ్ముడుపోయినట్లుగా భావించడం సబబుకాదు. ఏఏ చారిత్రక దశల్లో, వలసవాద వ్యతిరేకత దశల వారీగా రూపొందుతూ వచ్చిందో, దాన్నిబట్టే జాతీయోద్యమ ప్రగతి ఎత్తుపల్లాలు దాటుకుంటూ ముందుకు సాగింది. దాన్నిబట్టే వ్యక్తుల రాజకీయాభిప్రాయాలు, జాతీయోద్యమంపట్ల వారికున్న వైఖరి మారుతూ వచ్చింది. ముఖ్యంగా, తొలి దశలో సాంస్కృతిక పునరుజ్జీవనం, జాతీయోద్యమం కలగలిసి సాగుతున్నపుడు, ఈ రెండు భావాల సమ్మిశ్రితం అప్పటి జాతీయవాదుల్లో కన్పిస్తుంది. దీనికి ప్రబలమైన ఉదాహరణ, మహారాష్ట్రలోని మహదేవ గోవిందరెనడే, పై రెండు ఉద్యమాల్లోనూ ఆయన పాత్ర అత్యంత ముఖ్యమైంది.

చివరిగా ఒక్కమాట. ఆనాటి జాతీయోద్యమానికి కల పరిమితుల్ని గుర్తించుకొన్నపుడు, అవి రాజకీయ నాయకులను ఎంతగా ప్రభావితం చేసి కోలాందోళన మనస్తితికి గురిచేశాయో, అవే పరిమితులు సంస్కర్తలకు, సాహితీ వేత్తలకు మరింతగా ఉండినాయని మనం తెలుసుకోవాలి. అయినా, కొన్ని ముఖ్య పరిమితులకు లోబడి గురజాడలాంటి మేధావులు బూర్జువా ప్రజాస్వామిక విప్లవ మార్పును సమర్థించారు. సమకాలీన రాజకీయ పోరాట స్వరూపాన్ని దాని విజృంభణను సరిగ్గా అర్థం చేసుకోలేదు. బ్రిటిష్ వలసవాదం కొని తెచ్చిన వినాశకర ఆర్థిక పరిస్థితుల్ని సరిగ్గా అంచనా వేయడంలో విఫలులైనారు. ఇవే వీరిలోని ప్రధాన లోపాలు.

# వేగుచుక్క గురజాడ

—దివి కుమార్

'దేవుదెవడో దాగినంటూ
కొండకోనల వెతుకులాడే
కన్ను తెరిచిన కానబడదో
మనిషి మాత్రుడి యందు లేడో'

వెయ్యి సంవత్సరాల లిఖిత తెలుగు సాహిత్య చరిత్రంతా దేవుడూ-భక్తి మతమూ - ముక్తి; రాజులూ - రక్తి; భాషా భేషజమూ - భుక్తి చుట్టూ తిరగగా మొదటిసారిగా వందసంవత్సరాలనాడు గురజాడ, సాహిత్యానికి కేంద్రబిందువు 'మనిషి' కావాలని ఎలుగెత్తి చాటాడు. దేవుడూ, మతమూ, భాషా కలసి ఫ్యూడల్ వ్యవస్థని చెక్కు చెదరనీయకుండా కాపాడే కర్తవ్యాన్ని నెరవేరుస్తున్న రోజులలో సంఘం కుళ్ళిపోయిందని గుర్తించి దానికి మరమ్మత్తు అవసరమని చాటిన దూరాలో చనాపరుడు గురజాడ.

ఆయనకు ఎంత దూరదృష్టివుందో తన విశ్వాసాలపట్ల అంత స్పష్టతా, సమగ్రతా వుంది. ఆయన 'కన్యాశుల్కం' జీవిత సిద్ధాంతమంత సాధారణమైనదీ, ఆచరణంత ప్రత్యేకమైనదీ!

గురజాడ సాహిత్యం మొత్తం ప్రజాస్వామికవిప్లవ ఫలాలకోసమై చల్లినభావ విప్లవ బీజాలు "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అని నూరు సంవత్సరాలనాడు ఆయన నినదించటం నిజంగా ఎంత గొప్ప విషయం. మరెంతటి మహత్తర సంఘటన!

ఎంతో సుదీర్ఘ చరిత్రగల భారతదేశంలోని అత్యధిక మానవాళి దృక్పథంలో నుండి చూస్తే "మంచి గతమున కొంచెమే"గా ఆయనకు గోచరించింది. అందుకే "అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనుకునే అహంకారపు మూఢులను ఆయన ఎద్దేవా చేసింది. సమకాలికుల కంటె, తన తర్వాత తరంకంటే కూడా ఆయన ముందుచూపు ప్రదర్శించ గలిగాడు.

ప్రపంచ తత్వశాస్త్రసంపదకు హిందూ మతం అందించిన మణిపూసలాగా ప్రచారం చేసుకుంటున్న అద్వైత వేదాంతాన్ని ఆయన కేవలం "ఎండమావి మాత్రమే"నని రాసుకున్నాడు.

ఈ నాటి సమస్యలకు వేదాలలో పరిష్కారాలను వెతుక్కోమని బోధిస్తున్న పాలకవర్గ సంస్కృతీ వారి వందిమాగధ సాహితీవేత్తలూ గురజాడ ముందు కేవలం మరుగుజ్జులు.

వర్ణ వ్యవస్థనూ, పుట్టుక కారణంగా ఏర్పడే హెచ్చుతగ్గులనూ సమాజం

గుర్తిస్తూ, పాటిస్తూ ఉన్నకాలంలో అందులో పైమెట్టున వుండిన బ్రాహ్మణకుటుంబాలలో, వ్యక్తులలో, సంబంధాలలో ఎంతటి అమానవీయ తత్వాలూ, స్వభావాలూ జీర్ణించుకుపోయి వున్నాయో ఆయన కన్యాశుల్కం ద్వారా అద్భుతంగా చిత్రించాడు. పుట్టుక కారణంగా 'నీచ' స్థితిలో వుండినవాడు కూడా బ్రాహ్మలే గొప్పవాళ్ళు, వారికది పుట్టుక కారణంగా సిద్ధించిన ఆధిక్యత అని భావిస్తున్నరోజుల్లో బ్రాహ్మల్లో వుండే స్వార్థం, కక్కుర్తి, కపటత్వం, మోసకారితనం, అమానుషత్వాలను కళ్ళకు కట్టేట్టు చూపి మొత్తం సంఘానికే కళ్ళు తెరిపించాడు. మార్పులేని వ్యవస్థ ఎంతగా కుళ్ళి కంపుగొడుతుందో వాసన చూపించాడు.

మనుధర్మశాస్త్ర ప్రకారం, అష్టాదశ పురాణాల ప్రకారం, బ్రాహ్మలు భూమిమీద పుట్టిన దేవతలు కనుక, వారేమి చేసినా వారికి పాప మంటదనే అగ్రవర్ణ దురహంకారపు భావజాలం యొక్క డొల్లతనాన్ని బట్టబయలు చేస్తూ "కొండుభట్టు"పాత్రను సృష్టించాడు. గురజాడకు పూర్వం వుండిన నిరసన వ్యక్తీకరణలకంటె బలంగా దృశ్యరూపంలో చూపెట్టాడు. నీచమైనదిగా భావింపబడే వేశ్య (మధురవాణి) గొప్పవారుగా భావింపబడే బ్రాహ్మలకంటె ఎంత హృదయ సంస్కారం, మానవతా కలిగి వున్నదని చెప్పటం ద్వారా తన సమకాలీన సంఘాన్ని ఒక్క కుదుపు కుదిపాడు.

మూఢ విశ్వాసాలను వ్యాప్తి చేసి పబ్బం గడుపుకుంటున్న మత వ్యవస్థనూ, మానవత్వాన్ని నూరు నిలువుల లోతున పాతిపెడుతున్న ఆచారసాంప్రదాయాలను అసహ్యించుకుని వాటిని తన సాహిత్యం ద్వారా పరిమార్చటానికి కంకణం కట్టుకున్న గురజాడ తన కథలూ, నాటకాలూ, కవిత్వాలతో వాటిని దుయ్యబడతాడు. మానవ జాతిని వివిధ రూపాలలో పట్టిపీడిస్తున్న -

"మతములన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును"
అని ఎంతో దూరదృష్టితో ప్రవచించాడు. అది నిజమయేలోగా -
"అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నియు మెలగవలెనోయ్"

అని ప్రబోధించాడు. "మనసు వొకటై మనుషులుంటే మతం వేరై తేను యేమోయ్" అని చెప్పాడు.

★ "ఇందులో వాడ బడిన ఆంగ్లపదాలు తెలుగువారి నిత్యజీవితంలో సమ్మిళితమై పోయిన పదాలే అని మరచిపోరాదు. ప్రతాపరుద్రీయంలో ఉర్దూ భాషా పదాలకు ఎంత ప్రాముఖ్యం ఉందో, కన్యాశుల్కంలో ఆంగ్లభాషా పదాలకు అంత ప్రాముఖ్యం ఉంది."

—డా. పి.యస్.ఆర్. అప్పారావు

మానవత్వపు సౌందర్యాన్ని హిందూ సంస్కృతి పరమక్రూరంగా చిదిపి వేస్తూండిన కారణంగా, భారతదేశపు దుస్థితికి ఒక కారణాన్ని ఆయన ఈ విధంగా రాసుకున్నాడు.

"బౌద్ధమతాన్ని రూపుమాపినప్పుడే భారతదేశం మతరీత్యా ఆత్మహత్య చేసుకుంది."

ఆధునికసమాజానికి ఏదో ఒక మతప్రత్యామ్నాయాన్ని(బౌద్ధాన్నికూడా)ఆయన ప్రతిపాదించలేదు. "మతాలు గందరగోళమైనవి. ఆచరణయోగ్యం కానివి" అని స్పష్టంగా ఆయన మిత్రునికి లేఖలో రాశాడు. మూఢ విశ్వాసాల గాఢాంధకారంలో కొట్టుమిట్టాడుతున్న సమాజానికి తన మానవతాదృక్పథంతో హేతువాదతత్వంతో వెలుగురేఖల్ని విరజిమ్మిన మహాకవి గురజాడ.

స్త్రీల పట్ల సంఘం, సంస్కృతి చూపుతున్న చిన్నచూపు, వివక్షత వారిపై సాగుతున్న ద్వేషాలకు ఆయన హృదయం చలించిపోయింది. వేశ్యలను సృష్టించిన సంఘం కంటె వేశ్యలు నీచులు కారన్నది ఆయన నిశ్చితాభిప్రాయం.

తన మిత్రుడు సుబ్రహ్మణ్యానికి లేఖ రాస్తూ-"సానిపిల్లలోని మానవత్వాన్ని మరవవద్దు. ఆమె కష్టసుఖాలన్నీ, మన కష్టసుఖాల్లాగే గురుతరమైనవి. వ్యభిచరించే భార్యలూ, స్త్రీలోలురైన భర్తలూ మన సమాజంనిండా వున్నారు. వాళ్ళు సానిపిల్ల కంటె ఎలానయం? సానిపిల్లలో మోసంలేదు- ఆమె తన వృత్తిని మరుగుపరచటం లేదనే అర్థంలో. ఆమె ఏ వివాహబంధాన్నీ భగ్నం చేయటంలేదు" "నీ చుట్టువున్న వైవాహిక జీవితాన్ని అధ్యయనం చెయ్యి. బీదవాళ్ళయిన భర్తలగురించి, కురూపి భర్తలగురించి, దుష్ట భర్తల గురించి, దుర్భరభర్తల గురించి భార్యలు ఏమను కుంటారో వూహించడానికి ప్రయత్నించు. దుష్టభార్యలూ, కురూపి భార్యలూ మొద్దలైనవాళ్ళ సంగతేమిటని నీవడగవచ్చు. కానీ, వాళ్ళు బానిసలు. మననుంచి వాళ్ళు ఆశించే పవిత్రతకన్నా ఎక్కువ పవిత్రతను మనం వాళ్ళనుంచీ ఆశిస్తున్నాం. ఖేదానికి మూలం అదే. పవిత్రులు కాని పురుషులందర్నీ నీవు తీవ్రంగా అసహ్యించుకుంటా వనుకో, నీ మిత్రుల్లో నీకెంతమంది మిగులుతారో చెప్పు—"

---

★ "యదార్థ పాత్రలను సృష్టించి నాటి సాంఘిక దురాచారాలను ప్రతిబింబింప చేసి నాటక కళద్వారా సంఘ దురాచారాలను నిర్మూలించగలమనే సత్యాన్ని గురజాడ అప్పారావు తన కన్యాశుల్క నాటకముద్వారా ఋజువు చేశారను టలో సందేహము లేదు."

—జస్టిస్ కె. పున్నయ్య

స్త్రీలకు మాత్రమే పాతివ్రత్యాన్ని నిర్దేశించి పురుషుడికి విచ్చలవిడి తనాన్ని చ్చిన సామాజిక నీతి అంతం కావాలనుకున్నాడు గురజాడ. స్త్రీ పురుషులమధ్య నిజమైన ప్రేమ ఆవిర్భవించాలని కోరుకున్నాడు "ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును-ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును" "మగడు వేల్పన పాతమాటది - ప్రాణమిత్రుడు నీకు" అన్నాడు.

ప్రేమ - స్త్రీ పురుష సంబంధాలు - స్త్రీల సమస్యల పట్ల ఆయనలోగల ఆధునాతన దృష్టికి "సౌదామిని" (నవలారచనకు రాసుకున్న నోట్స్) చక్కటి ఉదాహరణ.

"వంట చెయ్యాన్ని నిషేధించిపారేయాలి. దుకాణంనుంచి ఆహారం తెచ్చుకోవాలి. ప్రతి వీధికీ ఒక దుకాణం వుండాలి. కుటుంబం అక్కడికి వెళ్ళి భోంచేస్తుంది. ఇక వంటా వార్పూ చింతే ఉండదు. ఇట్లా శక్తి ఎంతగా పొదుపు అవుతుందనీ."

పై నాలుగు వాక్యాలు చాలు, గురజాడ తన సమకాలీన రచయితలూ, మేధావులూ, సామాజిక కార్యకర్తల కంటె ఎంత ముందువున్నాడో! వంటయింటి పొగ చూరులనుండి (గ్యాస్ స్టౌలు వచ్చిన తర్వాత మాడు పొపుల వాసనలనుండి) విముక్తి కాకుండా స్త్రీ విముక్తి సాధ్యం కాదన్నది అర్థం చేసుకోడానికి సమాజానికి వందేళ్ళు కూడా ఇంకా చాల లేదు గదా !

పూర్ణమ్మ, కన్యక, కన్యాశుల్కం, సంస్కర్త హృదయం... ఇలా ఆయన రచనలన్నిటిలో స్త్రీ పాత్రలను ఎంతో విశిష్టమైనవిగా, శాశ్వతత్వం కలిగినవిగా ఆయన చిత్రించాడు.

"సానుభూతి అనేది సాహిత్య జీవికి విధిగా ఉండ వలసిన గుణం" అని తన డైరీలో రాసుకున్నాడు. తన రచనల్లో పీడిత పాత్రలపట్ల సానుభూతిని అయన ప్రదర్శించాడు.

"ఆధునిక మహిళ చరిత్రను తిరగ రాస్తుంది" అని ఆయన ప్రకటించిన విశ్వాసం ఇంకా నెరవేరకపోయినా అది తథ్యమని ప్రపంచవ్యాపితంగా సాగిన, సాగుతున్న మహిళా ఉద్యమాలు, పోరాటాలు సాక్ష్యాలుగా మన ముందున్నాయి.

పుట్టుక కారణంగా గుణాన్ని నిర్ణయించే హిందూ సమాజ సంస్కృతికి వ్యతిరేకంగా—

"మంచిచెడ్డలు మనుజులందున,
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలమైతే
మాల, నేనగుదున్—" అంటూ మానవులందరూ పుట్టుక కారణంగా

సమాన గౌరవనీయులు అని చాటాడు. ఈ విధంగా వివిధ సామాజిక, సాంస్కృతిక అంశాల పట్ల ఆయన నిర్దుష్టమైన ఆధునిక భావానికి ఆద్యుడైనాడు సమకాలీనుల కంటె ఎంతో ముందున్నాడు. ఇదంతా కేవలం కొత్తదనం కోసం ప్రారంభించింది కాదు. ఆయన మాటల్లోనే చెప్పాలంటే, "కవితా కళకు నేను వొదిగి ఉండవలసిన వాడినే అయినా, సమాజం పట్ల నాకొక మహత్తరమైన బాధ్యత వుంది" అన్నాడు.

ఎన్నో ఆధునిక ప్రక్రియలకు ఆద్యుడైన గురజాడ, రచయితలకు సామాజిక బాధ్యత ఉండాలని భావించిన వారిలో కూడా మొదటి తరం వాడుగా ఉండటం ఆయన మరో ప్రత్యేకత.

విస్పష్టమైన ఆధునిక భావాల్ని పుణికి పుచ్చుకున్నప్పటికీ వాటిని వ్యక్తం చేయడానికి గ్రాంధిక భాషా సంకెళ్ళు అడ్డు తగిలాయి. విశాలమైన నగరానికి ఇరుకు రోడ్లులాగా, ఆయన ఆధునికతకు ఛందోబద్ధ కవిత్వమూ, గ్రాంధిక భాషా రచన అడ్డమై కూర్చున్నాయి. తన సహచరుడు గిడుగు రామ్మూర్తి పంతులుకి సైదోడుగా నిలిచి వ్యావహారిక భాషా ఉద్యమానికి ఆచరణాత్మక తోడ్పాటు నందించాడు.

"నా వుద్యమం ప్రజల ఉద్యమం. సంస్కారవంతుల అభిప్రాయం నాకు అండగా వుంది. విషయం అర్థంచేసుకోలేని వాళ్ళు నాకు వ్యతిరేకంగా నిలబడితే నేను లెక్కచెయ్యను" అంటూ తన అభిప్రాయాలను వ్యక్తం చేశాడు. వ్యావహారిక భాషలోనే నూతన ప్రక్రియలను ఆరంభించాడు. ఆనాటికి వ్యావహారిక భాషావాదులు సంఖ్యరీత్యా చాలా తక్కువ. పండిత పోషకులూ, పండితులూ, వారి శిష్య బృందాలూ, మత వ్యవస్థ దొంతర్లలోని ఉన్నతస్థానాల వారందరూ వీరికి వ్యతిరేక పక్షం. అయినా మొక్కవోని ధైర్యంతో ఎదుర్కొని నిలిచాడు. గురజాడ ఆశించిన సామాజిక మార్పులలో పూర్తిగా సిద్ధించింది వ్యావహారిక భాషా విజయ మొక్కటే.

*    *    •    *

సుదీర్ఘకాలంగా రాచరిక, భూస్వామ్య వ్యవస్థలలో మగ్గిన భారత సమాజం నుండి పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానమూ, ప్రజాస్వామ్య సామాజిక వ్యవస్థ నిర్మాణం లోకి మారకుండా బ్రిటీష్ పాలకుల వలస పాలన అడ్డుపడింది. మార్కెట్‌నీ, రాజకీయాధికారాన్నీ, వనరుల్నీ సంపూర్ణంగా వశపరుచుకున్న బ్రిటీషు పాలకులు తమ పరిపాలనకూ, దోపిడీ వ్యాప్తికీ తమ కనుసన్నలలో మెలిగే పెట్టుబడిదారుల్నీ, విద్యావంతుల్నీ సృష్టించుకున్నారు. భూస్వామిక వ్యవస్థలో కొన్ని సర్దుబాట్లు చేశారు. ఇంగ్లీషు విద్య, వార్తా, రవాణా సౌకర్యాలను విస్తృతం చేశారు.

1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో బ్రిటీషువాళ్ళు గెలుపొంది, విశాల భారతదేశాన్ని తమ అధీనంలోకి తెచ్చుకొని, తిరుగులేని పరిపాలకు

లుగా నిలదొక్కుకుంటున్న రోజులలో గురజాడ అప్పారావు జన్మించాడు. స్వాతంత్ర్యోద్యమపు రెండవ దశ ప్రజా ఉద్యమ రూపం ధరించకముందే ఆయన మరణించాడు.

బ్రిటీషువారి రాకముందే భూస్వామ్య సంస్కృతిలోని కొన్ని అంశాలకు వ్యతిరేకంగా వేమన, పోతులూరి వీరబ్రహ్మం లాంటివారు సాగించిన ప్రచారం ప్రజానీకంపై ప్రభావాన్ని కలిగించింది. వాటితోపాటుగా బ్రిటీషు పాలకులు ప్రవేశపెట్టిన విద్య, తదితర సంస్కరణలు, పాశ్చాత్య దేశాలలో వచ్చిన పారిశ్రామిక విప్లవమూ, ఫ్రెంచ్ విప్లవమూ, తాత్విక, సాహిత్య, వైజ్ఞానిక రంగాలలో జరిగిన పెను మార్పులూ గురజాడపై ప్రభావాన్ని చూపాయి. ఆయనలో హేతు తత్వాన్నీ, ప్రజాస్వామ్య సామాజిక స్పృహనీ కలిగించాయి. భూస్వామ్య సంస్కృతిలోని సాహిత్య, సామాజిక, భాషా సంబంధమైన అనేక అంశాలకు వ్యతిరేకంగా ఆయన్ని నిలబడేట్టు చేసింది, పైన పేర్కొన్న బూర్జువా ప్రజాస్వామిక చైతన్యమే. అది సమాజాన్ని ఒక అడుగు ముందుకు వేయించే స్వభావం గలది.

ఒక కులంగా బ్రాహ్మణులు అభివృద్ధి నిరోధకులు, యథాస్థితివాదులు. అభివృద్ధికరమైన ప్రతి మార్పూ వారి సౌకర్యాలను (previleges) కుదించివేస్తుంది. అందుకే మార్పు అంటే వణికిపోతూ వుంటారు, ద్వేషిస్తారు. తమ మేధాసంపత్తితో, నూతన భావస్ఫూర్తితో అభివృద్ధికర భావచైతన్యాన్ని ప్రదర్శించిన అదే కులం వారిని సహితం ఆనాటి బ్రాహ్మణులు విడిచిపుచ్చలేదు. భూస్వామ్య సంస్కృతీ పరిరక్షకులైన బ్రాహ్మణ పెత్తందార్ల తీవ్ర ద్వేషానికీ, దౌష్ట్యాలకీ గురజాడా, కందుకూరీ గురైనారు. మరణానంతరం చాలాకాలం దాకా వారిరువురినీ పట్టించుకున్న వారే లేని స్థితి.

రష్యా విప్లవ ప్రభావితులైన అభ్యుదయ సాహితీకారులూ, కమ్యూనిస్టు ఉద్యమమూ 40వ దశకంలో గురజాడనూ, కందుకూరినీ తిరిగి సముచిత స్థానాలలో ప్రతిష్టించాయి. చనిపోయారనుకున్నవారు తిరిగి సజీవులై భూస్వామ్య సంస్కృతీ వ్యతిరేక పోరాట కార్యకర్తల చేతుల్లో ఆయుధాలుగా నిలిచేసరికి అక్కసు పట్టలేని విశ్వనాథ సత్యనారాయణలాంటి కరడుగట్టిన ఛాందసవాదులు 'కామ్రేడ్ గురజాడ', 'కామ్రేడ్ కందుకూరీ' అని ఎగతాళి చేశారు.

సామాజిక చైతన్యాన్నిబట్టి కాకుండా పుట్టుకను బట్టి గుణాల్ని నిర్ణయించ

---

★ "తన వాక్యాల్లోని ప్రత్యక్షరం బీజాక్షర ప్రాయంగా కల్పించకలిగి, ప్రత్యక్షరం నాబోటి పామరులకి ఒరవడిగా చేసి, నూతనాంధ్ర హృదయ కవిత్వ వ్యవసాయంలో యథేచ్ఛగా దున్నుకునే నిమిత్తం తన రచనని ఆకుమడిగా చేసి యిచ్చిన క్షేత్రజ్ఞుడు గురజాడ అప్పారావు."

—భమిడిపాటి కామేశ్వరరావు

బూనుకుంటున్న 'ఆధునిక మనువు'లు కొందరు - తమ కులాల్లోని అత్యధికుల వ్యతిరేకతకు గురైన గురజాడ, కందుకూరులను కులసంస్కర్తల స్థాయికి కుదించి వెయ్యాలని చూస్తున్నారు. తెలంగాణా ప్రాంతంలో బాల్యవివాహాలు నేటికీ పెద్ద ఎత్తున జరుగుతున్నాయి. జోగిని, బసివి, దేవదాసీ వ్యవస్థలు కొనసాగుతున్నాయి. పురుషులతోసహా అవిద్య, మూఢవిశ్వాసాలు అమలులో వున్నాయి.

అయితే వ్యవస్థ అనుమతించిన మేరకు చిన్న చిన్న మార్పులు సంభవించాయి. భూస్వామ్య వ్యవస్థ యొక్క మౌలిక స్వభావమూ, దానితో పెనవేసుకుని వున్న పితృస్వామ్య విధానమూ కొత్త చిగుళ్ళు వేసుకుంటూ మహిళల్ని, సమాజాన్ని మొత్తంగా భయపెడుతూనే వున్నాయి.

ఆంగ్లేయ మానసపుత్రుడూ, బ్రాహ్మణ భేషజత్వ కౌటిల్యుడూ అయిన గిరీశం భారత దళారీ పాలకుల్లాంటివాడు. సంస్కరణల వాగాడంబరమూ, కపటత్వమూ కలగలిసినవాడు. అనాథలైన భారత ప్రజల్ని శతకోటి విధాలుగా మోసగించగల నిర్భయ, నిర్లజ్జాపరుడు.

కొందరు గిరీశాన్ని చూపి సంస్కరణే బూటకమన్నట్టుగా ఈనాడు కాంగ్రెసు పాలకుల్ని చూసి రాజకీయమే దుర్మార్గమైనదిగా భావించుతున్నారు. మహానుభావుడు గురజాడ అటువంటి వారినుండి జాగ్రత్తగా ఉండమని హెచ్చరించటానికే 'కన్యాశుల్కం' అందించింది.

ఈనాడు గురజాడను పొగడటం కష్టమేమీ కాదు. (కొందరి కదొక ఫ్యాషన్ కూడా) బాధ్యతతో సమకాలీన సామాజిక సమస్యలకూ; దుగ్మతలకూ వ్యతిరేకంగా కలం పుచ్చుకున్నవారే ఆయనకు నిజమైన వారసులు కాగలుగుతారు. మొత్తం ప్రజానీకం - ముఖ్యంగా స్త్రీలు పతన సాంస్కృతిక విలువల దుష్ఫలితాలను అనేక రూపాల్లో అనుభవిస్తున్నారు. వాటికి వ్యతిరేకంగా ఆగ్రహించనివాడు గురజాడకు వారసుడు కాలేడు.

ఆయన వెలిగించిన ప్రజాస్వామ్య భావజాల జ్యోతిని మరింత దేదీప్యమానం చేసి విప్లవోన్ముఖంగా నడిపించటానికి నడుంకట్టటం ఆయనకు నిజంగా అర్పించే నివాళి. కుళ్లిపోయిన నిశ్చలన జలాల్లో సాహిత్య పత్రాలను విసిరి కదలిక తెచ్చిన అలలను ఉధృత తరంగాలుగా మార్చటం రచయితల కనీస కర్తవ్యం.

ఆ లక్ష్యసాధనకు పునరంకితమవుతూ వినమ్రంగా సాగటమే నూరు సంవత్సరాల కన్యాశుల్కానికి 'ప్రజాసాహితి' అందించే జేజేలు. ○

★ "దేవుళ్ళూ, రాజులూ, ధనికులూ ఆక్రమించుకొన్న సాహిత్యాన్ని ప్రజలకు సంపాదించిన మహాపురుషుడు అప్పారాయ మహాకవి. సాహిత్య విప్లవకారకుడై నూతన సంస్కృతిని నెలకొల్పిన మహాపురుషుడు."

— సెట్టి ఈశ్వరరావు

# కన్యాశుల్కం - చారిత్రక నేపథ్యం

**— కరెవరపు వెంకట్రామయ్య**

"ఏ కవియొక్క ఆవిర్భావం వల్ల ఈ ప్రపంచం యింకో అడుగు ముందుకు వేస్తుందో, ఆ కవే మహాకవి"

— శ్రీ శ్రీ

అలాంటి మహాకవి గురజాడ రచయిత, సంఘజీవి, కాబట్టి అతని వ్యక్తిత్వం ఆలోచన ఎంత స్వతంత్రించినా సాంఘికమైనవే. సమాజంలోని ప్రతి చలనానికి చైతన్యవంతుడైన ఏ రచయిత అయినా స్పందిస్తాడని చెప్పడం పరిపాటి. ఏ ఉద్యమం సంఘాన్ని ప్రచలితం చేసినా, దాని ప్రభావం వల్ల ఎన్నో రచనలు పుడతాయి. తిరిగి ఆ రచనలు ఆ ఉద్యమానికి ఊపిరులూదుతాయి. అందువల్ల రచయితకి సమాజానికి ఆధార, ఆధేయ సంబంధం; రచయిత అతని రచనలకి అవినాభావ సంబంధం వుంటుంది.

యూరప్ దేశాల్లోని పారిశ్రామిక విప్లవం (1748) ప్రపంచ దేశాల ఆర్థిక పరిస్థితులమీద విశేష ప్రభావాన్ని చూపింది. ఫ్రెంచి విప్లవం (1789)సామాజికంగా స్వాతంత్ర్యం, సమభావం, సోదరత్వం వంటి నూతన భావవీచికల్ని ప్రసరింప చేసింది. ముద్రణాయంత్రం సాహిత్యాన్ని సామాన్యుల దరికి చేర్చింది. హేతువాదం, మానవతావాదం, శాస్త్రీయ దృక్పథం, మానవశక్తిమీద విశ్వాసం ప్రబలి ఓ నూతన తాత్త్విక ధోరణి యూరప్ సమాజంలో అంతవరకూ కొనసాగుతున్న పూర్వపు జీవితవిధానాన్ని, విలువల్ని మార్చివేసింది.

అప్పటికే భారతదేశం బ్రిటిష్‌రాణి ఏలుబడిలోకివచ్చింది. సామ్రాజ్యవిస్తరణ కోసం, సుస్థిరతకోసం బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో 1813 తర్వాత పరిపాలనా విధానంలో కొన్ని సంస్కరణలు, సవరణలు అంచలంచెలుగా ప్రవేశ పెట్టడం జరిగింది. భారతీయులకోసం కాకపోయినా, స్వప్రయోజనం కోసమైనా భారత సమాజ ఆధునికీకరణ అవసరమయింది. పారిశ్రామిక విప్లవం ఫలితంగా పెరిగిన వస్తూత్పత్తి విక్రయానికి భారతదేశం విపణివీధి కావాలంటే భారతీయుల సామాజిక స్థితిలో మార్పుతేవాలి. ఆ ప్రయత్నంలో భాగంగా, ప్రథమచర్యగా పాశ్చాత్య విద్యావిధానం ప్రవేశపెట్టబడింది.

అయితే పాశ్చాత్య విద్యావిధానం భారతీయమేధావుల ఆలోచనాధోరణిలో విప్లవాత్మకమైన మార్పు తెచ్చింది. రాజకీయ, రాజ్యాంగ హక్కులకోసం పోరాటం మొదలైంది. అది అలా వుండగా మరోవైపు నుంచి సంస్కరణోద్యమాలు బయలు దేరాయి. మతసాంఘిక వ్యవస్థలోని కుళ్ళును తొలగించి శాస్త్రవిజ్ఞానం, హేతువాదం

మానవతావాదం పునాదులుగా నవసమాజ నిర్మాణానికి కృషిప్రారంభమయింది.

పాతకూ కొత్తకూ, విశ్వాసానికీ హేతువుకూ, అణచివేతకూ విజృంభణకూ, అవకాశవాదానికీ నిబద్ధతా నిమగ్నతలకూ, స్వతంత్రవాదానికీ సామ్రాజ్యవాదానికీ-ఇలా అనేకాంశాల మధ్య సంఘర్షణ బయలుదేరింది. దీనికి తొలికేంద్రం బెంగాల్. రాజారామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ లాంటి సంఘ సంస్కర్తలు, సాహితీవేత్తలు ఆ సంఘర్షణలోంచి రూపుదిద్దుకున్నవారే. సాంఘికంగా, సాంస్కృతికంగా, మతపరంగా కమ్ముకున్న చీకట్లను కదలబరచి వెలుగురేఖలను ప్రసరింపచేశారు. ఆ వెలుగును అందిపుచ్చుకొని ఆంధ్రదేశంలో జాతీయ పునరుజ్జీవనానికీ, సంఘసంస్కరణకీ నడుంకట్టారు కందుకూరి, గురజాడ మొ॥ వారు. కందుకూరి శుద్ధ సంస్కరణవాది. ఆయనకు సాధ్యం సంఘసంస్కరణం, సాధనం సాహిత్యం. గురజాడ మొదట కళావేత్త. కళని సాంఘిక ప్రయోజనానికి నూటికి నూరుపాళ్ళూ వినియోగించుకున్నాడు.

ఆనాడు దేశం పరాయి పాలనలో మగ్గడం అలావుండగా, ఆంధ్రసమాజం భయంకరమైన రుగ్మతలతో లుకలుకలాడిపోతున్నది. ఆ రోజుల్లో ప్రతిఇంటా ఏమూలను చూచినా ఓ దయ్యం. ఏ వీధిలో చూచినా ఓ భూతవైద్యుడు. ఓ స్త్రీకి చదువు చెప్పించడం మెదడు సరిగావున్న ఏ పురుషుడూ చేయరాని దుస్సాహసం. సాంఘికంగా అనుసరించబడుతూ వచ్చిన మతాచారాలు, వ్యక్తిగతంగా రూపొందించబడిన నియమాలు స్త్రీ జాతిని అధఃపాతాళానికి దిగద్రోసాయి. బాల్యవివాహాలూ,కన్యాశుల్క వివాహాలూ, స్త్రీ పునర్వివాహ నిషేధం - ఇవన్నీ ఒకదానితో ఒకటి ముడిపడి సమాజాన్ని పట్టి పీడుస్తున్నాయి. వేశ్యనుంచుకోవడం ఆనాడు సమాజంలో ఓ హోదా! భోగం మేళం లేనిదే ఏకార్యం జరిగేదికాదు. మతం పిచ్చిముదిరి వెర్రితలలు వేస్తున్నది. అంతేకాదు. ఒకే కులంలో శాఖల మధ్య కొట్లాటలు. సంఘం ఇంతగా అధఃపతనమైన తరుణంలో సాంఘికంగా కందుకూరి ఎంతసేవ చేశాడో, సాహితీరంగంలో గురజాడ తనవంతు కర్తవ్యాన్ని అంత సమర్థవంతంగా నిర్వహించాడు. "సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భరదాస్యంనుండి మహిళలను కాపాడడానికి" సమాజాన్ని అప్రతిష్ఠ పాలుచేసే పరిస్థితిని, కళ్ళ ఎదుటపెట్టి నైతిక భావాల ఉన్నత ప్రమాణాన్ని ప్రాచుర్యానికి తేవడంకంటే సాహిత్యానికి ఉన్నతమైన కార్యమేదీ ఉండదని ఉద్బోధించిన గురజాడ, సామాజిక వాస్తవికత రంగరించి, సృష్టించిన శిల్పకళాఖండం కన్యాశుల్కం. సాంఘికానుబంధంలేని భాషాసాహిత్యాలు పునాదులులేని గాలిమేడలని, వాటి అంతస్సంబంధాన్ని నిర్వచించడానికీ, నిరూపించడానికీ గురజాడ చేసిన ప్రయత్నమే కన్యాశుల్కం నాటకసృష్టి. తన కాలం కంటే తన కాలపు రచయితల కంటే ఎంతో ముందుచూపు గురజాడది.

గురజాడ ముఖ్యంగా మూడు ప్రయోజనాల్ని ఉద్దేశించి కన్యాశుల్కాన్ని

రచించాడు. అవి 1. సంఘసంస్కరణం, 2. భాషాసంస్కరణం, 3, ఉత్తమనాటక సృష్టి. ఇవే 'కన్యాశుల్కం' రచనకు భూమికలు. వీటిని గురించి చూద్దాం. "కసాయి వాడు ఎక్కడో పుట్టిన పశుమాంసము విక్రయిస్తాడు. నీవు కడుపున పుట్టిన శిశు మాంసమును విక్రయిస్తున్నావు. నీ వ్యాపారము కంటె వాడిదే మంచిది". 'కన్యా శుల్కం' నాటకరచనకి 12 సం॥ల ముందు కందుకూరి అదే పేరుతో రాసిన ఓ నాటిక లోని ఒక పాత్ర అన్నమాటలివి. అదే సంవత్సరం మే నెలలో 'వివేకవర్థని' పత్రికలో ఓ వ్యాసం రాస్తూ కందుకూరి అన్నమాటలివి ".... లోకములో మాంసం విక్రయము చేయువారు సహితము మనుష్యేతర జంతువుల మాంసమునే విక్ర యింతురుగాని యీ దేశము నందలి బ్రాహ్మణవేషధారులయియున్న ఘోరరాక్షసుల వలె నరమాంస విక్రయము చేయుటకొడంబడరు. ఇది కేవలము నరమాంస విక్ర యమే కాదు. తమ కడుపున బుట్టిన బిడ్డలనే నిష్కరుణులయి యమ్ముకొనుట. మాంసం విక్రయముజేయువారు జంతువును జంపి, దాని మాంసమును అమ్ము కొందురు. మరణమువలన నిముషములో దాని బాధ నివారణ మగును. ఈ నర మాంసవిక్రయమున కొడిగట్టుకొను క్రూరులో! తమ బిడ్డల మాంసమును బ్రతికియుండ గానే యమ్ముకొందురు. అందువలన ఆ కన్నియలు యావజ్జీవితమును మితిమీరిన బాధ ననుభవించిన వారగుచున్నారు". గురజాడకి ఆత్మీయుడు, విజయనగర సంస్థానా ధీశుడు ఆనంద గజపతి 1887 నుంచి 3సం॥లు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యు డిగా వున్నారు. ఆ సమయంలో ఈ కన్యాశుల్క సమస్యపై ఆయన దృష్టి ప్రస రించింది. ముఖ్యంగా ఉత్తరాంధ్ర కళింగాంధ్ర) ప్రాంతంలో. ఈ కన్యాశుల్క వివాహాలు ఎక్కువగా జరగడం, పసితనంలో వున్న కూతుళ్ళను కాటికి కాళ్ళు చాచుకున్న ముసలివగ్గులకు అమ్ముకోవడం ఆయన మనసుని కలచివేసింది. దాన్తో ఆ వివాహాల వివరాల పట్టిక ఒకదాన్ని తయారుచేయించాడు. మూడు సంవత్సరాలకా లంలో1034 శుల్కవివాహాలు జరిగాయి. అంటే సంవత్సరానికి సగటున344 పెళ్ళిళ్ళు జరిగాయి. అందులో 1 నుంచి 5 సం॥ల లోపు వయసులో 188 మంది బాలికలు వివాహితులయ్యారు. ఈ బిడ్డలకు తలిదండ్రులు పుచ్చుకున్న శుల్కం రు. 340/- నుంచి రు. 400/- వరకు ఉందట. పొత్తిళ్ళలోని పసికందులకు కూడా బేరసారాలు జరగటం మరీ విచిత్రమైన విషయం. ఒక్క విశాఖ జిల్లాలోనే కాదు. దక్షిణ భారత దేశంలోని అనేక మండలాల్లో కూడా ఈ అనాచారం అమలులోవుందని తెలుసు కున్నాడు. కేవలం ఉత్తర సర్కారు జిల్లాల్లోనే సంవత్సరానికి వెయ్యి శుల్క వివా

---

★ జీవితాన్ని ధారపోసినంత మాత్రాన ఒకరు చరితార్థుడు కాడు. వీరమరణం పొందినందువల్ల అతను అమరుడు కాడు. ఏ ఆదర్శం కోసమయితే జీవితాన్ని ధారపోస్తాడో, ఆ ఆదర్శపు ఔన్నత్యాన్ని బట్టి అతడు చరితార్థ డౌతాడు.
— గురజాడ

హాలు జరుగుతున్నట్లు ఆయన గ్రహించారు. ఈ విధంగా పిల్లల్ని అమ్ముకోవడం పూర్వం బజారులో బానిసల్ని అమ్ముకోవడంతో సమానమైందిగా భావించారు. ఇది అసుర వివాహాలనీ వీటిని ఉపేక్షించడం క్షంతవ్యం కాని తప్పిదం అవుతుందని భావించి ఆనంద గజపతి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో కన్యాశుల్క బిల్లును ప్రవేశ పెట్టారు. దాన్నే "Kanya Sulka Act of 1889" అని పేర్కొవటం జరిగింది. ప్రభుత్వం ఎన్. సుబ్రహ్మణ్యం అయ్యర్, (కోడై కెనాల్) పి. చంచలరావు (మైలాపూర్), అనే ఇద్దరు అనధికార సభ్యుల అభిప్రాయాన్ని కోరింది. ఆ ఇద్దరు ఈ బిల్లును వ్యతిరేకించారు. బాల్యవివాహాలవల్లే కన్యాశుల్కం ప్రబలుతుందనీ, దాన్ని తొలగిస్తే, దానితోపాటు ఇది కూడా రూపుమాసిపోతుందనీ, ఆ కారణంచేత కన్యాశుల్క నివారణ కోసం ప్రభుత్వం ప్రత్యేక శాసనం ద్వారా జోక్యం చేసుకోవలసిన అవసరం లేదనీ సూచించారు. ఈ విధంగా దేశీయుల ప్రతి ఘటనతో ఆనందగజపతి ప్రయత్నం విఫలమైంది. తన ప్రయత్నం ప్రభుత్వ పరంగా విఫలమైనా, ఆనంద గజపతి నిరాశ చెందలేదు. గురజాడతో చర్చించారు. పాశ్చాత్య సాహిత్యాలతో పరిచయమున్న ఈ ఇద్దరూ సమాజంమీద సాహిత్యం-అందులోను నాటకం ప్రభావం అపరిమితమైనదని గ్రహించారు. ఆనంద గజపతి గురజాడను నాటక రచనకు ప్రోత్సహించారు. "ప్రజాబాహుళ్యానికి పుస్తక పఠనం అలవాటయ్యేదాకా అలాంటి ఆరోగ్యకర ప్రభావ వ్యాప్తికై నాటకరంగాన్ని ఆశ్రయించవలసి వుంటుంది. కన్యాశుల్కం నాటకరచనకు నన్ను ప్రేరేపించినది ఇదే" అని కన్యాశుల్క తొలి పీఠికలో గురజాడ చెప్పుకున్నాడు. ఇలా కనాశుల్క నాటక రచనకు పరోక్ష కారణం కందుకూరి. సాహిత్యపోషణకు, స్త్రీ విద్యాప్రోత్సాహానికీ, శుల్కవివాహాల నిర్మూలనానికీ కృషిచేసిన ఆనంద గజపతి ప్రత్యక్ష కారణం. బంగారు పళ్ళానికైనా గోడ చేర్పు అవసరమే కదా !

ఆనంద గజపతి తయారు చేయించిన శుల్క వివాహాల పట్టిక అసమగ్రమైనా విలువైన పత్రంగా తోచింది గురజాడకు. మరీ ముఖ్యంగా తల్లి కడుపులోవున్న బిడ్డలకు కూడా బేరసారాలు జరగటం వింతేకాదు, పరమహేయంగా కూడా తోచింది. ఇలా సమకాలీన సమాజంలో తన కళ్ళ యెదుటే నాగజెముడులా విస్తరిస్తున్న ఈ దురాచారాన్ని, దుర్మార్గాన్ని బట్టబయలుచేసి; ఉత్తమ నాటక భావాల్ని వ్యాపింప చేయటానికే గురజాడ కన్యాశుల్కాన్ని రచించాడు. కేవలం ఒక్క కన్యాశుల్కమే

---

★ మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయిరప్పల కన్న
కనిష్ఠంగా చూస్తావేల, బేలా?

—గురజాడ

కాదు. దాన్ని ఆశ్రయించి, దాన్తో కలిసిపోయి ఇంకా బాల్య వివాహాలు, విధవా పునర్వివాహ నిషేధం, వేశ్యా సమస్య మొదలైన సమస్యలు కూడా ఉన్నాయి. కన్యాశుల్కాన్ని భూమికగా చేసికొని, ఈ సమస్యల సోపానంతో గురజాడ నిర్మించిన మహాసౌధం 'కన్యాశుల్కం'.

సంఘ శ్రేయస్సుకోసం కలం పట్టిన గురజాడ ప్రజల భాషలోనే తన రచన సాగించటానికి నిశ్చయించుకున్నాడు. 'కన్యాశుల్కం' తొల్చికూర్పు నాటికి వ్యావహారిక భాష ఉద్యమ రూపం దాల్చలేదు. 1906 తర్వాత మాత్రమే అది ఉధృతమైన ఉద్యమ రూపాన్ని సంతరించుకుంది. 'మొట్టమొదటి' కన్యాశుల్కానికి ముందు తెలుగులో వ్యావహారిక భాషలో రచింపబడ్డ నాటకాలు లేవు. కందుకూరి వీరేశలింగం గారు 'బ్రాహ్మవివాహం', 'వ్యవహార ధర్మబోధిని'. 'వివేకదీపిక' అనే ప్రహసనాల్ని వ్యావహార భాషలో రచించారు. వేదం వేంకటరాయ శాస్త్రిగారు 'నాగానంద' అను వాదంలో నీచపాత్రలకు మాత్రమే వ్యావహార భాషను ఉపయోగించారు.

కానీ గురజాడ - రచయితగా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవాలనే దృష్టితో ఈ నాటకం రాయలేదు. ఆ మాటకొస్తే అసలు 'కన్యాశుల్కం' రాసే నాటికి తెలుగు రచయితగా స్థిరపడాలనే ఉద్దేశం కూడా ఆయనకు లేదు. ఒక సాంఘిక ప్రయోజనాన్ని ఉద్దేశించి రాశాడు. సామాన్య ప్రజానీకానికి తన భావాలు చేరాలంటే - వాళ్ళు నిత్యజీవితంలో వ్యవహరించే భాషనే మాధ్యమంగా స్వీకరించాలి. ఆయా మాండలికాల స్ఫూర్తిని గుర్తిస్తూ రచన చేయాలి. నాటకంలో తాను ప్రయోగించే మాటలు దారుణాస్త్రాలై దురాచారానికి పాల్పడే వాళ్ళని చీల్చిచెండాడేవిగా మాత్రమే కాదు-సుతిమెత్తని హాస్యంతో గిలిగింతలు పెడుతూ, ఆలోచింపచేసేవిగా వుండాలి. ఈ లక్ష్యంతో గురజాడ ఈ నాటకాన్ని రచించాడు. అప్పటికే ప్రపంచ నాటకరంగం క్రమేణా మార్పులకు లోనౌతున్నది. వర్తమాన సమాజము, సామాజిక సమస్యలు. ఇతివృత్తాలుగా నాటకకర్తలు, వచనంతో ప్రజా భాషలో నాటకాలు రచిస్తున్నారు. ప్రపంచ సాహిత్యాల్తో-అందునా ఆంగ్ల సాహిత్యంతో విశేష పరిచయం వున్న గురజాడ వాళ్ళ మార్గాన్నే తన మార్గంగా మలచుకొన్నాడు. ముఖ్యంగా ఇబ్సెన్ ప్రభావం గురజాడమీద చాల ఎక్కువగా వుంది. గురజాడ ఆంగ్లవిద్యా.ప్రవీణుల్లో ఒకడనీ, ఆంగ్ల భాషలో కవి అనీ; షేక్స్పియర్, మోలియర్, బెంజాన్సన్ మొ॥ మహాకవుల, నాటకకర్తల గ్రంథాల్ని నిరంతరం చదివేవాడని తొలి కన్యాశుల్కానికి

★ దేవుడెక్కడో దాగెనంటూ
కొండకోనల వెతుకులాడేవేలా?
కన్ను తెరచిన కానపడడో
మనిషి మాత్రుడి యందు లేడో?

—గురజాడ

నాంది ప్రస్తావనలు (సంస్కృతంలో) రాసిన ముడుంబై నరసింహాచార్యస్వామిగారు పేర్కొన్నారు. కన్యాశుల్క నాటకం తొలి ముద్రణ (1897)తోపాటు ముద్రించ బడిన గోమఠం శ్రీనివాసాచారి 'ఆంగ్ల హరిశ్చంద్ర' నాటకానికి గురజాడ రాసిన పెద్ద పీఠిక వల్ల గురజాడకు ఇబ్సెన్‌తోగల పరిచయం తెలుస్తున్నదీ. ఈ ప్రభావాలవల్ల గురజాడ తన కన్యాశుల్కాన్ని దేశీయావసారాలకి తగ్గట్టుగా వ్యావహారిక భాషలో రచించాడు. కానీ 'కన్యాశుల్కం'లోని భాష పండిత నిరసనానికి లోనుకావటం ఆశ్చర్యపడవలసిన విషయమేమీ కాదు. "గ్రామ్యభాష అనే తప్పుడు పేరుతో పిలిచే భాషను వాడటంవల్ల సాహిత్య రచనల ఔన్నత్యం మంటగలుస్తుందని కొందరంటు న్నారు. కాని నేడు భాష గుణగణాల్నీ, ప్రయోజనాన్నీ అంచనా కట్టేందుకు, పాతకాలపు పండితులైన వైయాకరణుల పైత్యాలకన్న ఉత్తమ ప్రమాణాలు, భాషాశాస్త్ర ప్రగతి పుణ్యమా అని నెలకొన్నాయి. అందువల్ల ఇటువంటి విమర్శను మనం ఖాతరు చేయవలసిన పనిలేదు" అని మొదటి కూర్పు పీఠికలో గురజాడ చెప్పుకొన్న విషయం. వాదోపవాదాలవల్ల నూతన కావ్యభాష రూపొందగలదనీ, ఒక గొప్ప రచయితవల్ల మాత్రమే అది రూపొందగలదనీ, అందుకు పునాది వేయమని చెప్పిన గురజాడ పునాదితోపాటు భవనాన్ని కూడా తానే నిర్మించి, తానే ఆ గొప్ప రచయితనని కాలంలో నిరూపించుకొన్నాడు." వాడుకభాషకి ఏ ఒక్కరైన ఇంత గౌరవం సాధించారంటే అతడు అప్పారావనే చెప్పాలి.... కులాలకూ, మనః ప్రవృత్తులకూ చెందిన ఎందరో వ్యక్తులు నిత్యజీవితంలో తాము ఎలాగ మాట్లాడతారో అలాగే 'కన్యాశుల్కం'లో మాట్లాడతారు. ప్రేక్షకులను మనస్సులో పెట్టుకొని, వారిని నవ్వించడానికి కృత్రిమంగా ప్రవేశపెట్టిన సంభాషణలేవీ ఈ నాటకంలో లేవు" అని శ్రీశ్రీ గురజాడ భాషా కృషిని ప్రశంసించింది ఇందువల్లనే. కన్యాశుల్క రచనకు ప్రేరకమైన భాషాసంస్కరణ దృష్టి, ఆ నాటక మహోన్నతికి మార్గాన్ని ఏర్పరచటం గుర్తింపవలసిన అంశం.

ఇక కన్యాశుల్క నాటక రచనా ప్రేరణకు కారణమైన అంశం ఉత్తమ నాటక రచన అనేది. గురజాడ సమకాలికులలో ధర్మవరం కృష్ణమాచార్యులు, వేదం వేంకటరాయ శాస్త్రి, కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, కోలా చలం శ్రీనివాసరావు. తిరుపతి వేంకట కవులు వంటి ప్రసిద్ధ నాటక కర్తలు అడు గడుగునా పద్యాలతో నిండిన, గద్య పద్యాత్మకమైన నాటకాలు రచించారు. హార్మోని యానికి అనుగుణంగా వీళ్ళు ఆ నాటకాల్లోని పద్యాల్ని నిర్ణీతమైన రాగాలతో అసా

★ "చెట్టపట్టాల్ పట్టుకుని
దేశసులంతా నడవవలెనోయ్"

— గురజాడ

ధారణంగా అలపిస్తూ ఉంటే ప్రేక్షకుల్లో ఆనందోత్సాహాలు వెల్లువిరిసేవి. అభినయానికి ఆవకాశం ఆరుదు. నాటక కథల గురించి కానీ, నాటక ఉపదేశం గురించి కానీ రచయితలకు పట్టలేదు. ప్రేక్షకులకు అక్కర్లేదు. ఆనాటి 'మూసపోత' నాటకాల్లో గురజాడ "కన్యాశుల్కం" 'అచ్చమైన మంచి నీల ముత్యం'. ఈ నాటకం జీవితం నుంచి పుట్టుకొచ్చింది. జీవితాన్ని ప్రదర్శించింది: వ్యాఖ్యానించింది. రుగ్మతలకు చేయవలసిన శస్త్రచికిత్సను చేసింది. వాస్తవికతను ప్రతిబింబించింది. అయితే ఇది సమస్యా ప్రధానమైన నాటకమే కానీ, పరిష్కారాత్మకం కాదనీ ఒక విమర్శ లేక పోలేదు. "కన్యాశుల్కం నాటకం పిలవని పేరంటానికి 'మా అప్ప పట్టుచీరె కట్టుకొస్తాన'ని బయలుదేరి యేదో వాక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలవంతంగా నెత్తిన రుద్దదు. కానీ దానికి ఒక మహత్తరమైన నైతిక ప్రయోజనం వుంది" అని గురజాడ తన మిత్రుడు వంగోలు మునిసుబ్రమణ్యానికి రాసిన లేఖలో పేర్కొన్నాడు. చెప్పదలచిన నీతిని చెప్పటం కోసమే రచన సాగిస్తే, అది ప్రమాణాలకు లోబడి వాస్తవికతకు దూరంకాక తప్పదు. మన సాహిత్యంలో జరిగిందీ, జరుగుతున్నదీ అదే. కాబట్టే గురజాడ జీవితంలాగానే నాటకాన్ని కూడా తీర్చిదిద్దాడు. ఈ కారణంతోటే దాని విస్తృతి పెరిగింది. సమస్యల సంక్లిష్టతే దాని మహోన్నత స్థాయికి అద్దం పట్టింది. 'కన్యాశుల్కం' దానంతట అది ఒక స్వతంత్ర సమస్య కాదు. దాన్ని షడుగుపేకల్లా అల్లుకొని మరెన్నో సమస్యలున్నాయి. వాటిని విడిచి ఒక్క కన్యాశుల్కాన్ని నిరసిస్తూ నాటకం రచిస్తే అది రచయిత పాక్షిక దృష్టి మాత్రమే అవుతుంది. ఆ లోపాన్ని గుర్తించే గురజాడ ఈ నాటకాన్ని 'బిడియం అడ్డు వస్తున్నా' పెద్ద నాటకంగా తిరగ రాశాడు. రకరకాల పూలను ఏరితెచ్చి, వాటి రంగుల ప్రత్యేకతల్ని బట్టి సూత్రంలో బంధించి దండలు కట్టేవాడు, కంటికి ఇంపు కూర్చినట్లుగా, నాటక కర్త వేర్వేరు అంశాల్ని, ప్రాధాన్యతని బట్టి చక్కగా గుదిగుచ్చి మూలసూత్రంలోంచి విడిపోవని విధంగా కూర్చి చక్కని ఐక్యతను సాధించాడు. జీవకళ ఉట్టిపడే పాత్రలు, పామరుల్ని సహితం రంజింపచేసే సులభమైన వెన్నపెట్టే భాష, సుగమంగా సాగిపోయే శైలి, భావగర్భితమైన పదజాలంతో కూడుకొన్న భాష, చమత్కారమైన కల్పన, నాటక రచనలోని పొంకము, బింకము, అన్నిరకాలా సమగ్రత్వం కన్యాశుల్కాన్ని 'ఏకమేవా అద్వితీయం' చేసాయి.

గురజాడ ప్రతిభా సర్వస్వం ప్రతిఫలించిన అద్భుత మణిదర్పణం 'కన్యాశుల్కం'.

---

★ "బ్రతికి చచ్చియు ప్రజకెవ్వడు
ప్రీతి గూర్చునో వాడె ధన్యుడు"

—గురజాడ

# అవసరాల సూర్యారావు జ్ఞాపకాలు

— జయంతి రామలక్ష్మణ మూర్తి

(గురజాడ తన సాహిత్యం ద్వారా, చూపించిన అభ్యుదయ మార్గాన్ని, ఆయన తర్వాతి తరంవారు అందుకోలేకపోయారు. 1940 ప్రాంతాల్లో కమ్యూనిస్టు పార్టీ వీరేశలింగం, గురజాడల సాహిత్యాన్ని ప్రజలకందుబాటులోకి తెచ్చింది. గురజాడ రచనల వ్రాత ప్రతులన్నిటినీ, సంస్కరించే బాధ్యత అవసరాల సూర్యారావు తీసుకొన్నాడు. గురజాడ ఇంగ్లీషులో రాసిన రచనలూ, డైరీలూ అవసరాల సూర్యారావు అనువదించారు. గురజాడ తెలుగులో రాస్తే విజయనగరం నుడికారంతో ఎలా రాసి వుండేవారో వూహించి ఆ విధంగా అనువదించారు. ఈ అనువాదాల్లో కొన్ని తప్పులు దొర్లి వుండవచ్చు. కొన్ని అనువదింప బడి వుండకపోవచ్చు. ఆ మధ్య ఈ విషయాన్ని కొండంతలుచేసి అవసరాల సూర్యారావు చేసిన గణనీయ మైన కృషినంతటినీ అపనిందలపాలు చేయడం జరిగింది-అదీ నార్లవారి సారథ్యంలో. ఇటీవల పునః ప్రచురించబడుతున్న 'గురజాడ సాహిత్యం'లో అవసరాల సూర్యారావు పేరు అదృశ్యం కావడం చాలా విచారకరమైన విషయం.

అవసరాల సంపాదకత్వంలో గురజాడ రచనలు 'వ్యాస చంద్రిక', 'కొండు భట్టీయం-బిల్హణీయం', డైరీలు, 'మాటా మంతీ: అవీ, ఇవీ', 'లేఖలు', 'ముత్యాల సరాలు', 'ఆణిముత్యాలు' వెలువడినయ్.

అవసరాల సూర్యారావు 'నల్లబూట్లు' 'పంజరం' అనే నాటకాలూ, 'ఆకాశ దీపాలు' అనే కథల సంపుటీఇవిగాక ఇంకా కొన్ని నాటికలూ, కవితలూ రాశారు.

అవసరాల గురించి జయంతిగారి జ్ఞాపకాల్ని ఇక్కడ అందిస్తున్నాం

— సం॥)

గురజాడను స్మరించుకొంటే అవసరాల స్ఫురణకు వస్తాడు.

గురజాడ సాహిత్యం వెలుగులోకి తెచ్చే కృషి-'విశాలాంధ్ర ప్రచురణాలయం, వారి సహాయంతో-భగీరథ యత్నంగా సాగించిన వాడు అవసరాల.

ఆయనతో మరీ పరిచయం లేకపోయినా ఉన్న పరిచయాన్నే - "గురజాడ కన్యాశుల్కం ప్రదర్శన శతజయంతి" ఉత్సవం జరుపుకుంటున్న ఈ తరుణంలో-చెప్పుకోడం ఉచితమని భావిస్తున్నా.

సన్నగా-బక్కగా—చామన చాయ రూపం అవసరాలది.

చూస్తే మేధావిగా కనిపించడు కాని కనిపించని మేధోనిధి అవసరాల.

వారిని ఎక్కువగా కలిసింది-విజయనగరంలో-కీ.శే. కిళాంబి రంగాచార్యులు గారి-"వందేమాతరం" పక్ష పత్రికా కార్యాలయంలో.

మేం సాధారణ కార్యకర్తలమయినా ఎంతో అభిమానంతో, ఆదరంగా పలకరిస్తూ ఉత్సాహం కలిగించే వారిని మరవలేం.

'వందేమాతరం' సంపాదకులూ, బాధ్యులూ రంగాచార్యులుగారే అయినా-అవసరాల సంపాదక బాధ్యతలు నిర్వహిస్తూ ఉండేవాడు.

ఆనాడు "వందేమాతరం" ప్రాంతీయమైన చిన్న పత్రిక అయినా - సంచలనాత్మకమైంది.

అన్యాయాలు, అక్రమాలు, వంచనా, మోసం, దౌర్జన్యం, పెత్తందారీ తనం-ఆ పత్రికాముఖంగా బయట కొచ్చేవి.

పెత్తందార్ల దౌర్జన్యాలను ఎదిరించే వారికి ఎంతో ప్రోత్సాహం - బాసటా "వందేమాతరం."

యువకులకూ, కార్యకర్తలకూ ఎంతో ఉత్సాహాన్నిచ్చేదా పత్రిక.

"బాబా గ్రస్త విజయనగరం" అన్న శీర్షిక ఎప్పుడూ మరిచిపోలేం.

విజయనగరం చుట్టూ ఉండే-కొందరు బాబాలూ, స్వాములూ-ఎలా మోసం చేస్తున్నారో-దొంగలకి దోపిడిగాళ్ళకీ నెలవులుగా ఆ ఆశ్రమాలున్నాయో వివరించే వ్యాసాలు వరసగా ఆ శీర్షికలో ప్రచురించారు.

ఓ తమాషా శీర్షిక "టిక్కెట్టు లేని భరత నాట్యం".

ప్రముఖ కాంగ్రెసు నాయకుడొకడు తాగి మెయిన్‌రోడ్డులోనే చిందులేసిన ఉదంతం అది.

కోటాదారుల అన్యాయాలు, అధికార్ల లంచకొండితనం-ఆ పత్రిక ద్వారా వెలుగులోకి వచ్చేవి.

అవసరాల రాసిన నాటకాల్లో "నల్లబూట్లు" ఒకటి.

విజయనగరంలో జరిగే రాఘవ నాటకోత్సవాల్లో ఓ సంవత్సరర ఈ "నల్ల బూట్లు" ప్రదర్శించారు.

ఎంతో సంచలనం కలిగించిందా నాటకం.

నాటకం ముగింపులో - రిజర్వు పోలీసు తన బూట్లు విప్పి పారేస్తూ-"ఈ బూట్లు నేను నిలబడలేనని కాదు, ఈ ప్రభుత్వం నిలబడలేదని" అంటాడు.

ఇది పోలీసుల్లో ఆలోచనలు రేకెత్తించేది.

---

★ గురజాడ ఆలోచనలన్నీ విపరీతమైనవే. తమను తాము దర్శించుకుంటూ యితరులను సందర్శిస్తూ వ్యక్తి జీవితాన్నీ, సామాజిక మనః ప్రవృత్తినీ యీ రెండింటినీ ఒకేసారి కొలుచుకుంటాయి. ఇవి సత్తాపడి కట్టురాళ్ళు. వ్యక్తినీ, సంఘాన్నీ మానవ చైతన్యాన్నీ-ప్రకృతినీ శాస్త్రదృష్ట్యాచూసి, తూచి ఆ విలువలను బరువులను లెక్కగడతాయి."

—అవసరాల సూర్యారావు

నాటకం ముగిసే సరికి-చూస్తున్న పోలీసాఫీసర్లు-స్టేజి మీదకు వచ్చి - "ఈ నాటకాన్ని ప్రదర్శించడానికి మీకెవరు అనుమతి ఇచ్చేరు" అంటూ ప్రశ్నించేరు.

ఇది అంతకు ముందు ఆంధ్ర యూనివర్శిటీలో ప్రదర్శింపబడిందట.

అక్కడే ఉన్న సోమసుందర్, రాంషా-పట్టాని ఉత్సాహోద్రేకాలతో-స్టేజి మీదికివచ్చి-అవసరాలను ప్రశంసలతో ముంచెత్తారు. మరెందరో కూడా.

ఈ నాటకంలో చమత్కారం-తాగుడుకి అలవాటుపడి-నాటుసారాను పట్టుకొంటూ విపరీతంగా తాగివస్తున్న-రిజర్వ్ కానిస్టేబిల్ను ఉద్దేశించి అతని భార్య-"వంట సారా వచ్చి-తాగుడు మరింత ఎక్కువైపోయింది" అంటూ ఆక్రోశిస్తుంది.

అదే సమయంలో-వాళ్ళబ్బాయి పాఠం చదువుతూ ఉంటాడు. "కావుననే ప్రభుత్వంవారు గృహ పరిశ్రమలను ప్రోత్సహించిరి" అని చదువుతాడు.

మరోచోట-విద్యార్థుల వూరేగింపుపై పోలీసులు కాల్పులు జరుపుతున్నా-కదలని విద్యార్థుల ప్రస్తావన వచ్చినపుడు "ది బోయ్ స్టుడాన్ ది బర్నింగ్ డెక్" పదే పదే చదువుతాడు.

ఇంకో దృశ్యంలో-కాల్పుల్లో తన బిడ్డ మిత్రుడు-మరెందరో విద్యార్థులూ చనిపోడాన్ని తలచుకుంటూ ఇంటికి వస్తాడు రిజర్వ్ కానిస్టేబుల్.

అప్పుడు-చదువుతాడా అబ్బాయి- "కావున-సహనమును కోల్పోయిన సైనికులు తిరగబడిరి" అని ప్రథమ స్వతంత్ర పోరాట ఘట్టాన్ని చదువుతాడు.

నాటకీయమైన ఈ శిల్పం చెప్పదలచిన అంశాన్ని ఆలోచించేలా చెప్పడం-నాటకంలో ప్రదర్శించిన ప్రజ్ఞ అవసరాలది.

ఎప్పుడో-30-35 సం॥ల కిందట చూసిన ఈ అంశాలు గుండెకు హత్తుకపోయేయి,

అవసరాల జ్ఞాపకం వస్తే
ఈ అంశాలు జ్ఞాపకం వస్తాయి.
గురజాడను స్మరించుకుంటే
అవసరాల స్ఫురణకు వస్తాడు.

★ తాను ఆలోచిస్తూ యితరుల ఆలోచనలను రేకెత్తిస్తున్న అంతర్ముఖుడే మహాకవి గురజాడ. వ్యక్తి చైతన్యాన్ని, మానవ చైతన్యాన్నీ మార్చివేసిన మహాత్ముడు."

— అవసరాల సూర్యారావు




## మన గురజాడ తాతయ్య

మీలో చాలా మందికి 'గురజాడ' తాతగారు తెలుసు ననుకుంటాను. 'దేశమంటే మట్టికాదోయ్ - దేశమంటే మనుషులోయ్' అన్నారాయన ఆ పాట మీరు వినే ఉంటారు. అలాగే 'తిండి ఉంటే కండ కలదోయ్ - కండ గలవాడే మనిషోయ్' అని కూడా ఆయన అన్నారు. అదిగో ఆ తాతగారు 'కన్యాశుల్కం' అనే గొప్ప నాటకం రాశారు. వంద సంవత్సరాలుగా ఆ నాటకాన్ని ప్రదర్శిస్తూనే ఉన్నారు. మరో వంద సంవత్సరాలు ప్రదర్శించినా మనం ఆశ్చర్యపోనవసరంలేదు. మీకుతెలుసా? మనిషి జీవించేది వందసంవత్సరాలు అని చెబుతారు. ఆరోగ్యంగా ఉండేవారు ఇంకా ఎక్కువ కాలం బ్రతకవచ్చు. అలాగే అంతకంటే ముందుగానే రకరకాల



కారణాలతో మనుషులు మరణిస్తారు.

ఇప్పుడు చూడండి. గురజాడ తాతగారు లేరు,ఆయన రాసిన నాటకం ఉంది. ఇలానే ప్రపంచసాహిత్యంలో కొద్దిమందితాము మరణించినా తన పుస్తకాలద్వారా జీవించే ఉన్నారు. రేపు మీరు పెద్దవుతారు నాన్నలవుతారు,తాతలవుతారు.అయినా గురజాడ తాతగారుంటారు.ఒకమనిషిజీవితం కంటేపుస్తకాల జీవితంఎందుకంత ఎక్కువ? ఈవిషయాల గురించి మీరు తెలుసుకోవాలి. అంతే కాదు. మీ నుండే 'గురజాడ'లూ, 'శ్రీశ్రీ'లూ రావాలి. అందుకే అలాంటి వారి గురించిన పుస్తకాలూ, వారు రాసిన పుస్తకాలూ ఎక్కడ దొరికినా చదవండి.

గురజాడ తాతగారు పిల్లల కోసం ఎన్నెన్నో పాటలు రాశారు. ఆయన బాల్యకథ ఈ సంచిక మీ కోసం.

— అంకుల్

నిర్వాహణ ; పి. చంద్రశేఖర్ అజాద్ APSTC Ltd., డి. సి. ఎమ్. ఎన్. బిల్డింగ్స్, ఎన్. ఆర్. పేట, ఏలూరు.

కథ

## జి. వి. అప్పారావు బి.ఎ.బి.ఎల్.,

విశాఖపట్నం జిల్లాలో రాయవరం గ్రామం. మన గురజాడ తాతగారు తన తాతగారైన కృష్ణయ్య పంతులుగారింట్లో ఉండేవారు. ఆయన మునసబు కోర్టులో ఒక ఉద్యోగం చేసేవారు. గురజాడ తాతేమో తన తాతగారికి అప్పుడప్పుడు క్యారేజి పట్టుకు వెళ్తుండేవాడు. అక్కడ కోర్టు మునసబుగారిని చూస్తుండేవాడు.

ఓ రోజు ఏమైందంటే-

కోర్టు మూసేశాక పిల్లలంతా ఆ ఆవరణలో ఆడుకుంటున్నారు.

"పెద్దయ్యాక నువ్వేం అవుతావురా" అనేది ఆ రోజు ఆట.

"నేను పంతులుగార్నవుతా" అన్నాడో బాబు.

"నేను డాక్టర్ని"

"నేను తాసీల్దారుని"

అందరూ చెబుతున్నా మన గురజాడ తాత మాత్రం మాట్లాడలేదు. పిల్లలందరూ వెళ్ళిపోయాక కోర్టు తలుపుమీద "జి.వి. అప్పారావు, బి.ఎ.బి.ఎల్. జిల్లామునసబు" అని రాసి వెళ్ళిపోయాడు.

మర్నాడుమునసబుగారుమనగురజాడ తాతగార్ని పిలిచి 'ఎవరురాశార్రా?' అన్నారు

"నేనే" అన్నాడు భయం లేకుండా.

"రాసేవాడివి పక్కన గోడమీద రాయక తలుపుమీద ఎందుకు రాశావ్ ?"

"చాక్‌పీస్‌తో తెల్లగోడమీద రాస్తే అక్షరాలు కనిపించవని" అన్నాడు.

మునసబుగారు నవ్వుకున్నారు.

అలా మునసబుగా మారాలనుకున్న మన గురజాడ తాత గొప్ప కవిగా, రచయితగా మారి ఈ సమాజం ఇలా ఉండకూడదని తీర్పు చెప్పారు.

మరి ఆయన గురించి ఇంకా చాలా చాలా తెలుసుకుంటారు కదూ.

—క్రాంతి కిరణ్

## మిణుగురులు

—గురజాడ

అరటి కాయ బజ్జి
మినపప్పు సొజ్జి
కలసి మెలసి తిందాం
కథలు విథలు విందాం.

ం ం ం

ఏనుగు ఎక్కి మనము
ఏ వూరెళదాము ?
ఏనుగు ఎక్కి మనము
ఏలూరెళదాము !

## 2010వ సంవత్సరంలో

గత నెల ఈ అంశంమీద రాయమని అడిగానుకదా. సమయం తక్కువ కావటంతో ఇంతవరకు ఎవరూ రాయలేదు. వచ్చే సంచికకి 2010 సం॥లో ఎలా ఉండాలో ఊహిస్తూ రాస్తారుగా !

# కథ అడ్డంగా తిరిగింది

— పామరుడు

సెన్సు పత్రికలూ, చేతబడి వీక్లీలూ తప్పించి బాధ్యతాయుతమైన ప్రముఖ దినపత్రిక సంపాదకులు, తమ సంపాదకీయాల్లో - అది రాజకీయమైనది కానీండి, ఇతరత్రా కానీండి-'కన్యాశుల్కం'లోంచి ఒక డైలాగ్ ఉటంకిస్తూ ఆ సంపాదకీయానికే ఓ వన్నె తెస్తూ ఎంతో ఔచిత్యంతో సందర్భానుసారం పక్కా అతికినట్టు రాసేవారు. (ఇంకా రాస్తున్నారనుకోండి). నిజానికి మరే నాటకంలో డైలాగులూ ఇంతగా ప్రభావం చూపినట్టులేదు.

"తాంబూలాలిచ్చేసేను తన్నుక చావండి."

"డామిట్- కథ అడ్డంగా తిరిగింది."

"నువ్వులు జాగ్రత్త చేసారా?"

---

## 1992 జూన్ 27, 28 శని, ఆదివారాల్లో విశాఖపట్నం కళాభారతి ఆడిటోరియంలో ఇచ్చిన 'కన్యాశుల్కం' ప్రదర్శనపై సమీక్షా వ్యాసాలు

---

"తెలియనివాడికి అది మంచినీళ్ళే. తెలిసిన వాళ్ళకి గంగంతా 'సారా' నుమండీ".

"వేశ్యకి కూడా నీతి వుంటుంది."

ఇలా చెప్పుకుపోతే 'కన్యాశుల్కం' నాటకం అంతా ఒక్క డైలాగూ పొల్లు పోకుండా ఉటంకించాల్సిందే.

వంద సంవత్సరాల పైమాటే అయినా-ఆ డైలాగులు నిత్యనూతనంగా గంధం చెక్క అరగదీసినకోద్దీ సువాసన వెదజల్లే తీరులా-ఇంకా ఇంకా రాణిస్తున్నాయేగాని, మొహం మొత్తటం లేదు-వాసి తరగటం లేదు.

నిజానికి 'కన్యాశుల్కం' తెలుగు వారి అపురూప గ్రంధం, నాటకం. గురజాడ వారు-షేక్స్పియర్, కాళిదాసు కోవకి చెందిన వారంటే అతిశయోక్తి కాదు.

ఇదిలావుండగా 'కన్యాశుల్కం' నాటకంమీద-ఎన్నో పరిశోధనా పత్రాలూ, వ్యాసాలూ, సమీక్షలూ వెలువడ్డాయి. ఆ మధ్య ఏదో పత్రికలో చదివాను - 'కన్యాశుల్కం'లో-అతి ముఖ్యమైన పాత్రలు, అంటే గిరీశం, మధురవాణీ, రామప్పంతులు వంటివి లేకుండా, కొన్ని సీన్లు వేసి ప్రేక్షకుల్ని రక్తికట్టించారని, అదొక "ప్రెస్టేజి ఇష్యూ"గా తీసుకుని - పురాణం సుబ్రహ్మణ్యశర్మగారూ, రావి శాస్త్రిగారూ, తదితరులూ ఎంతో రక్తి కట్టించారని....అదొక సంతృప్తి-ఛాలెంజి.

ఈ విధంగా 'కన్యాశుల్కం' నాటకానికి ఎంతో మంది ప్రముఖులూ, కళాకారులూ రచయితలూ తమవంతుగా ఉడతాభక్తిగా నీరాజనాలు అర్పించారు.

"ఇంతకీ, ఏంటయ్యా! నీ గొడవ?-ఛదస్తం కాకపోతే....నువ్వు చెబితేగాని మాకు తెలియదనుకున్నావా" అని నా మీద విసుక్కుంటే క్షంతవ్యుడ్ని. ఆ మహానుభావుడు రాసిన నాటకం గురించి నాలాంటి పాపడు చెబితే-సూర్యుడ్ని కొవ్వొత్తితో చూపినట్టే అవుతుంది.

అయినా నా గొడవని అవధరించండి!

ఉడతా భక్తిగా ఆ నాటకాన్ని ప్రదర్శించి-'జె.వి.సోమయాజులు' సోదరులు తమదైన బాణీలో గత జూన్ నెలలో విశాఖ 'కళాభారతి'లో స్టేజిని 'దున్నేశారు'.

'కళాభారతి' కిక్కిరిసి నిండిపోయింది, టిక్కెట్టుకొన్నవాళ్ళతో.

సోమయాజుల సోదరులకు నమోవాకాలు.

'లక్షలూ-కోట్లూ పెచ్చించి-పెయ్యిన్నొక్క వాద్యాల హోరులో, సెక్సు, హింస, సాహసం, వెగటు హాస్యం, ద్వంద్వార్థాలు వంటి మేజిక్‌లతో తీస్తున్న సినిమాలే ప్రస్తుత ,యువతరం'కి ఇంకా 'కిక్' చాలదన్నట్టుగా అసంతృప్తులుగా వుంటూంటే 'కన్యాశుల్కం' నిజానికి 'గంజాయివనంలో తులసి' మొక్కగానే భావించాల్సిన రోజులు. మరి అది ప్రదర్శించడం ఎంత సాహసం.

అయితే సోమయాజులు సోదరులు గజ ఈతగాళ్ళు ప్రేక్షకుల్ని ఏ విధంగా ఆకర్షించాలో వారికి బాగా తెలుసు.

'శంకరాభరణం'....సోమయాజులు బృందంతో-'కన్యాశుల్కం' ప్రదర్శన-ఒక ప్లస్ పాయింట్.

అది సరే! నాటకం రక్తికట్టించాలిగా - రక్తి కట్టాలంటే, లవ్, సెక్సు ముఖ్యంగా నేటి తరానికి! అందుకని కాలమాన పరిస్థితులనుబట్టి 'కన్యాశుల్కం' నాటకాన్ని వీటికే పరిమితం చేస్తూ-'లవ్' పోర్షను రమణమూర్తిగారు 'సెక్సు' పోర్షను సోమయాజులుగారూ పంచేసుకున్నారు.

మూడున్నర గంటల డ్రామాలో వీరిద్దరే అనుక్షణం-కలిసో, విడివిడిగానో, ఒక్క క్షణం పొల్లుపోకుండా లాగించేసారు.

ఫలితంగా 'మధురవాణి' పాత్ర లేకపోయినా 'మాకున్న గుడ్‌విల్‌ని బట్టి ప్రేక్షకుల్ని ఆకట్టుకోగలం' అన్న ధీమాతో ఆ పాత్రని డమ్మీ చేసేసారు.

తమ కండూతిని తీర్చుకోడానికి వారు, లేని డైలాగ్స్ కావల్సినన్ని చొప్పించారు.

మధురవాణి పాత్రను ఏదో విధంగా తప్పనిసరిగా డమ్మీ చేసేసి, పాపం మీనాక్షినిగాని, సౌజన్యారావు, బైరాగి వంటి పాత్రల్నిగాని నాటకంలోకి ఇరుపంచలు రాకుండా చేసి, 'మమ్మల్నిబట్టి ప్రజలు వచ్చారుగానీ, ఇవాళా రేపూ 'కన్యాశుల్కం'

ఎవడు చూస్తాడోయ్' అనుకుంటూ నొసలుతో వెక్కిరించారు.

అంతెందుకూ నాటకానికి-మకుటం, ఇంచుమించు తెలుగువాడిలో నానుడి అయిన....'డామిట్ కథ అడ్డంగా తిరిగింది' అనే డైలాగ్‌ని కూడా తుంగలో తొక్కేశారు.

వేదాంతం రాఘవయ్యగారు 'కన్యాశుల్కం' సినిమా తీసారు. అందులో ఒకటి రెండు పాటలు చేర్చారు. ఏ ఒక్క పాత్రనీ అన్యాయం చెయ్యకుండా పూర్తి కన్యాశుల్కాన్ని ఇంచుమించు కవర్‌చేస్తూ చిత్రీకరించారు. 'పాత్రలు గురించి వీళ్ళు పుట్టారా' 'పాత్రలు వీళ్ళకోసం పుట్టాయా' అన్నట్టు సావిత్రి, సి.యస్.ఆర్, గోవిందరాజులు, యన్టి.ఆర్‌లు నూటికి నూరుపాళ్ళు నటించారు. ఆ చిత్రం కేవలం రెండున్నర గంటలు మాత్రమే. ప్రముఖులు కూడా తప్పుపట్టలేనంత సొంపుగా తీసారు సినీమాని వేదాంతంవారు.

'కన్యాశుల్కం' నాటకం ఇప్పటికే మూడున్నర గంటలపాటు (మిమ్మల్నందర్నీ బోర్‌చేసి) ప్రదర్శించాం, అంచాత పూర్తిగా ప్రదర్శించడానికి కాలాతీతం అవుతుందని, ముఖ్యపాత్రలు రామప్ప పంతులు. గిరీశం, బుచ్చమ్మ (తా-సీను గురించి అదేనా) లతో సరిపెట్టాం, అంటూ అర్ధాంతరంగా నాటకం ఆపేసి, స్టేజి మీద గ్రూపు ఫొటోకి దిగిపోయారు.

తర్వాత జె. వి. సోదరులిద్దరూ తమ పరిచయాల్తో తమ గురించి తాము డబ్బా గొట్టుకున్నారు.

"....ఏం టోండీ-కన్యాశుల్కం చాలా మంచి నాటకమేనటగాని....మనకి బోధపడి చావదు...."

"ఓహో ఈయనా 'శంకరశాస్త్రి'గా వేసింది. చాలా దగ్గిరగా చూసాం సుమండీ...."

"అసలు ఈయన్ని చూద్దామనే కదండీ వచ్చింది! పనిలో పనిగా రమణ మూర్తిని కూడా చూసినట్టుగా వుంది."

—గృహోన్ముఖులైన ప్రేక్షకుల డైలాగులు.

ప్రవహించే గంగాజలంలో పుడిసెడు నీరు కలుషితం అయినంత మాత్రాన దానికొచ్చే నష్టమేం లేదు.

నోబుల్ బహుమతి పొందిన ఐన్‌స్టిన్‌కూడా- "అబ్బే! నాకు తెల్సింది చాలా తక్కువ. సముద్రపు ఒడ్డున ఇంతవరకూ గవ్వలు ఏరుకోడంతోనే సరిపోయింది. మరి సముద్రం తరచాలంటే సాధ్యమా" అని వినమ్రంగా అన్నాడు.

"ఏం చేస్తాం! వాళ్ళాడింది ఆట, పాడింది పాట"గా వుంది ఈ రోజుల్లో-విస్సన్న చెప్పిందే వేదం!

# నాటకేషు కన్యాశుల్కం...

**- గోపరాజు నారాయణరావు**

కళారూపాలలో నాటకం స్థానాన్ని, నాటకాలలో గురజాడవారి 'కన్యాశుల్కం ఔన్నత్యాన్ని కొత్తగా చెప్పవలసిన అవసరంలేదు. కన్యాశుల్కం 'సామాజిక, సాహిత్య ప్రయోజనాల మేల్కలయిక.' ఆధునిక నాటకరంగంమీద అజరామంగా ప్రజ్వలించే దీపకళిక. 'కన్యాశుల్కం' రంగప్రవేశం చేసి, ఈ సంవత్సరాంతానికి వందేళ్ళు పూర్తవుతుంది. 1892, ఆగస్టు 13న, జగన్నాథ విలాసినీ నాటక సమాజం మొట్టమొదటిసారిగా విజయనగరంలో ఈ నాటకాన్ని ప్రదర్శించింది. నాటినుంచి నేటివరకు అనేక నాటక బృందాలు కన్యాశుల్కాన్ని ప్రదర్శించాయి. ఇంకా ప్రదర్శిస్తూనే వున్నాయి. ఈ నాటకాన్ని వంద పర్యాయాలకు పైగా ప్రదర్శించానని స్థానం నరసింహారావుగారు చెప్పారు. నటరాజ కళాసమితి (శ్రీకాకుళం) పాతికేళ్ళలో 350 కి పైగా ప్రదర్శనలిచ్చినట్టు (1980 నాటికి) తన రజతోత్సవ సంచికలో ఉదహరించుకున్నది. తాను సైతం వందసార్లు ప్రదర్శించినట్టు అబ్బూరి రామకృష్ణారావుగారు వ్రాశారు. అబ్బూరి వారి మాటలలో చెప్పాలంటే- 'నేడేకాదు, రేపటి కూడా యిది ఆడదగినదే. చూడదగినదే.'

కన్యాశుల్కం ప్రదర్శనాయోగ్యత మీద భిన్నాభిప్రాయాలున్నాయి. వుండడం సహజమే. నాటకం నిడివి ఇందుకు ప్రధాన కారణం. రెండో కారణం పాత్రల సంఖ్య. ఇందులో ప్రధాన పాత్రలే పదహారు. చిన్నా చితకా పాత్రలు ఇంకా అన్ని వున్నాయి. సుదీర్ఘమైన ఏడు అంకాలు వున్నాయి. అందులో చిన్నవి పెద్దవీ కలిపి దాదాపు 35 దృశ్యాలు ('స్థలము' పేర) వున్నాయి. అయితే నాటకంలో ప్రదర్శనా యోగ్యమైన దృశ్యాలు పుష్కలంగానే వున్నాయి. ఆద్యంతం పొరలే హాస్యం, చమత్కారం వున్నాయి. ప్రేక్షకుడిని కట్టిపడేయకల కథాకథనం వున్నది. తమాషా అయిన అంతర్నాటకం వున్నది. చూపరుల ఆలోచనకు నిప్పంటించగల రసానుభూతి రవ్వలున్నాయి. అందుకే నాటకాన్ని చాల భాగం కుదించి ఇప్పుడు ప్రదర్శిస్తున్నారు.

నాటకంలో ఆనాటి సాంఘిక వ్యవస్థ గురించి, అప్పటికి రాజ్యమేలుతున్న అవలక్షణాలగురించి గురజాడ విస్తృతంగా చర్చించారు. దురాచారాలు, మూఢత్వం, దొంగ సంస్కర్తలు, ఇంగ్లీషు వ్యామోహం, పోలీసుల వేషాలు, స్త్రీల స్థితిగతులు వంటివెన్నో ఇందులో చిత్రించారు. కన్యాశుల్క దురాచారం నాటకంలో ప్రధాన సమస్య. విధవా సమస్య, వేశ్యా సమస్య, అంతర్లీనంగా ప్రధానకథతో పాటు నడుస్తుంటాయి. నాటకం మొదటి ప్రదర్శన జరిగిన ఐదేళ్ళకు ముందు

రచన పూర్తయిందని ఒక అంచనా. అప్పటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులకు అక్షర రూపం ఇవ్వడమే గురజాడ ధ్యేయంగా పెట్టుకున్నారని సులభంగానే అర్థం చేసుకోవచ్చు. అప్పటికి ప్రముఖులైన వారిపేర్లు- నేషనల్ కాంగ్రెస్, 'రష్యా' వంటి మాటలు నాటకంలో వినపడతాయి. కొన్ని అటు ఇటుగా కన్యాశుల్కం వందేళ్ళనాటి సామాజిక దృశ్యమే. కన్యాశుల్కం ప్రదర్శన ఈ ధ్యేయంలోనే జరగాలి. ఆనాటి సామాజిక స్థితిని ఆవిష్కరింప చేయగలిగితేనే కన్యాశుల్కం ప్రదర్శనకు సార్థకత. రచయిత ధ్యేయం అదే. ఇలాంటి సార్థకతను సాధించడానికి ప్రస్తుతం కన్యాశుల్కం ప్రదర్శిస్తున్న బృందాలు ఎంతవరకు కృషిచేస్తున్నాయి, ఆ కృషిలో ఎంతవరకు సఫలమవుతున్నాయి అనే విషయం చర్చించడమే ఈ వ్యాసం లక్ష్యం.

కన్యాశుల్కం వందేళ్ళ పండుగ పురస్కరించుకుని జూన్ 27న విశాఖ నగరంలో ఆ నాటకాన్ని ప్రదర్శించారు. నటరాజ కళాసమితి ఈ ప్రదర్శన ఇచ్చింది. ప్రజా స్పందన దృష్ట్యా నాటకాన్ని మరునాడు కూడా ప్రదర్శించారు. మొదటి రోజున టిక్కెట్లకోసం జనం ఎగబడడం ఒక విశేషం. ఆనందించతగిన విషయం.

ప్రఖ్యాత రంగస్థల, సినీనటులు జె. వి. రమణమూర్తి, జె. వి. సోమయాజులు సోదరుల ఆధ్వర్యంలో ఈ ప్రదర్శన జరిగింది. రమణమూర్తి గిరీశం పాత్ర ధరించారు. ఈ పాత్ర ప్రేక్షకులను విశేషంగా అలరించింది. ఆయన పరిపక్వమైన నటన ప్రదర్శించారు. గిరీశంలోని లౌక్యాన్ని, ఆషాఢభూతి లక్షణాన్ని రూపు కట్టింపడంలో రమణమూర్తి నిస్సందేహంగా విజయం సాధించారు. సంభాషణలు ఎంతో సహజంగా పలికారు. ప్రతిసారి ఒక్కో శైలితో ఆయన వేదికమీదకొచ్చారు. గిరీశం పలికే సుదీర్ఘమైన సంభాషణలని చమత్కారంతో చక్కని మాడ్యులేషన్‌తో, ఎక్కడా విసుగు కలిగించకుండా, ఆద్యంతం ఒకే స్థాయిలో చెప్పారు. 'ది విడో' కవితా గానం, 'కాముని విరిశరముల బారికి' అనే ఉపన్యాసానికి చక్కని హావ భావాలు ప్రదర్శించారు.

గిరీశం పాత్రకు ధీటుగా నిలిచిన పాత్ర రామప్ప పంతులు. జె. వి. సోమయాజులు ఈ పాత్ర ధరించారు. రామప్ప పంతులు డాంబికాన్ని, భేషజాన్ని, జాకాల్‌తనాన్ని ఆయన చక్కగా ప్రదర్శించారు.

మరో మహోన్నతమైన పాత్ర మధురవాణి. నాటకంలోనే కాదు, మహిళా లోకానికే మణిపూసవంటి పాత్ర అది. సాక్షాత్తు రచయిత కూడా ఆ పాత్రను చూసుకుని మురిసి పోయేటట్టు చేసిన పాత్ర అది. ఈ పాత్ర ప్రదర్శనలో అసంతృప్తినే మిగిల్చింది. వేశ్యగా, ఎదుటివారిని రంజింపచేసే ఉద్దేశంతో, కనపరచవలసిన హొయలు, కులుకు ఆ నటి ఏ మాత్రం ప్రదర్శించలేకపోయారు. శ్రీమతి ఆలపాటి లక్ష్మి ఈ పాత్ర వేశారు. వాస్తవానికి ఆ పాత్రపట్ల నటికి సరైన అవగాహన కలిగించడంలో దర్శకుడు దారుణంగా విఫలమయ్యాడు. అయితే ఆమె అసలు

ప్రతిభ కనపరచలేదని మాత్రం చెప్పడంలేదు. మిగిలిన పాత్రలు చెప్పుకో తగ్గట్టుగా వున్నాయి.

ఈ నాటకానికి రమణమూర్తి దర్శకత్వం వహించారు. దర్శకుడిగా ఆయన అసంతృప్తిని మిగిల్చారు కన్యాశుల్కం నేపథ్యం విజయనగరం. ఆ నాటకానికి ప్రాణం అక్కడి మాండలీకం. ఈ ప్రదర్శనలో పెద్ద లోపం, అత్యంత గర్హనీయమైన విషయం దాదాపు అన్ని పాత్రలు ఆ యాసను విడిచిపెట్టడం. వెంకమ్మ పాత్ర సంభాషణల స్వరూపాన్ని బట్టి అలా పలకడానికి ప్రయత్నించింది. అయితే ఆ ప్రయత్నం నాటకాంతంలో కానరాలేదు. గిరీశం పాత్రకు ఈ యాస ప్రాణం. రమణమూర్తి కూడా దానిని ఉపయోగించలేదు.

స్వర్గీయ కె. వెంకటేశ్వరరావు బృందం రేడియోకు ఇచ్చిన కన్యాశుల్కం వింటే విజయగరం మాండలీకం నాటకానికి ఎంత ఆకర్షణ తెచ్చిపెడుతుందో అర్థమవుతుంది. వెంకటేశ్వరరావుగారు పలికిన సంభాషణలు, అందులో ఒడుపు తరవాత చాలకాలం వరకు వెన్నాడతాయి. ఇక్కడ వెంకటేశ్వరరావుగారిని ప్రస్తావించడం-రమణమూర్తి కూడా ఆ యాసను పలికితే పసిడికి తావి అబ్బినట్టుండేదని చెప్పడానికే.

నాటకంలో రచయిత వ్రాసినవన్నీ తెచ్చి వేదికమీద పెట్టడం సాధ్యంకాదు. అసలు హంగులు లేకపోవడం ఆక్షేపించవలసిన విషయం కాదు. అలాగని కనీస జాగ్రత్త, కనీస శ్రద్ధ చూపకపోవడం క్షమార్హంకాదు. సినిమాలోవలె మధురవాణి ఇంట చిలకల పందిరిమంచం, నిలువుటద్దాలు ప్రదర్శించమని ఎవరూ చెప్పలేరు. అయితే ఆహార్యం, చిన్న చిన్న వస్తువులు సమకూర్చుకొనకుంటె ఎలా? రెండవ అంకంలో అగ్నిహోత్రుడి ఇంటి సన్నివేశంతో ప్రారంభమవుతుంది. అక్కడ 'అగ్నిహోత్రావధాన్లు జంధ్యాలు వడుకుచుండును' అని వుంటుంది. వెంకమ్మ కూర తరుగుతుంది. వెంకమ్మ పాత్రచేత ఆపని చేయించారు. కాని అగ్నిహోత్రుడు జంధ్యాలు వడకడం చూపలేదు. ఇది ఏర్పాటు చేయడం కష్టంకాదు. అశ్రద్ధమాత్రమే అనుకోవాలి. అందువల్ల ఆనాటి గృహజీవన విధానాన్ని చూపడానికి రచయిత చేసిన ప్రయత్నం ఇక్కడ విఫలం కాలేదా? ఈ సన్నివేశంలోనే గిరీశం పాత్రధారి సూటుతో ప్రవేశించాడు. ఇది తప్పుకాకపోవచ్చు. అయితే ఆ సూటు ఆధునిక పద్ధతిలో తయారైనది కావడం విచారకరం, విమర్శనార్హం. ఈ నాటకంలో పరమ వికృతమైన వేషం ఎవరిదంటే-వెంకటేశం పాత్రధారిది. ఇతడికి నిక్కరు (నేవీబ్లూ) షర్ట్ (స్కై బ్లూ) వేసి టక్‌చేశారు. అచ్చం ఈనాటి కాన్వెంట్ విద్యార్థిలా తయారయ్యాడు. ఇతనికి స్టెప్ కటింగ్ వుండడం మరింత ఆక్షేపణీయం. ఈ వేషంకోసం గిరీశం డైలాగ్‌ను కూడా మార్చాడు. "మన పిల్లల్ని కాయ గావంచా, తెల్లచొక్కాయితో పంపించడానికి వల్లకాదు గదా?" అని పుస్తకంలో వుంటే, నిక్కరు, బనీను

అని పలికారు. కొన్నిచోట్ల వెంకటేశం మిల్ మేడ్ చేతుల బనీను వేసుకుని తయారయ్యాడు. ఇది ఆనాటి వేష భాషలను, సంస్కృతిని వివరించడానికి ప్రతిబంధకం కాదా? ఒక రకంగా రచనకు అన్యాయం కూడా. మిగిలిన పాత్రల వేషాలు బాగున్నాయి. నాటకాన్ని ఆరో అంకం, రెండో దృశ్యంతో ముగిస్తున్నారు. "యీ గాడిద కొడుకు యింగిలీషు చదువు కొంపముంచింది" అంటూ అగ్నిహోత్రావధాన్లు వెంకటేశాన్ని దండిస్తుండగా తెరవేస్తున్నారు. ఇందువల్ల ఎంతో ముఖ్యమైన 'కంటె' సంఘటన, మధురవాణి నిజరూపం, గిరీశం అసలు రంగు, సౌజన్యరావు పంతులు, అఖరికి రచయిత సమగ్ర ధ్యేయం తెర వెనక వుండిపోతాయి. ఈ బృందం అక్కడితోకూడా ఆగలేదు. దర్శకుడు కొంత స్వంత పైత్యం కనపరిచాడు. 'ఇదే బంగాళ కర్రవాడవుతే యేం జాస్తాడో తెలిసిందా? తాతయేది తండ్రయేది కర్రవట్టుకుని చష్తూ లెక్కగొడతాడు' అనే డైలాగ్‌ను నేపథ్యంలో పలికి, వెంకటేశం చేత తండ్రిని కొట్టడానికి కర్ర ఎత్తించారు. ఇది అనౌచిత్యం, అన్యాయం. అసలు మూఢత్వం మీద వెంకటేశం వంటి కుర్రోళ్ళు తిరగబడితే సాంఘిక వ్యవస్థ రూపం మరో విధంగా వుండేది.

ఆధునిక పద్ధతులలో నాటకాన్ని ప్రదర్శించడమంటే, నాటకంలో రచయిత పేర్కొన్న కాలంనాటి వేషభాషలకు పంగనామాలు పెట్టమనికాదు. నటుడి స్థాయిని బట్టి పాత్రలు, ముఖ్యంగా ఇలాంటి పాత్రలు తమ స్వభావాలు మార్చుకునే పరిస్థితి తలెత్తకూడదు. ఇలాంటి పాత్రలు లేకుండా ప్రదర్శనలు జరుగుతాయని ఆశిద్దాం.

• ఈ నాటకాన్ని ఒకే వేదికమీదకంటె-వేదికల సముదాయంమీద ప్రదర్శిస్తే మరింత రక్తికట్టే అవకాశంవుంది. డ్రామా అండ్ సాంగ్ విభాగం వారు ప్రదర్శించే 'రూపవాణి' రూపకం తీరులో కన్యాశుల్కాన్ని ప్రదర్శిస్తే ప్రదర్శన స్థాయిలో మరో ముందడుగు వేయవచ్చు. అవసరమైనన్ని వేదికలు, ఒక క్రమంలో ఒక చోట నిర్మించి దృశ్యాల మధ్య ఎలాంటి విరామమూ లేకుండా 'రూపవాణి' రూపకాలలో ప్రదర్శిస్తారు. ఎ.ఆర్. కృష్ణ వంటి నటులు ఈ టెక్నిక్‌తో 'మాలపల్లి'ని నాటకంగా ప్రదర్శించారు. ఇదే విధానం కన్యాశుల్కానికి అన్వయిస్తే సత్ఫలితాలు రావచ్చు. అయితే ఇక్కడ సినిపోకడలు ఛాయ సూపకూడదు. నాటకమే చూశానన్న అనుభూతి ప్రేక్షకుడికి మిగలాలి.

ఇప్పటివరకు కన్యాశుల్కాన్ని మూడుగంటలకు కుదించి ప్రదర్శిస్తున్నారు. ఈ నాటకం నూరేళ్ళపండగ సందర్భంగా నవంబర్ 92లో, విజయనగరంలో సంపూర్ణంగా ప్రదర్శిస్తున్నారు. 49 మంది కళాకారులతో, 9 గంటలపాటు ప్రదర్శన జరుగుతుంది. స్థానిక కళాకారులు చేస్తున్న ఈ ప్రయత్నం విజయవంతం కావాలని ఆశిద్దాం.

# గిరీశం పాత్ర విశిష్టత

— నవీన్

దాదాపు పదేళ్ళక్రితం కరీంనగర్‌లో జె.వి. సోమయాజులు బృందం 'కన్యాశుల్కం' నాటకాన్ని ప్రదర్శించారు. ప్రేక్షకులు తండోప తండాలుగా శంకరాభరణం సోమయాజులును చూడటానికి వచ్చారు. శంకరశాస్త్రిగా ప్రజల వూహల్లో వున్న సోమయాజులును, నీచమైన రామప్పంతులుగా ఆదరించలేకపోయారు. ఎనిమిదివేల మంది ప్రేక్షకులను శాంతింప చేయడానికి, జె.వి. రమణమూర్తి స్టేజిపై ఎక్కి గిరీశం పాత్ర నభినయించడం ప్రారంభించాడు. ప్రేక్షకుల్లో ప్రశాంతత చోటు చేసుకుంది. ఆరోజు గిరీశం పాత్రే ఆ ప్రదర్శనను రక్షించింది. అక్కడ వారికి కన్యాశుల్కం సమస్య అర్థం కాలేదు. గిరీశం ఒక్కడే వాళ్ళకర్థమయ్యాడు. ఆ పాత్రతో వాళ్ళు వెంటనే తాదాత్మ్యం పొందారు. గిరీశం పాత్రే నాటకాన్ని వందసంవత్సరాలుగా సజీవంగా వుంచింది. గిరీశం పాత్రలోని సార్వజనీనతే ఆ నాటకాన్ని బ్రతికించింది.

నిజానికి 'కన్యాశుల్కం' నాటకంలోని సమస్య దృష్ట్యాగానీ, కళ దృష్ట్యాగానీ చూస్తే గిరీశం పాత్ర అంత ముఖ్యమైన పాత్రేమీకాదు. చాలామంది 'కన్యాశుల్కం'లో గిరీశం నాయకుడనుకుంటారు-కానీ గిరీశం నాయకుడు కాదు. ఆశ్చర్యం యేమిటంటే 'కన్యాశుల్కం'లో నాయకుడంటూ ఎవరూలేరు. బహుశా ఈ నాటకం రాయాలన్న ఆలోచన గురజాడ బుర్రలో మెదిలినప్పుడు గిరీశం చాలా చిన్న పాత్రగానే ఆయనకు కన్పించి వుంటాడు. కానీ 'కన్యాశుల్కం' పూర్తయ్యేప్పటికి గిరీశం పాత్ర రచయిత ఊహించనంతగా పెరిగిపోయింది. **S.M.Y.** శాస్త్రి అన్నట్టు **"Girisham must have taken the author himself by storm and argued and bluffed his way into the drama.." ***

గిరీశం పాత్రలోని వైశిష్ట్యం యేమిటి? గిరీశాన్ని దుర్మార్గుడనీ, యే ఎండకా గొడుగు పట్టే అవకాశవాది అని, అవినీతి పరుడని పైకి అందరూ అసహ్యించుకుంటారుగానీ లోపల మాత్రం గిరీశాన్ని ఆరాధించేవాళ్ళు చాలామందే వుంటారు. గిరీశాన్నొక **'Lovable Scoundrel'**గా చాలామంది భావిస్తారు. గిరీశంలోని చాలా అంశాలు చాలామందిలో వుంటాయి. గిరీశంలా చమత్కారంగా మాట్లాడాలని, ఎదుటివ్యక్తిని అలా మాటలతో గెలవాలనీ మనలో చాలామందికుంటుంది. అలాగే గిరీశంలా జీవితాన్ని అనుభోగ్యవస్తువుగా తీసుకొని జీవితాన్ని ఎంజాయ్ చెయ్యాలని, ఎప్పుడూ నవ్వుతూ హాయిగా వుండాలనీ, గొప్పవాళ్ళు అనుకుంటున్న వాళ్ళను, సంఘ సంస్కర్తలమని చెప్పుకునేవాళ్ళను వెక్కిరించాలనీ, ప్రతి సమస్యలోంచి గిరీశంలాగే సమయస్ఫూర్తితో బయటపడాలని చాలామంది కలలుకంటూ వుంటారు.

---

* చూడు : కె.వి. రమణారెడ్డిగారి 'మహోదయం' పుట : 389.

సమాజం విధించే కట్టుబాట్లనూ, నీతినియమాలనూ గాలికి వదిలేసి వ్యక్తిగా స్వేచ్ఛగా బ్రతకటం ఒక్కటే జీవితలక్ష్యం కావాలని మనలో చాలామందికి వుంటుంది. అలా నిజంగా వుండగల్గుతామా? లేదా? అనేది వేరే విషయం-కానీ మన అంతరంగంలో మాత్రం అలా వుండాలని, అలా వుండగల్గితే బావుండుననీ వుంటుంది. మన సుప్త చైతన్యంలో దాగివున్న ఇలాంటి అనేక ప్రవృత్తుల్ని గిరీశం పాత్రలో బహిరంగం కావటం చూస్తాం. ఈ కారణంచేతనే గిరీశం ప్రతి ఒక్కరి హృదయంలో వెంటనే పలుకుతాడు.

గురజాడలో కూడా ఇలాంటి ప్రవృత్తులన్నీ వుండే వుంటాయి. తనతో అణిగి మణిగి వున్న ఎన్నో గడుసైన అప్పటి సాంప్రదాయాలకు వ్యతిరేకమైన భావాల్ని గురజాడ వ్యక్తిత్వంలోని ఒక ముఖ్యమైన భాగమే గిరీశం.

ఆర్.ఎస్. సుదర్శనం అన్నట్లు "గిరీశం పాత్రలో హాస్య రసానుభూతి పొందాలంటే పాఠకుడు నీతి అనే కొలబద్దను తాత్కాలికంగానైనా అవతల పెట్టాలి. అప్పుడే గిరీశం మాటలు, సమయస్ఫూర్తి, అతడుపొందే విజయాలు మనకు ఆహ్లాద కరంగా వుంటాయి." *

నిజానికి గిరీశం మరీ అంత చెడ్డవాడేమీకాదు. అప్పుడప్పుడే భారతదేశ పురాతన సంస్కృతిలోకి దిగుమతి అవుతున్న పాశ్చాత్య సంస్కృతిని అలవచు కోవాలన్న ఉబలాటం ఆనాటి ఇంగ్లీషు చదువుకున్న చాలామంది యువకుల్లో వుండేది. అలాంటి వాళ్ళందరికీ గిరీశం ప్రతినిధి. ఆ అలవాట్లు, ఆ అభిరుచులు, సంభాషణల్లో ఇంగ్లీషు మాటల్ని విరివిగా వాడటం. మొదలైనవన్నీ గిరీశం తన స్వంతం చేసుకున్నాడు. కానీ గిరీశం సమస్యేమిటంటే తనకిష్టమైన పాశ్చాత్య సంస్కృతికి అనుగుణంగా జీవించటానికి కావలసిన ఆర్థిక హంగులు అతనికి లేవు. అందువల్ల అడ్డదార్లలో నడిచి తను సాధించదల్చుకున్నదాన్ని సాధించుకోవాలన్న తాపత్రయంలో పడిపోతాడు. పరిస్థితులకు తనెప్పుడూ లొంగిపోడు. ఎలాంటి పరిస్థితులనైనా తనకు అనుకూలంగా మార్చుకుంటాడు. ఎలాంటి గడ్డు పరిస్థితిలోనుంచైనా బయటపడే తెలివితేటలు—కొన్నిసార్లు అతి తెలివితేటలుకూడా - అతనిలో వున్నాయి. ఎదుటివ్యక్తిని వెంటనే లోబరచుకునే సంభాషణా చాతుర్యం అతనికి వెన్నతో బెట్టిన విద్య. అతనిలో సహజంగా వున్న ఈ హాస్యదృష్టే అతన్ని అన్ని వేళలా కాపాడుతూ వుంటుంది. తనను చూసి తాను నవ్వుకోగలడు. తనను తాను విశ్లేషించుకోగలడు.

గిరీశం మాట్లాడే మాటలను బట్టి చూస్తే చాలామంది అనుకున్నట్టు అతడు 'బొట్లేరు ఇంగ్లీషు' మాత్రమే తెలిసిన వ్యక్తి అనుకోవటానికి వీల్లేదు. అతడు వితంతువుల మీద ఇంగ్లీషులో రాసిన కవిత్వాన్ని మిడి మిడి జ్ఞానంతో రాసిన కవిత్వ

---

* చూడు : ఆర్.ఎస్. సుదర్శనంగారి "సాహిత్యంలో దృక్పథాలు." పుట: 38

మని తీసిపారెయ్యటానికి వీల్లేదు. సురేంద్రనాథ్ బెనర్జీలాగా అనేక విషయాలమీద ఆలోచనా స్ఫోరకంగా ఉపన్యసించే సామర్థ్యం అతనికుంది. "నాతో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషన్" అని అతడనటం కేవలం ప్రగల్భం మాత్రమే కాదు. అతడు మాట్లాడిన మాటలు వింటే నిజంగానే అతనిలో ఆ శక్తి వుందన్న నమ్మకం కల్గుతుంది. అతని అభిరుచులు చాలా ఉన్నతమైనవి. స్త్రీల్లో మధురవాణిని, చుట్టల్లో హవానా చుట్టల్ని, తినుబండారాల్లో కాశీ మిఠాయిని అతడు మెచ్చుకుంటాడు. అలాగే ఎవరి విలువ ఎంతోకూడా అతడు కరెక్ట్‌గా అంచనా వెయ్యగలడు. మధురవాణిని గూర్చి "మానవజాతినంతా వశం చేసుకోగల్గే స్త్రీ ఆమె" (It is that seduce all mankind) అంటాడు. అలాగే కృష్ణరాయపురం అగ్రహారంలో బుచ్చమ్మను చూడగానే ఆమెలోని ముగ్ధత్వం, స్వచ్ఛమైన అందం అతన్ని వశపరచుకుంటుంది. వేశ్యావృత్తి చేసుకుంటున్న మధురవాణితో బుచ్చమ్మను పోల్చుకొని "మధురవాణికీ ఈ మనిషికీ కంపారిజన్ వున్నదా? అది రంగువేసిన గాజుపూస. ఇది ప్యూర్ డైమండ్" అనుకుంటాడు.

అనుకున్నదాన్ని సాధించటానికి అనేక అడ్డదార్లు తొక్కటానికి అలవాటు పడిపోయిన గిరీశం బుచ్చమ్మను చూసిన క్షణంనుండి మారిపోయినట్టుగా కనిపిస్తాడు. బుచ్చమ్మలోని అమాయకత్వం, స్వచ్ఛత, మంచితనం గిరీశాన్ని మార్చివేస్తాయి. "దీనిని (బుచ్చమ్మకు) చెడగొట్టడానికి ప్రయత్నం చెయ్యకూడదు. చేసినా సాగేది కాదు. గనక కొత్తదారీ, కొంత న్యాయమైన దార్లీ తొక్కాలి" అనుకుంటాడు. అప్పట్నించి "Honesty is the best policy" అన్న పాశ్చాత్యనీతి అనుసరించి బుచ్చమ్మను పెళ్ళిచేసుకోవాలని సిన్సియర్‌గానే ప్రయత్నిస్తాడు.

గిరీశం పాత్రను గురజాడ సృష్టించటంలోని ఒక ఉద్దేశ్యం సంఘ సంస్కరణ పేరుతో జరుగుతున్న మోసాన్ని బట్టబయలు చెయ్యటమని అనేకమంది విమర్శకులు అభిప్రాయపడ్డారు. కానీ గిరీశం బుచ్చమ్మను పెళ్ళిచేసుకోవాలనుకోవటంలో మోసమేమీ కనిపించదు. అతడామెను నిజంగానే పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. వితంతువును చేసుకోవటంవల్ల పేరుప్రఖ్యాతులూ లభిస్తాయి. ఆమె ఆస్తి కూడా వస్తుందన్న స్వార్థంతోనే గిరీశం ఆమెను పెళ్ళిచేసుకోవాలనుకుంటాడు. అయినప్పటికీ ఒక వితంతువును పెళ్ళిచేసుకోవాలని నిర్ణయించుకున్నందుకు గిరీశాన్ని అభినందించాలి. ఈనాటికి కూడా వితంతువుల్ని వివాహం చేసుకోవటానికి సందేహించే యువకులున్న ఈ దేశంలో, దాదాపు వంద సంవత్సరాల క్రితమే ఓ ఛాందస బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన గిరీశంలాంటి యువకుడు బుచ్చమ్మలాంటి వితంతువును పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకోవటం అభినందించతగ్గ నిర్ణయమే. గిరీశం తన సమకాలికులకంటే ఎంతో ముందున్నాడని నిస్సంశయంగా చెప్పొచ్చు.

కాటికి కాళ్ళుచాపుకొనివున్న లుబ్ధావధాన్లుకు ముక్కుపచ్చలారని పసిపిల్ల

సుబ్బమ్మకూ జరుపతలపెట్టిన పెళ్ళిని ఎలాగైనా తప్పించాలని గిరీశం సీరియస్‌గానే ప్రయత్నిస్తాడు. కానీ అగ్నిహోత్రావధాన్లు లాంటి మూర్ఖుడిమీద తనమాటలు పని చెయ్యవని నిర్ణయించుకొని తను బుచ్చమ్మను లేవదీసుకుపోవటం ద్వారా సుబ్బమ్మ పెళ్ళిని తప్పించవచ్చునని ప్లాన్ వేస్తాడు. ఈ ప్లాన్‌లో తన స్వార్థం వున్నప్పటికీ లుబ్ధావధాన్లకి సుబ్బమ్మనిచ్చి పెళ్ళిచెయ్యటం చాలా దారుణమైన అన్యాయంగానే గిరీశానికి కనిపిస్తుంది. అయితే చాలా తెలివిగా ఈ పరిస్థితిని తనకు అనుకూలంగా తన ప్రయోజనాన్ని సాధించటంకోసం వాడుకుంటాడు.

ప్రతి పరిస్థితినీ తనకు అనుకూలంగా మలచుకునే గిరీశానికి నాటకం చివరి సీన్‌లో మాత్రం కథ అడ్డంగా తిరుగుతుంది. సౌజన్యరావు పంతులు దగ్గర తనను తాను "నెపోలియన్ ఆఫ్ యాంటీ నాచ్"గా ('వేశ్యావృత్తి'ని వ్యతిరేకించటంలో నెపోలియన్ అంతటి వాడిని) పరిచయం చేసుకోవటంలోనే గిరీశం అతి తెలివిని ప్రదర్శించి పప్పులో కాలేశాడు. తను ఒకప్పుడు మధురవాణి అనే వేశ్యను వుంచుకున్నాడన్న వాస్తవం అంత త్వరగా సౌజన్యరావుకు తెలిసిపోతుందని అతడు ఊహించలేకపోతాడు. అయినప్పటికీ గిరీశం ఈ పరిస్థితి లోంచి కూడా బయటపడి సౌజన్యరావు మెప్పు పొందటానికి ప్రయత్నిస్తాడు.

"కొంతకాలం కింద గిరీశం అనే ఫూలిష్ యంగ్ మ్యాన్ వొకడు వుండేవాడు. మధురవాణి అనే బ్యూటిఫుల్ నాటీ డెవిల్ ఒకతె వుండేది. వాడి దురదృష్టం వల్ల దాని వలలో చిక్కి, మైమరచి అంధకారంలో పడిపోయినమాట సత్యము... గురువుల ఉపదేశం కొంత కాలానికి జ్ఞప్తికి తెచ్చుకొని, ఆ అంధకారంలోంచి వెలువడి గురువుల పాదములు చేరుకొని గతం కలగా భావించి, మంచి తోవలో పడ్డాడు. ఆ గిరీశమే యీ గిరీశం-ఆ మధురవాణే యీ మధురవాణి" అంటూ తను పశ్చాత్తాపపడుతున్నానని, తనను క్షమించి బుచ్చమ్మతో తన పెళ్ళి జరిపించమని గిరీశం సౌజన్యారావు పంతుల్ని వేడుకుంటాడు.

గిరీశంలో ఇక్కడ నిజమైన పశ్చాత్తాపమే కనిపిస్తుంది. అతనిలో బుచ్చమ్మను పెళ్ళిచేసుకోలేకపోతున్నానన్న నిజమైన బాధకూడా కనిపిస్తుంది. ఇప్పట్నించి మంచిగా బ్రతకటానికొక అవకాశం యివ్వమని ప్రాధేయపడతాడు. "నావంటి సిన్నర్స్‌కి సహాయంచేసి మంచివాళ్ళని చెయ్యటం తమకు బిరుదుగానీ బ్రతుకు చెరచటం న్యాయం కాదు" అంటాడు గిరీశం.

"ఎన్నాళ్ళయింది చీకట్లోంచి వెలుతురులోకి వునికి" అని సౌజన్యరావు అడిగినప్పుడు గిరీశం వెంటనే యేమీ సమాధానం చెప్పలేకపోతాడు. కొన్ని క్షణాల వరకు అతని సమయస్ఫూర్తి అతన్ని వదిలేసింది. అతడు కొంతసేపు ఆలోచించాల్సి వచ్చింది.

"ఎన్నాళ్ళయితేనేమండి. ట్రూ రిపెంటెన్స్‌కు ట్వంటీ ఫోర్ అవర్స్ చాలదా

అండి?” అంటాడు గిరీశం.

అయినా సౌజన్యారావు గిరీశాన్ని క్షమించలేదు, బుచ్చమ్మతో అతని పెళ్ళి జరిపించలేదు. గిరీశానికి చదువు పూర్తిచేసుకొని బాగుపడటానికొక అవకాశం మాత్రం యివ్వబడ్తుంది. గిరీశం ఇదివరకు చేసిన తప్పుల్ని దృష్టిలో పెట్టుకొని చూసినప్పుడు ఇది న్యాయంగానే తోచినప్పటికీ, గిరీశం పాత్ర పాఠకుడికి ఎంత అభిమాన పాత్ర మౌతుందంటే అతనికీ బుచ్చమ్మకూ పెళ్ళి జరగటమే న్యాయంగా వుండేదనిపించేటంతగా!

గిరీశానికీ బుచ్చమ్మకూ పెళ్ళి జరగటంతో నాటకం అంతమైపోతే,నాటకంలో ఒక ముఖ్యమైన ప్రయోజనం నెరవేరేదనిపిస్తుంది. వితంతు వివాహాన్ని ఈ నాటకం ప్రోత్సహించినట్టుగా వుండేది. మొదట్లో చెడు మార్గంలో వెళ్ళిన గిరీశం నిజంగానే పశ్చాత్తాప పడి మంచి మార్గాన్ని యెంచుకున్నాడని చెప్పినట్టయ్యేది. గిరీశంలోని మంచితనాన్ని బుచ్చమ్మ జాగ్రుతం చేసిందని, బుచ్చమ్మ కారణంగా గిరీశంలాంటి పచ్చి అవకాశవాది మంచివ్యక్తిగా మారిపోయాడని సూచించినట్టయ్యేది. గిరీశాన్ని అలా అర్థాంతరంగా-ఇంకా క్రమశిక్షణ అలవడని ఒక తిరుగుబోతులాగా వదిలి వెయ్యటం ద్వారా గురజాడ యేమి సాధించినట్టు? తప్పు చెయ్యటానికి అలవాటు పడ్డవాడు ఎప్పుడూ అలా తప్పులు చేస్తూనే వుంటాడని చెప్పటమా?

బుచ్చమ్మను చూసినప్పట్నించీ గిరీశంలో ఎంతో మార్పు వచ్చినట్టుగా చూపించిన గురజాడ ఆ మార్పుకొక పరిపూర్ణతను, పరాకాష్ఠను ఎందుకివ్వలేదు? ఇదే గురజాడలో అర్థంకాని విషయం. “గురజాడ మనస్తత్వంలోని విపరీత ధోరణి” * అన్న వ్యాసంలో రా. రా. వివరించాడు.

“‘కన్యాశుల్కం’లో యే సమస్యకూ సరైన పరిష్కారం లభించలేదు. ముఖ్యంగా వితంతు వివాహ సమస్య అల్లరిపాలైంది. మధురవాణిని సంస్కరించటం ద్వారా వేశ్యా సమస్యకొక పరిష్కారం—అసంతృప్తికరమే అయినా-యేదో ఒకటి లభించింది” అంటాడు రా.రా. అలాగే గిరీశాన్ని సంస్కరించి, బుచ్చమ్మకూ, గిరీశానికీ పెళ్ళిచేసివుంటే వితంతు వివాహ సమస్యకు కూడా—అసంతృప్తికరమే అయినా-యేదో ఒక పరిష్కారం లభించినట్టయ్యేది. కానీ గురజాడ మధురవాణి మీద చూపించినంత ఔదార్యాన్ని గిరీశంమీద చూపించలేకపోయాడు. గురజాడ గిరీశం పాత్రను పెంచి పోషించి చివరకు అలా నిర్దాక్షిణ్యంగా తుంచెయ్యటం చాలా విపరీతంగానే కనిపిస్తుంది. అలా అని గురజాడకు గిరీశం పాత్రమీద తక్కువ అభిమానమేమీ లేదు-తను చెప్పదల్చుకున్న ఎన్నో విషయాల్ని గిరీశం పాత్రద్వారా చెప్పించాడు. తను హేళన చెయ్యదల్చుకున్న ఎన్నో విషయాల్నికూడా గిరీశంద్వారా చేయించాడు. గిరీశం మాట్లాడిన కొన్ని అనర్ఘ రత్నాల్లాంటి మాటల వెనక గురజాడ హృదయం వుంది. అయినా గిరీశం పాత్రకు చివర్లో అన్యాయం జరిగిందన్న భావం ఈ వ్యాసకర్తకుంది.

# ఎర్ర మెరుపు

—వెన్నెల

కారుమేఘాలు కమ్ముకున్నప్పుడు
బలంగా మేఘాల రాపిడితో ఉరుములు, మెరుపులు
సూర్యకిరణాల్లా వ్యాపించాయి
మెరుపుల్లో మెరుపు మెరిసిందొక ఎర్రమెరుపు
కిరణాల్లో కిరణం వెలిగిందొక వెలుగునిచ్చే ఎర్రకిరణం
కారుచీకటిలో
దట్టమైన అడవుల్లో
క్రూర మృగాల మధ్య, రెండు కాళ్ళ జంతువుల మధ్య
ఊపిరి పీల్చలేని గిరిజనులకై
ఎర్ర మెరుపు
అడివంతా క్రాంతించి కనిపించింది
మూగజీవుల బ్రతుకుల్లో
ఎర్రాటి కిరణమై వెలుగును ఇచ్చిందు
మేఘాల రాపిడితో రాలిపడ్డ పిడుగు
దోపిడి వ్యవస్థ అంతంకై రగులుతుంది
కమ్ముకున్న కారుమేఘాలు కరిగి
ములుకులాంటి చినుకులు రాలిపడ్డప్పుడు
విరగడి పడిన బీడు భూముల్లో
భక్తికై మొక్కలెన్నో మొలిచి
అడివికి ఆనందాన్ని తెచ్చాయి
మొక్కల్లో మొక్క ఎర్రమొక్క
కష్టాలకు వెరవకుండా వెనుకడుగు వేయకుండా
వెలుగుతూ వేయి చుక్కలకు దారి చూపింది
నీడలేని నిర్జీవులకు నిటారుగా నిలిచి నీడనిచ్చి
ఎండలో ఎండుతూ ఎండిపోయిన చెట్టై
వానలో తడుస్తూ చిరునవ్వులతో చిగురిస్తూ
చలికి వణుకుతూ
మంచునంతా తనపై మోసుకొని
కాపాడింది మమ్ములను
ఆటు, పోటులకు వంగని వృక్షం

గాలి, వానలను ఎదిరించి నిలిచిన వృక్షం
నిత్యం నిలిచే వుంది ఈ అడవితల్లి ఒడిలో
పచ్చగా చిగురిస్తూనే వుంటుంది మహావృక్షమై మా శంకరన్న
పోరాటపు ఫలితాలను
ఒద్దిగ చేసుకొని ముద్దాడుతూ, కాపాడుతూ
క్రమశిక్షణ నేర్పుతూనే వుండన్న
చిరకాలం ఈ గోండుల గుండెల్లో
గోదావరిలోయ పోరులో
సజీవంగా సాగే నదుల్లా
సమర శంఖంబూదుతావ్

*అమర వీరుడు కామ్రేడ్ శంకరన్నకు విప్లవ జోహార్లతో

## గురజాడ మార్క్సిస్టు దృష్టి

"మార్క్సిస్టు దృష్టి లేనిదే ఈనాటి సమాజాన్ని అర్థం చేసుకోవడం అసంభవం. గురజాడవారు మార్క్సిజం చదవలేదు. ఆయన ఆలోచనల్లో వర్గ సంఘర్షణ చోటుచేసుకోలేదు. అయినా ఆయన రచనల్లో ఒక ముఖ్యమైన మార్క్సిస్టు లక్షణం వుంది.

మార్క్సిజం తెలియని సంస్కరణవాద రచయితలు, సమస్యల్ని జీవితాన్నించి వేరుచేసి, 'ప్రత్యేకంగా' చూపిస్తారు. ఆ సమస్యలతోనే ఆ రచనలు కూడా నశించిపోతాయి. మార్క్సిజం తెలిసిన రచయితలు సమస్యల్ని సమగ్రమైన జీవితంలో భాగంగా చూపిస్తారు. ఇందువల్ల మారిన జీవితంలో, ప్రత్యేకమైన సమస్యలు సమసిపోయి కొత్త సమస్యలు పుట్టినప్పటికీ కొత్త సమస్యల్ని అర్థంచేసుకోడానికూడా ఆ రచనలు పనికొస్తాయి. కన్యాశుల్కం పుచ్చుకునే దురాచారం ఒకప్పుడు వుండేదని తెలియని వాళ్ళకూడా కన్యాశుల్కం నాటకంలో అనేక జీవిత సత్యాలు తెలుస్తాయి. గురజాడవారిలో ఈ మార్క్సిస్టు దృక్పథానికాకారణం నిశితమైన దృష్టి. జీవితం పట్ల నిజాయితీ, సాధించదల్చుకున్న సాహిత్య ప్రయోజనానికి కట్టుబాటు, గొప్ప కళాకారుడికుండే సంయమనం".

—మరుపూడి రాజేశ్వరరావు.

## సవరణ

జులై 1992 సంచికలోని ఈ క్రింది రచనలలో సవరణ ఈ విధంగాచేసి చదువుకోవాలి.

1. రెండవ కవర్ పేజీలోని తరగతి గది నా తుపాకి ! కవితలో 7వ. పంక్తిలో చివర "బత్తీల బజారుకీడ్చి" అనేదాన్ని "బత్తల బజారుకీడ్చి" అని చదవాలి.

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANASAHITI [Sahitya Samastha] (A.P.). at Chaitanya Printers Vijayawada-2. for Co-operative Press, Vijayawada
Working Editor : NIRMALANANDA

# భావితరానికి విద్య-సామాజిక బాధ్యత

మనం ఇరవయ్యో శతాబ్దం చివరి దశకంలో జీవిస్తున్నాం. ఇది శాస్త్ర-సాంకేతిక యుగం. కనుక వ్యావసాయక రంగం నుండి వైమానిక రంగం వరకు ఏ రంగంలో పనిచేసే వ్యక్తికైనా విద్య తప్పనిసరి. ప్రాథమిక విద్య నుండి ఉన్నత విద్య వరకు-అన్ని స్థాయిలలోను విద్యను సామాన్య ప్రజలకు అందుబాటులో ఉంచడం ప్రభుత్వ బాధ్యత. ప్రభుత్వ పాఠశాలలూ, ప్రభుత్వ సహాయం పొందుతున్న పాఠశాలలూ వాటి కర్తవ్య నిర్వహణలో పూర్తిగా వైఫల్యం చెందుతున్నాయి. ఈ కారణంగా కాన్వెంట్లు, పబ్లిక్ స్కూళ్ళు, రెసిడెన్షియల్ పాఠశాలలు అసంఖ్యాకంగా వెలుస్తున్నాయి. సామాన్య ప్రజలు తమ పిల్లలను ఈ విద్యా సంస్థలలో చేర్పించడం ఆర్థికంగా సాధ్యమయ్యే పనిగాదు. ప్రభుత్వం కోట్ల రూపాయల ప్రజల ధనం వెచ్చించి నడుపుతున్న పాఠశాలలను సక్రమంగా పని చేయించడం వైపు ఆలోచించడం మాని, విద్యను ప్రయివేటీకరణ వైపు మళ్ళిస్తోంది. ఇది సామాజిక నేరం. ప్రజలు ఈ ప్రమాదాన్ని గుర్తించి ప్రభుత్వ పాఠశాలలను సక్రమంగా పని చేయించే దానికి ప్రభుత్వంపై తగిన వత్తిడి తేవాల్సి ఉంది. అయితే పాఠశాలల ఈ దుస్థితికి కారణాన్ని ప్రభుత్వాలు ఉపాధ్యాయులపై మోపుతున్నాయి. ఉపాధ్యాయులు కూడ ప్రజల్లో భాగమే. కనుక ఉపాధ్యాయులు వారి బాధ్యతను గుర్తించి, విద్యారంగానికి పట్టిన దుస్థితిని తొలగించడానికి ప్రజల మనుషులుగా ఆలోచించి, ప్రజలతో కలసి ఉద్యమించాలని కోరుతున్నాం.

ఇట్లు

**బి. వి. సుబ్బయ్య**

బి. వి. యస్. ఆర్. స్కూల్ అండ్ కాలేజ్

పేర్నమిట్ట-523 225, ప్రకాశంజిల్లా

PRAJA SAHITI     AUGUST. 1992     H/VJ-108



# తునికాకు కూలి పోరాట పాట

— నూతన్

మల్లత్తుంద్రే - తునికాకుల కల్లపోల్లు
మల్లత్తుంద్రే - మన నెత్తురు పిండేటోళ్ళు ॥మల॥

గుత్తేదార్లు కల్లేదార్లు - సావెదార్లు చౌకిదార్లు
లచ్చల రూపాయలను - మనల నుండి పిండడానికి
కళ్ళాలు పెట్టుకుంట - మనలనంతా ముంచడానికి ॥మల॥

సుక్కపొద్దు జాములేచి - నీళ్ళత్తి బకొట్టుని
గుట్ట గుట్ట ఎక్కుకుంట - సెట్టు సెట్టు తిరుక్కుంట
పొక్కలొచ్చె ఎండలోన - అగ్గిలాంటి సెగల్లోన
ఇసప్పురుగు లన్నిదాటి - తునికాకును దెంపాలే ॥మల॥

(మిగతా 77వ పేజీలో)

A Publication of Jana Sahiti (A. P.)